## రాజపోషకులు.

13. ,, దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుజమీం
దారువారు. కాకినాడ.

14. ,, జవ్వాది లక్ష్మయ్యగారు యూనియన్ బోర్డు ప్రెసిడెంటు తాలూకా &
డిస్ట్రిక్టుబోర్డు మెంబరు. పెనుగొండ.

15. ,, కే. వి. ఆర్. శర్మగారు. ప్రొప్రైటర్ జర్మన్ ఇన్‌జక్షన్ కే.
ఫ్యాం. వృథగౌతమి—

16. ,, మొసలికంటి రామారావుగారు. ల్యాండులార్డు కాకినాడ.

17. ,, లంక రామారావుగారు యం. బి. (హోమియో) కాకినాడ.

18. ,, ముత్యాల సుబ్రహ్మణ్యంగారి కుమారులు పీర్‌సాబుగారు
ఐరన్ మర్చంట్సు & కమీషన్ ఏజంట్సు రంగూన్—కాకినాడ.

## పోషకులు.

1. ,, శ్రీ మోతే గంగరాజుగారు.
2. ,, మోతే నారాయణరావుగారు.
ఎం. ఎల్. సి.
3. ,, మోతే నరసింహారావుగారు.
4. ,, మోతే కృష్ణారావుగారు.

(1–4:) విస్సన్నపేట, గుండేపల్లి. జమీందార్లు, ఏలూరు.

5. ,, గుత్తా వెంకయ్యచౌదరిగారు, మేనేజింగు ప్రొప్రైటర్ శ్రీపాండురంగ
సినిమా, ఏలూరు.

6. ,, తాటిమేటి విశ్వనాథంగారు, L. M. P. పెనుగొండ.

7. ,, మానెం కృష్ణమూర్తిగారు, పెనుగొండ.

8. ,, కాకర్ల సత్యబ్రహ్మానందరావు, నర్సాపురం.

9. ,, కలిదిండి వెంకటాద్రిరాజుగారు, ల్యాండులార్డు శృంగవృక్షం.

10. ,, కొచ్చెర్లకోట వెంకటాద్రియుడుగారు, ల్యాండులార్డు కలవలపల్లి.

11. ,, వనారస గోవిందరావుగారు, మేనేజర్ సురభికంపెనీ పోలసానిపల్లి.

12. ,, చిట్టూరి ఇంద్రయ్యగారు, ప్లీడరు నర్సాపురం.

13. ,, కాపవరపు వెంకటచలంపంతులుగారు, తహసీల్‌దారు పెంటపాడు.

14. ,, టి. జి. బంగారుస్వామి సెట్టిగారు, రాజమండ్రి.

15. ,, వి. నరసింహారావునాయుడుగారు P.W.D. Overseer మారుటేరు.

16. ,, దాట్ల వెంకటనరసింహరాజుగారు, శృంగవృక్షం.
17. ,, పైడా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సువారు జమీందార్లు అన్నదేవరపేట
ఎగ్రైరాయస్టేట్సు—కాకినాడ.
18. ,, మల్లిడి సత్యనారాయణరెడ్డిగారు రంగూన్.
19. ,, కొప్పూరిపద్దిరెడ్డిగారు. పెనుగొండ
20. ,, వాడ్రేవు జగ్గరాజుగారు ఆర్గనైజింగు ఇన్స్పెక్టర్. మైసూరు ఎగ్రికల్చ
ర్ సైరీఫారం— అమలాపురం.
21. ,, అల్లంరాజు రామమూర్తిగారు. ల్యాండులార్డు ఇంజరం.
22. ,, మహేంద్రవాడ అచ్చుతరామయ్యగారు ,, ,, ,, ,,
23. ,, షామిర్ ఖాన్ సాహేబుగారు ,, ,, ,, ,,

## సహాయులు.

1. ,, కె. బాబూరావుగారు, Agent ware House, Madras.
2. ,, వరదా పైడన్నగారు, గోల్డు స్మిత్ పెనుగొండ.
3. ,, మన్నె సత్యనారాయణమూర్తిగారు, ల్యాండులార్డు కోడమంచిలి.
4. ,, కొండూరి నారాయణరావుగారు, మర్చంటు, ఏలూరు.
5. ,, తాడి వెంకటస్వామిగారు, ల్యాండులార్డు పెనుగొండ.
6. ,, కొల్లూరి సత్యానందంగారు, ల్యాండులార్డు పల్లంకుర్రు,
7. ,, పెనుగొండ విశ్వనాధంగారు, శ్రీరామాంజనేయ రైస్‌మిల్లు ప్రొప్రై
టర్ నూజివీడు.
8. ,, తేతలి సత్యనారాయణరెడ్డిగారు, రైసుమిల్లు ప్రొప్రైటర్ పెనుగొండ.
9. ,, పి. ముద్దుకృష్ణన్ నాయుడుగారు, District Munsif పెద్దాపురం.
10. ,, చింతా సోమిరెడ్డిగారు— కంట్రాక్టర్, అహమ్మదీయ రైస్‌మిల్లు
నిడదవోలు.
11 ,, గుడిమెట్ల వీర్రెడ్డిగారు— మాట్టేరు.
12 ,, గుమ్మా సత్యనారాయణగారు వకీలు విశాఖపట్నం.
13. ,, సాగి వెంకట సుబ్బరావు అండ్ సన్సువారు అనకాపల్లి
14. ,, నూరంపూడి సాంబశివరావుగారు ఆర్గనైజర్ ఆంధ్రయిన్సూరెన్సు
కంపెనీ— తణుకు
15. ,, తల్లంరాజు రామచంద్రరావుగారు. ఏజంటు సన్ లైఫ్ యిన్సూరెన్సు
కంపెనీ— తణుకు.

16. ,, మొసలికంటి కొండలరావుగారు, ఎగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటర్ ఏలూరు
17. ,, కూనే నాగభూషణరావుగారు కోర్టుమర్చంటు ఏలూరు
18. ,, రామినీడు శీతాపతిరావుగారు— లక్ష్మీపోలవరం.
19. ,, తవ్వాల వెంకటశేషాచలపతిరావుగారు— రాజమండ్రి
20. ,, కౌసాని అప్పారావుగారు— నిడదవోలు.

## కేశధాత్రీతైలము.

ఈతైలము శిరస్సునకు మర్దనాచేయుటవలన తలవెంట్రుకలు బాగుగ వృద్ధిపొందుటయేగాక శిరస్సునందుండు సర్వరోగములను తొలగించి శిరమునకు చలువ కలుగజేసి నేత్రరోగములను పోగొట్టును.

సీసా రు 1—0—0. ½ డజను రు 5—8—0.

ఇతర వంటఅవుషధములుకూడ మాయొద్ద దొరకును.

ఇట్లు;
తోలేటి పార్వతీశం.
నేటివ్‌డాక్టర్ తణుకు.

## స్టార్ బామ్.

ఈబామ్ మర్దించుటవలన సకలవిషకీటకములకాట్లు, కీళ్ళనొప్పులు, తలనొప్పి వగైరాలు అన్ని నివారణఅగును.

సీసా రు 0—8—0. ½ డజను రు 2—8—0.

**Star Balm & Co., Tanuku.**

# సరస్వతీ గ్రంథమాల.

## కాకరపఱ్ఱు తణుకుతాలూకా, పశ్చిమగోదావరి.

ఈగ్రంథమాలయందు 3 మాసములకొక గ్రంథముచొప్పున నవలలు నాటకములు ప్రచురింపఁబడుచుండును.

సం|| చందా రు 2—8—0, ప్రవేశరుసుము రు 0—8—0.

1. కనకాంగి Approved 6 th. Jan 1925.
2. మదనసుందరీపరిణయము.
3. పేష్వానారాయణరావు Approved 24 th. May 1927.
4. సరోజినీభాస్కరము.
5. కీచకవధ.
6. ప్రహ్లాద.
7. ఆనందమయి I } Approved 16 th. Nov 1926.
8. ,, II } Approved 16 th. Nov 1926.
9. విజయశ్యామ్.
10. ప్రేమమహిమ I
11. ,, II
12 బిలమందిరము.
13. మహారాష్ట్ర జీవనప్రభాతము I
14. ,, ,, II
15. దుర్గావతి
16. హత్యానిరూపణము.
17. కథావళి. } Approved 13 th. Nov 1928.
18. నీరజ } Approved 13 th. Nov 1928.
19. } కష్టసుఖములు.
20. } కష్టసుఖములు.
21. నీలిపూలు.

# రామామృతం.

రిజిస్టర్ నెం. 1013.

రామామృతం సకల వ్యాధులకు సంజీవివంటిది. ఇందు చేర్చబడిన మందులు మూలికలు వగైరాలు మిగుల విలువగలవియు, శరీరారోగ్యమున కనుకూలమైనవియును. ఇది తలనొప్పులకు, కీళ్లనొప్పులకు వాతనొప్పులకు, వాపులకు, పేనుకొరుకు, తలవెండ్రుకలు రాలిపోవుట, తలచుండ్రు, తామర, గజ్జివగైరాలకు, తేలు జెఱ్ఱి మొదలగు విషకీటకముల కాట్లకు బాగుగ పనిచేయును. ఊపిరి నొప్పులు మొదలగువాటికి కూడ నెక్కువగ పనిచేయును. ఈఅమృతం పనిచేయనియెడల తిరిగి ఖరీదు యిచ్చివేయబడును.

శాంపిల్ సీసా కోరువారు 4 అణా బిళ్లలు పంపించిన వుచితము గా బంపుదుము.

ఒక సీసాఖరీదు రు 1 3 సీసాలు ఒకేసారి తీసుకొనువారికి పోస్టేజి వుచితము ఒక రామామృతము కేలండరు పంపించెదము.

Manufactured by,
డి. వెంకటరత్నం & కో
వైజాగ్ పట్నం—

## RAMA AMRUTAM.

Reg. No. 1013.

A boon to travellers & Sportsmen. Guaranteed cure for all aches. Specially recommended for Alopecia (Bald Headedness) & Skin diseases, Chest complaints & Scorpiam stings.

*Manufactured by*

**D. VENKATARATNAM & Co,**
**Vizagapatam.**

# HAIR TONE.



లోకోత్తరమగు నీ టానిక్‌ను ప్రతిదినము తలకురాచి మర్దన చేసుకున్నచో శిరోజములను పొగగాపెంచి కాంతినిచ్చి కుదుళ్లు గట్టి పరచును. సాధారణముగా ప్రమేహామువల్ల వచ్చు కండ్లమసక, నీళ్ళు కారుట, తలనొప్పి, విచారమును మాన్పును. విద్యార్థులకు దీర్ఘాలోచనపరులకు మెదడునకు బలము, కండ్లకు చలువ కలుగజేసి జ్ఞాపకశక్తి, మనస్సునకు ఆనందము నిచ్చి అది ముఖమున వికసించి యౌవనమును తోపజేయును. తెల్లవెండ్రుకలను క్రమముగా నల్లపరచును. నిద్రలేమిని పోగొట్టును. ఈ టానిక్‌ను వృద్ధులయినవారు శరీరమునకు అభ్యంగమునకు వినియోగించిన నరములకు సత్తువ కలుగజేసి అందువలన వీర్యము గట్టిపడి చాలకాలము అత్యంత సౌఖ్యమును పొందుదురు. స్త్రీల వంధ్యాత్వమును పోగొట్టి సంతానవంతులుగా జేయును. ఈ టానిక్ వనమూలికలచే ఆయుర్వేదయూనాని శాస్త్రయుక్తముగా తయారగుటవలన రక్తపిత్తము, క్షయ, జ్వరము తాపము, చెమట, దౌర్గంధ్యము, కుష్టువు) దురద ఇవి నశించును.

బుడ్డి-1కి వెల రు 1—0—0.    వి. పి. ఛార్జి ప్రత్యేకము

టి. బాపిరాజు, డాక్టర్.

తాడేపల్లిగూడెం, (పశ్చిమ గోదావరిజిల్లా.)

# ఇంజక్షను లేహ్యము.

నిమిషమునకే గొప్పగుణము ! ఇంతవరకు ఇట్టిఔషధరాజములేదు !

40 దినములకు సరిపడు తు 5లు డబ్బీ రు 40—0—0లు.

ఎట్టిరోగము ఎట్టికష్టదశలోనుండినను దివ్యమగు శక్తినిచ్చి, రోగ మమాపి, వంశములనిల్పు నట్టి ఘనౌషధము. ప్రపంచకములో యిట్టి మహోత్కృష్టవుషధ మేరిచేతను తయారుచేయబడి యుండలేదు. పటాటోప ప్రకటనలగాంచి మోసపోయినవారు దివ్యౌషధముల తృణీకరించుటవల్ల గొప్పకష్టముల నొందెదరు. కుష్ఠురోగములు, కుళ్ళువ్రణములు, సవ్వాయి, సెగజాడ్యములు, మూర్ఛ, పిచ్చి, చెవుడు, మశూచికములు, వాటి అంగవైకల్యములు, గ్రుడ్డి, నపుంసకత్వము, మేహరోగములు, పాండురోగములు బొల్లి, ఉబ్బసరోగములు, మహాకష్టవ్యాధులు మొదలగు సమస్త స్త్రీపురుషరోగములు చెప్పినట్లు నివారణచెందును. గ్యారంటీ గ్యారంటీ.

ఏదేశములోను, యెవరును, యెన్నడును చేయలేని గొప్పఔషధము. వేలకువేలు వ్యయపరచి నూతనముగా తయారుచేయబడినది. నిమిషమునకొకసారి రోగిని మంచిస్థితిలోనికి దెచ్చును. పూచీగా ఒక్కమోతాదుకే మంచిగుణము జర్మనీ, జపాన్, ఇంగ్లాండు, అమెరికా, యిటలీ, టర్కీ, గ్రీసు, ప్రాన్సు, ఆష్ట్రేలియా, ఆఫ్రికా, తదితర మహాదేశములందున్న మేధావంతులు, దీని నిర్మాణరహస్యమెరుంగరు. ఆంధ్రమండలమునందిది మాచేతనే తయారుచేయబడినవి. దీనికి మేమేయాజమానులము. దీని గొప్పశక్తికి మేము మిక్కిలి గర్వించుచున్నాము. ఈఔషధము మూలమున మీరోగము కుదురనిచో మీసొమ్ము మీకు నిరాక్షేపణముగా తిరిగి పంపి వేయుదుము. వివరములకు రు 0-2-0 స్టాంపులు, కేటలాగునకు రు 1-0-0 న్ని పంపించవలెను. కార్డువ్రాసిన జవాబీయబడదు.

దిజర్మన్ ఇంజెక్షను లేహ్యమాన్యుఫేక్చరింగు కంపెనీ,

వృద్ధగౌతమి, గాడిలంక, ముమ్మిడివరం పోస్టు (ఈస్టు గోదావరి జిల్లా.)

# మకరధ్వజము

(స్వర్ణయుతము)

ఆయుర్వేద ఔషధములన్నిటిలోను మకరధ్వజము అమోఘమని యెల్లరకును విదితమే. అనుపాన భేదములతో ఏవ్యాధినైనను దీనితో నివారణచేయవచ్చును. ప్రతియొక్క మోతాదునకును గుణము కనుపించును దీనిని సేవించుటవలన నిక్కాక, నీరసము, పిరికితనము, గుండెదడ, పైత్యోద్రేకము, అతిమూత్రము, శుక్లమేహము, జ్వరము, దగ్గు, మూలశంక మొదలగు వ్యాధులన్నియు నశించును, దీనికి సరిపడు ఔషధరాజమింకొకటిలేదని గ్యారంటీ చేయుచున్నాము. ఇది శుద్ధిచేసిన బంగారు, రసము గంధకసంపుటీవలన ఆయుర్వేద శాస్త్రానుసారముగా తయారుచేయబడిన ధనవంతులకే కాక బీదసాదలకందరికి అందు బాటులోనుండుటకు స్వల్ప వెలకే అమ్ముచున్నాము. అనుపాన వివరములు వగైరా మందుతో పంపబడును. వెల తు 1కి 16-0-0 మాత్రమే. ఇదిగాక మావద్ద గ్యారంటీగా పనిచేయు బలయమానుల నివారణి కూడా కలదు సీసా 1కి 1-8-0 మాత్రమే మావద్ద అన్నివిధములైన కళ్లజోళ్లు, జర్మన్ రబ్బరు సామానులు సరసమైనధరలకు అమ్మబడును.

మూర్తి అండ్ కో

మార్టేరు. పశ్చిమ గోదావరిజిల్లా.



# సిరిపూలు.

## వృథాప్రయాస.

౧

ఆ వూళ్లో రామమూర్తి కాపురమున్నాడు; బడిలో చదువుతూ వున్న డిటెక్టివ్ సర్వేశంకూడా - తండ్రికా వూరిలోనే పనవడమువల్ల - రామమూర్తితో స్నేహంగా వుండి చదువుతూ వున్నాడు.

సుబ్బారావు స్వగ్రామంలో రెండుమూడు దండయాత్రలు వేసి యీ వూళ్లోనైనా ముక్తివుంటుందేమో అని హోటల్లో భోజనంచేస్తూ రామమూర్తియింట బసబెట్టి చదవడానికి వచ్చేడు.

ఈ ముగ్గురూ స్నేహితులు. ఆ స్కూల్లో శకుంతలనే వొకపిల్ల యేడోక్లాసు చదువుతూవుంది. ఆ పిల్లని సుబ్బారావు ప్రేమించేడు. పెళ్లి జేసుకుంటానని తన స్నేహితులతో అంటూవుండేవాడు. ఆతగాడికికి చదువుమీద దృష్టిలేదు. ఎన్నోవిధాల ప్రయత్నాలారంభించేడు. ఇలా వున్నాయి పరిస్థితులు.

౨

“రామమూర్తి!” స్కూలుకు వెళ్తూవున్న రామమూర్తిని రాబర్టు ది - బ్రూసు పిలచేడు. బ్రూసనగానే - స్కాట్లెండు దేశపు బ్రూసనుకోవద్దు. పేరు కాశీరాజు మాచిరాజు; ఆ స్కూలు రయిటరును బ్రూసని పిలుస్తారు; అలాగు అనడములో కొంత న్యాయముంది. 

గ్లాండుమీద రాబర్టు-డి-బ్రూసెలా గేడుమారులు దండెత్తేడో, అలాగునే కాశీరాజు మాచిరాజునూడా మెట్రిక్యులేషను పరీక్ష ప్యాసవడానికేడుమాట్లు దండెత్తేడు.

రామమూర్తి, మాచిరాజు దగ్గరకెళ్లి «ఎందుకండీ!» అని అడిగేడు. తమలపాకులు నములుతూ, రైటరు—

«ఏమోయి! ఆఖరుకు మీ సుబ్బారావు తెలివిలాగు ప్రతిఫలించింది! ఇదే మొదటిప్రయోగంలావుంది! ఇందులో నీకేమైన పాలుందా?» అని విషపునవ్వు నవ్వుతూ అడిగేడు.

«పాపం! ఏమీ తెలియని రామమూర్తి కొంతవరకాలోచిస్తూ నిలిచిపోయేడు. «ప్రయోగమా! మీ రేమంటున్నారో నాకు తెలియడములేదు" అని అన్నాడు.

«పాపం! ప్రయోగమేమిటోనా! ఏలాతెలుస్తుందోయి, శకుంతల కుత్తరాలు వ్రాయడమంటే-" అని మాచిరాజంటూవుంటే రామమూర్తామాటల కడ్డువచ్చి—

«అదేమిటండి!" అని నిర్ఘాంతపోయేడు. అప్పుడతని ముఖము మీద తాండవించిన కళలు వ్రాయడము చాల కష్టమైన పని. మొదట తెల్లబోయేడు; - రెండోనిముషాని కాశ్చర్యవంతుడయ్యేడు; - మూడో నిముషానికి ముఖమెఱ్ఱబడ్డది. ఐదు నిముషా లేకగ్రీవంగా అగ్గిగురిసిన దనవచ్చు.

«ఈ మడతమాటలుగాక సరిగా చెప్పండి!" అని గట్టిగాఅడిగేడు.

«చెపుతా, చెపుతా" అని తలవూపుతు జేబునుండొక వుత్తరం దీసి మూర్తి చేతికిచ్చేడు.

రామమూర్తి దానిని తనలో చదువుకొన్నాడు. అడుగున సుబ్బారావు సంతకము, పైన «ప్రియమైన శకుంతలా!" యీ రెంటి మీద మళ్లీ వొక్కమారు దృష్టిని బోనిచ్చేడు. తెలిసింది; - సంగతి అంతా తెలిసింది. «ఇప్పుడేమంటావు?" «ఈ విషయం నాకు తెలియదు. ఈ ఉత్తరం మీరు చూపించేవరకు నే నెరగను." «నేను, యీ వుత్త

రాన్ని శకుంతల తండ్రికి చూపిస్తే యెంత గొడవౌతుందో యెరుగుదువా? నాశనమైపోతాము గాని యింకేమైనా వున్నదా!" అని మాచిరాజన్నాడు. "అది నిజమేనండి" అని రామమూర్తి తలవూపేడు. ఇలాగు వొక పావుగంట మాటలాడేరు. ఆఖరుకు, యీ వుత్తరము చింపివేసిన సంగతి తెలుపకుండా వుంచి ఆతనిచేత అపాలజీ యిప్పించేటట్లు రామమూర్తి మాచిరాజలు సమాధానపడ్డారు.

పై ననుకున్నవన్నీ జరిగేయి. సుబ్బారావుకు భయముమాత్రం పోలేదు. ఇంకా మాచిరాజుదగ్గర వుత్తరంవుందనే అతని భ్రమ. "వెర్రిపనిచేసేను" అని అనేకమారులనుకొనేవాడు; తిండికూడ సరిగా తినడము మానివేసేడు. ఎంతసేపు చూచినా వొకటేభయం; ఒకటే విచారం ఇదంతా చూస్తావున్న రామమూర్తికి జాలివేసింది. అంచేత వొకనాడు వుత్తరము చింపివేయబడిన సంగతి చెప్పేడు. మొదట సుబ్బారావుకు నమ్మకములేదు. ఎలాగైతేనేమి రామమూర్తి నమ్మించేడు.

ఇన్నినాళ్లు నవ్వన్న దెరుగని సుబ్బారావు ముఖంమ్మీద చిరునవ్వులు తాండవమాడడము మొదలుబెట్టేయి. అమ్మయ్య! గుండెల్లోని రాయి బయటబడ్డదనుకొన్నాడు. కాని మన సుబ్బయ్య యింక నన్నా తిన్నగ సంచరిస్తాడా?

# 3

మడుగులో నాటుకున్న కలువదుంప మూడునాళ్లలో మడుగంతా అల్లేస్తుంది; ఆలాగే, మన సుబ్బారావు మనస్సులో మొలిచిన మూర్ఖపు మోహముండే, బాగా వేళ్లుదన్నుకొని చిలవలకు పలవలల్లి చీదరగా బెరిగిపోయింది. ఇంకొక వుద్దేశానికి తావేలేదు. నెల రోజులు గడచేసరికి యేనుగువంటి మనిషి పీనుగయ్యేడు. దీనికి గారణమేమిటంటూరా, మన మెరిగిన మూర్ఖపుమోహామే! ఆటలంటే అసహ్యం;- చదువంటే చికాకు;-పాపం! అతనికి నెలంటే నాలుగేళ్లలాగుంది.

ఒకనాటిరాత్రి రామమూర్తి భోజనంజేసి పుచ్చపువ్వువంటి వెన్నెల్లో, కూర్చోని తనలోకీగా జంర్ఘుటోటీలు, జంఝులలు, మోహానలు, మై

ళ్లతరవున మైళ్లు వెళ్లేటట్లుగా విసరేస్తూవున్నాడు. చంద్రుడు నవ్వుతూ వున్నాడు. మహాచక్కగా వుంది రాత్రి. ఇంతలో సుబ్బారావు మన డిటెక్టివు సర్వేశ్వరరావుతో రామమూర్తి యింటికి తయారయేడు.

రావుద్వయము రామమూర్తి కిరుప్రక్కలా అమిరింది. ఇంక లోకాభిరామాయణం మొదలెట్టేరు. డిటెక్టివు చిత్ర చిత్రాలు చెప్పడ మారంభించేడు. మధ్యమధ్య ప్రశ్నలు వేస్తూవుంటే రామమూర్తి సమాధానాలు చెప్తూవున్నాడు. కాని, సుబ్బారావుమాత్రము కదలకుండా మెదలకుండా కూచున్నాడు. అతడేలోకములో వున్నట్లు తోచదు. ఏదో ఆలోచిస్తూ వున్నట్లు కనపడేవాడు.

పది, పదకొండు, పండ్రెండు గంటలు యిద్దరి పెళ్లాలాయన యింటిలో గడియారము కొట్టడము రామమూర్తి వింటూనేవున్నాడు కాని, ఆమహా వెన్నెల్లో స్వర్గ మనుభవిస్తూవున్న ఆముగ్గురకు నిద్ర రావడము లేదు. చిట్టచివరకు సుబ్బారా వెలాగైతేనేమి తెగువచేసేడు. «మీాయిద్దరితో వొక సంగతి చెవుతాను తిట్టరుకదా?" అన్నాడు.

ఈసుబ్బారావు చెప్పేదేమిటి? ఎవరెరుగని రహస్యం! పాపం? ఈమహారాజు కున్నదొక్కటేచింత;- అని శకుంతలమీాద జారిన వెఱ్ఱి మోహం! సుబ్బారావు ముక్తసరిగా మూడు ముక్కల్లో సంగతి తేల్చేడు. మూర్తి ముఖం ముడుచుకున్నాడు. డిటెక్టివు సర్వేశం, మహాదీర్ఘాలోచన చేయనారంభించేడు. ఇంక సుబ్బారావు యిద్దరివుద్దేశాలని కనిపెడుతూవున్నాడు. ముగ్గురూ పదినిముషాలు మౌనవ్రతముదాల్చేరు. తరువాత సర్వేశం, రామమూర్తితో—«రామమూర్తి! ఈ విషయంలో నీ వుద్దేశమేమిటి?" అని అడిగేడు. రామమూర్తి జవాబీయలేదు; డిటెక్టివు మళ్లీ పలుకరించేడు. మోటతనము చేస్తే బాగుండదని.

«సర్వేశం? ఈవిషయంలో నేనేమీాచెప్పను. ఒక మాటుత్తర మువ్రాసి వయిటరుచేతులో చిక్కాడు. ఎలాగో మిడబెట్టి దాన్ని చింపించేను. మళ్ళీ యీావెధవపనా?" అని అన్నాడు. డిటెక్టివు మళ్ళీ ఆలోచించి - «ఈదఫా వుత్తరము పోస్టులో వెయ్యవద్దు; వేరొక విధంగా చే

ద్దాం. పాపం ! సుబ్బారావు సంగతి వింటే జాలేస్తూవుంది; అత డిలా ప్రియత్నముచేయడము తప్పే; అది నేనొప్పుకుంటాను. కాని, స్నేహితు డింతపట్టుబట్టేడు గనుక మన మేలాగయినా సహాయం చేయాలి మరి” అన్నాడు.

“ఔను. నీవన్నట్లు సహాయముచేయడము మన పని కాని యిటువంటి తెలివితక్కువ పనులకామరి ! పిడుక్కీ, బియ్యానికి వొకటే మంత్రమా ?” అని రామమూర్తి బదులు చెప్పేడు.

ఇలాగు చర్చించి చర్చించి ఆఖరుకు సుబ్బారావు మళ్ళీ వొక వుత్తరము వ్రాసి సందులో బోతూవున్న శకుంతలచేతికి స్వయంగా అందిచ్చి, సాయంత్రి మేదోవొక నిఖారసు జవాబు ఆమె నిమ్మనేటట్టు తెలియజేయడము మంచిదని స్థిరపరిచేరు.

తొమ్మిది గంటలవరకు సుబ్బారావు శకుంతల నడచే సందులో కాచేడు. మామూలుకన్న మూడురెట్లు సెంటెక్కువగా జేబుగుడ్డమీద వొలగబోశేడు కాబోలు, సందంతా గుమ్మెత్తిపోతూవుంది !

చేతి గడియారము చూస్తూ, సుబ్బారావు సెకండ్లు. నిముషాలు లెక్కబెడుతూ, యిటు అటూ తెగజూస్తూవున్నాడు. శకుంతల పుస్తకాలు బట్టుకొని దారిబడిపోతూవుంది. తన్ను జూచి వెనక్కిపోతుందనో లేక మరెంచేతనోగాని రావు గోడ ప్రక్కనక్కి, శకుంతలను దగ్గరగా రానిచ్చి దారికడ్డుగావచ్చి సీమనుండివచ్చిన దొరలాగు-

“గుడ్‌మార్నింగ్ మిస్ శకుంతలా !” అని కంగారుగా అంటూ “నీ వొకమారీయుత్తరాన్ని సావకాశముగా చదవాలని నాకోరిక. నీవు నమ్మతావో లేదో గాని, నిన్ను మనఃపూర్తిగ ‘లౌ’ చేశాను. నీవు తప్పకుండా నాకనుకూల సమాధాన మిస్తావని నావుూహ. ఎక్కువ మాటలాడడాని కిదితావుగాదు; నేనుసాయంత్రేం మళ్ళీ నిన్నిక్కడే కలసికొంటాను. అప్పుడు జవాబు తప్పకుండా యియ్యాలి” అని రెండు నిముషాలు మొట్టబెట్టి వుత్తరం అందించబోయేడు.

శకుంతల మాటాడలేదు; ఖాళీగావున్న యెడమ చెయ్యేనన్నా

పత్రికన్నా తను కొనడానికి చూచలేదు. అంత సుబ్బారావు—

“అందుకిలా సందేహిస్తున్నావు? దీన్ని తీసుకో; తప్పులేదు” అని తొందరపెట్టాడు.

ఈ ఉపకారాన్ని వదలించుకొనడానికి వేరొకవుంత లేదని తెలుసుకొన్న శకుంతల అప్పత్రికను అందుకొంది.

సుబ్బారావు సంతోషము కొండందుకొంది. అతగాడు పత్రికకు తప్పుకున్నాడు. తలవంచుకొని శకుంతలదారిని వెళ్ళింది.

మలుపు తిరిగేవరకూ సుబ్బారావు మహాఅనురాగంతో చూచి మరీ వెళ్ళేడు. శకుంతల రోడ్డుమీద వెళ్తూ వుత్తరములో నేముందో చూచి ముక్కలుచేసి పారవేసింది.

ముఖము మొండిచేటంత చేసుకొని సుబ్బారావుస్కూల్లో డిటెక్టివు, రామమూర్తి కూచున్న బల్లదగ్గర కెళ్ళి-

“మన పంతము నెగ్గింది, కోటమీద బావుటా యెత్తేం! అంతే? అంతే!!” అని గుజ్జువు నకిలింపు నకిలించేడు.

స్కూలునుంచి ఆఖరు గంట యెగగొట్టి మళ్ళీ సుబ్బారావు సందులో కాచేడు. కాని, తెలిసికూడా ఆసందునే రాడానికి శకుంతల అంతటి తెలివి తక్కువపిల్లా? అబ్బే! ఎత్తుకు పైయెత్తు వేసింది. మామూలు తోవమాని యింకొక తోవపట్టి యిల్లు చేరింది.

పాపం! సుబ్బారావు మాడి బొగ్గయ్యేడు. ముఖము వాడిపోయింది. మధ్యాహ్నపు రెండుగంటల చలాకీకూడ బండల బడ్డది.

* * * *

చంపగా చంపగా ఒకనాడు రామమూర్తి:—

“శకుంతల రోజూ తండ్రికాఫీపాలకోసము అరగందమువాళ్ళ దొడ్డిదగ్గరకు వెళ్తుంది. అక్కడ కలసికొనడాని కవకాశముంటుంది.” అన్నాడు.

అరగందము వాళ్ళ దొడ్డి ఫ్రూరి బయటుంది. తెల్లవారుజామున నే లేచి ఆచలిలో ఆదొడ్డిదగ్గరకు వెళ్ళి మూడురోజులు కాపలా కాచ్చే,

డు. కాని శకుంతల కనబడలేదు. ఇంకొకనాడు సుబ్బారావు తెగువజేసి చీకటిపడినమీాద శకుంతల యింటికి వెళ్లి గుమ్మముదగ్గర నిలబడ్డాడు. చావడిలో దీపము వెలిగించడానికి వచ్చిన శకుంతలను చూచి సుబ్బారావు ‘‘శకుంతలా!’’ అని మహాచక్కగా పిలిచేడు.

శకుంతల పిలిచిన దెవరో అని అగ్గిపుల్ల వెలిగించింది. ఇంకెవ్వరు! తన్నువలచి పిచ్చిబట్టి తిరుగుతూవున్న ఆర్టిఫిషలు మన్మధుడు!

‘‘శకుంతలా!’’ అని పిలిచి సుబ్బారావు పిలుపుకు బదులుగ యెవ్వరోగాని- ‘‘ఛీ! ఎన్ని పరాభవాలు జరిగినా బుద్ధిలేదు! సిగ్గుతెచ్చుకొంటే మేలు. పో! గడపదిగి!!!’’ అని బదులుచెప్పేరు.

ఇలాగు సుబ్బారావును దీవించినది శకుంతలో, మరెవ్వరో గాని కంఠము మట్టుకు స్త్రీకంఠములాగే వినబడ్డది. ఎవ్వరో అనుకొనడానికి ఆయింటిలో వున్నది శకుంతల, ఆమెతల్లి—తప్ప వేరెవ్వరూ స్త్రీలు లేరు. అటువంటి సమయంలో యీలాగు సుబ్బారావును దీవించినది శకుంతలనే అని అనుకుంటాను. కాని సుబ్బారావేమంటాడో! అంతవరకూ యెందుకు? ఈపరాభవాన్నెవరితోనైనా చెప్తాడా? లేక గప్‌చుప్‌గా మూతబెట్టి వుంచుతాడా? ఆవిషయము మాత్రం గ్రహించడము కష్టము. కొంచము ఆగుదాం అంతా తెల్తుంది. తొందరెందుకు? మనమంత అర్జెంటుగా వెళ్లవలసిన పనేమీాలేదు. సావకాశంగా చివరవరకూ చూద్దాం.

యవ్వనము—యవ్వనములో వుద్రేకము—ఉద్రేకంలో వొళ్లు తెలియని సమయాన్నుద్భవించిన మూర్ఖపుమోహం— ఆమోహంలో—ఆయంధకారంలో, వెఱ్ఱివలపు- వెఱ్ఱివలపువలన జనించిన ప్రేమ- ప్రేమ కాస్పదులైనవారు లొంగక పోవడము- లొంగకున్నందువల్ల హృదయంలో పెరిగే అధికవాంఛ- వాంఛ నెరవేరనందున విచారం-ర విచారంవల్ల బెంగ- ఇవి వున్నాయే, వొకదాని తరువాతొకటి పుట్టడము, పెరగడము, విజృంభించడము, నానాగు మీాసాల నవయవ్వనులకు తెలియచేయవలసిన అవసరము లేదు.

బెంగ! బెంగ!! అబ్బ మహాచడ్డది కదూ !!

ఉప్పువేసిన మట్టికుండలు, అల్యూమినియము గిన్నెలు యేలాగు తినివేయబడి చిల్లులు పడునో, ఆలాగే బెంగపడ్డ మనస్సులున్నాయే, కృంగి కృశించి పోతాయి. తిండితినినది, లేనిది, చేయవలసిన పనులు చేస్తున్నది, లేనిది, యేమీ తెలియదు. ప్రపంచమంతా వొకటి, బెంగ బడ్డమనస్సు లొక్కటి. మనసుబ్బారా వీప్రపంచమందే ప్రస్తుతం చేరి నవాడు. డిటెక్టివు, వుపాయాల మీదుపాయాలు ! ప్లానులమీద ప్లాను లువేస్తేవాడు ! కాని, వాటివల్ల లాభములేకపోయింది.

"ఇంకాలస్యం చెయ్యకూడదు; ఇంకొక్క సాహసకార్యం; దాని తో యేదో యొకటి తేలిపోవాలి" అని సక్రోశము సుబ్బారావుబు అనుకొన్నారు.

అయ్యో వెఱ్ఱి సుబ్బారావూ! వెఱ్ఱి సుబ్బారావూ !! ఇంకనన్నా బుద్ధి తెచ్చుకోవా? నీ పీ వూరొచ్చిన దెందుకు? నీవు చేస్తూవున్న దేమి టో, కొంచ మాలోచింపవా? తల్లిదండ్రులు, మన అబ్బాయి యేదో మహాకష్టపడి చదువుతూ వున్నాడు అని అనుకొంటూ, ప్రతినెలా కుఱ్ఱా డేమికష్టపడిపోతాడో అని సమయానికి సొమ్ములేకపోతే, తలైనా సరే తాకట్టుబెట్టి వెంకటేశ్వరుని డిబ్బీముడుపులాగు ఒకటోతారీకుకు డబ్బు సమర్పిస్తూవుంటే, నీవిలా చేయడము న్యాయమా! నీవు శకుంత లను ప్రేమించి లాలిస్తావనా మీ తల్లిదండ్రులు పంపేరు? సౌందర్య రహస్య కళావేత్త రామమూర్తి దగ్గరనుండి కందిరీగలాగు "ఫేసుపౌడ ర్లు, క్రీములు యీవెర్రివేషాలవల్ల ఉన్నకొంచము అందము వూడు తుంది" అని చెవిదగ్గర గీపెట్టినప్పటికిని లెక్కజేయకుండా డబ్బు తగల వేసి లేనిపోనివన్ని కొంటున్నావుగదా? ఈనాలుగు రోజులే యీభోగా లు; తరువాతమాట అక్కర్లేదా? అబ్బాయీ! నేనొక్కటే మాట చెపుతా! వింటేవిను లేకపోతే లేదు. నీవంటే శకుంతల కిష్టములేదు; నిన్నామె ప్రేమించదు; నీప్రయత్నాలన్నీ బూడిదలో బోసిన పన్నీరు ప్రయోజనం. అటుమీద నీయిష్టం.

౫

అమావాస్యరాత్రి; తొమ్మిదిగంటలైంది. పైటలు సర్దుకుంటూ బయట అరుగులమీద పచారు చేస్తూవున్న భోగపుస్త్రీలు, సానివీధిని తిరుగుతూవున్న సరసులు, కుంకుడు గింజలంతంత నల్లమందు మాత్రలు బిగించి కునుకు పాట్లుపడుతూ మాట్లొగ్గి కూర్చుండిన ముసలివేశ్యమాతలు, మినిట్ సిగరుకాలుస్తూ పేక బెత్తము చేతబట్టుకొని యెక్కడికో ప్రతిరోజూ బయల్దేరి వెళ్ళేఅలవాటు గల భార్యలేని - ప్లీడరుగారి- తండ్రి వేశ్యవీధిలో నున్న 'పెంపు కల్లి' దుకాణంవారలు, తమ ప్రయత్నము చేయడానికి సిద్ధమైవచ్చిన సుబ్బారావు, రామమూర్తి, సర్వేశం, వీరిని చూచి మొరిగే లాయరుగారి కుక్క, పనులన్నీ చక్కబెట్టి, కిర్రుజోడు తొడిగి, ముత్తరుపూలు తలకుజుట్టి, స్వర్గానికి బెత్తెడు దూరంలో నుంచే సారాచుక్కవేసి, "వుషారుపాట" పాడుతూ తూర్పువీధికి బోతూవున్న మేజిస్ట్రేటుగారి వంటపుట్టి తప్ప తక్కిన పట్టణమంతా నిద్రబోతూవుంది.

సర్వేశం చేతులో మూరెడు కర్రవుంది. రామమూర్తి పాదాల కాకుచెప్పులున్నాయి. ఇంక సుబ్బారావు నొక్కవాక్యములో చెప్పడానికి నావల్లగాదు. సుబ్బారావు సానివీధి సరసులను జూచి "నాసెంటు సువాసన మీరందరు వ్రాసుకొన్నదానికంటె పదిరెట్లెక్కువ గుమ్మగా వుందని పందెమేయడానికి తగివుండేటట్టుగా అరబుడ్డి షర్టుమీదొంపేడు ఇంత భూతనాత్ ఆయిలు బుర్రకు పులిమేడు. తెల్లసూటు, తెల్లజోడు, తొడిగేడు. ఇదంతా యెందుకు, అరబుడ్డి హేజలైను స్నో వొక్కమారాఖరజేసిన ఆముఖమందే- ఆహా! ఏమని చెప్పడం ఆచక్కదనం! ఆర్టిఫిషల్ మన్మధుడో లేక అమావాస్యనాడు చీకటి నెదిరించడానికి వచ్చిన నిండు చంద్రుడో అన్నట్టుగా వుంది. అనుకొన్నట్టుగా రామమూర్తి సందులో గాచేడు. సర్వేశం, సుబ్బారావు, శకుంతల యింటి యెదుటకు వెళ్లేరు. అది వొక చిన్నమేడ పైనవున్న దొక్కటేగది. అంతా నిశ్శబ్దముగా వుంది.

౬

ఎక్కడనుంచి లోపలకు వెళ్లడం! అని డిటెక్టివు ఆలోచించేడు. అడుగులు నెమ్మదిగ వేస్తూ దొడ్డివైపు వెళ్లేము. అక్కడ గోడ పొట్టిగా వుంది. గోడలో చిన్న తలుపుంది. “సుబ్బారావు దగ్గరకు పిలిచి సర్వేశం ఆచిన్న తలుపు చూశావా! నెమ్మదిగా గోడయెక్కి తలుపుతీసేవంటే నేనులోపలికి వస్తాను” అని అన్నాడు. సుబ్బారావు “నాపంట్లాము నలిగి పోతుంది. బాబువుకాదు! నీవే యెక్కు” అన్నాడు. ఎలాగా డిటెక్టివు డిటెక్టివే

గోడదూకి గొళ్లెము తెరిచేడు. సుబ్బారావు లోన ప్రవేశించేడు అడుగుదీసి అడుగువేస్తూ యిద్దరూ లోనికి వెళ్లేరు. ఖర్మముచాలక కొంచము గాలివేసింది అక్కడనున్న దబ్బ చెట్టాకులు కదలేయి, సుబ్బారావు కింకెక్కడి ప్రాణాలు! వెనక్కి తిరగకుండా చెంగుమని గంతేడు. పాపం! దబ్బున- వెనకనే నాచు బట్టివున్న నూతి చప్టామీద కాలుబడి, జారి క్రిందబడ్డాడు. ముందు వెళ్తూవున్న సర్వేశం వెనక్కొచ్చి రెక్క బట్టుకొని సుబ్బని లేవనెత్తి “చప్పుడుచేస్తే, కొంప మునుగుతుంది; నెమ్మదిగ లే” అని చెయ్యిబట్టుకొని ముందునకు తీసుక వెళ్ళేడు.

పాపం! సుబ్బారావు బట్టలుతడిసి మురికై పోయేయి. వాళ్ళిద్దరు యింటివెనక భాగాని కెళ్ళేరు. అక్క డొక్క పెద్దతలుపుంది. దాన్ని కొంచం డిటెక్టివు తోసి చూచేడు. అది కదల్లేదు. సుబ్బారావును ముం దేమైనా తలుపు లున్నాయేమో’ చూడమన్నాడు. అతగాడు నెమ్మది గా వెళ్ళిచూచి తిరిగివచ్చి వొక్కకిటికీమాత్రమున్నదని అన్నాడు.

ఇద్దరూ కలసి కిటికీదగ్గర వెళ్లేరు. డిటెక్టివు కిటికీఅంతటిని తడిమి “రావూ ! ఈకిటికీ వూచలు రెండు మూడూడ దీయాలి; ఇంతకంటె చేయగల దేదీ లేదు.” అని అన్నాడు. మంచిదని సుబ్బారావన్నాడు.

అప్పుడు డిటెక్టివు “సుబ్బారావూ ! వెళ్లే ముందొక్క విషయం శకుంతల తల్లి, తండ్రి, చిన్ని తమ్ముడు మేడమీద పడుకుంటారు. క్రింద చావడిప్రక్క గదిలో శకుంతల పడుకుంటుంది. అక్కడనే దాసిదూడ

వంచుకొని వుంటుంది. చాలా జాగ్రత్తగా వుండాలి, ఇంకొక విషయం. నీవు శకుంతలను పెండ్లి చేసుకొంటావా? లేదా” అని అడిగేను.

“అది యిప్పు డెందుకు ?”

“ఎందుకా? పెండ్లి చేసుకొనక పోతే యీ ప్రయత్నా లెందుకు ?”

“సర్వేశం ! ఇటువంటి చిక్కులు పెడతా వెందుకు?”

“చిక్కులా? అలాగంటే, నే వెళ్లిపోతాను”

“ఆ! సర్వేశం? సర్వేశం! సరే, ఆలాగే పెళ్లి జేసుకొంటాను”

సర్వేశం సంతుష్టి నొందేడు. సరే. ఇంక వూచలూడపీక నారంభించేడు. ఒక్కొక్క వూచ బట్టుకొని అదేలాగడం పాపం! డిసెక్టివు చేతులు పొరలు రేగి మండిపోయాయి ముఖం కందగడ్డయింది. కాని, ఒక్క వూచైనా వూడలేదు.

ఇంక సుబ్బారావు ముందుకు వచ్చేడు. ఒక వూచ బట్టుకు పెనగులాడేడు. ఎంతలాగినా, అది వంగుతుందా? అది వదలి యింకొకటి పట్టుకొని గట్టిగా లాగేడు.

“ఫళ్ళు” మని పెద్ద ధ్వని ఐంది.

“ఎవరు వారు ?” అని లోపలినుంచి వినబడ్డది. రావుద్వయం గుండెలు చేత బుచ్చుకున్నారు. “ఇంక వుంటే కొంప మునుగుతుంది. పలాయన మంత్రం ప్రయోగించు, పద ! పద !!” అని డిసెక్టివు తొందర జేసేడు.

ఇంకేమని చెప్పడం ! అదే పరుగు! బ్రతుకు జీవుడా అంటూ బయట బడ్డారు. ఇంక రామమూర్తి యెటుండి యెటువచ్చి నాపరుగెత్తడానికి బాగుంటుందని యిదివరకే చెప్పులు చేతబట్టుకొని హంద్రడుయార్డ్సు పందేనికి సిద్ధముగ నున్న వాడిలాగు నిలబడ్డాడు.

ముగ్గురూ కాళ్ళకు బుద్ధి చెప్పేరు. పేటజేరేవరకు యెవ్వారికిని ప్రాణాలు లేవు. ఒక అరగంట అయినమీద “ఆఫళ్ళు మన్న దేమిటి?” అని రామమూర్తి అడిగేడు.

"ఇంకేముంది! ఊచ! ఇనుపవూచ!" అని సుబ్బారావన్నాడు. "ఇనుపవూచ!" విరుగుతుందా?" అని రామమూర్తి అన్నాడు.

"ఏమోగాని నేను విరిచిందిమాత్రం యినుపవూచ" అని రాము వన్నాడు. ఇంతకన్న వెఱ్ఱివుందా! ఇనపవూచ వంగుతుంది కాని, విరుగుతుందా? అశ్రద్ధాని కొక కారణముంది. ఎంచేతనోగాని కిటికీలో యినపవూచ వొకటి పాడిపోయింది. ఆలావుండడము మంచిదికాదనీ యిల్లుగలాయన కఱ్ఱ వొకదానిని చెక్కించి రంగువేసి అమర్చేడు. ఇదే సుబ్బారావు బలానికి విరిగింది.

* * * *

ఇలాగు ఆఖరు ప్రయత్నం వృథాప్రయాసగా పరిణమించింది. శకుంతలాశకుంతము చేతిలో నుండెగిరిపోయినలాగు ఆవూరి నుండి వెళ్లిపోయింది. సుబ్బారావుకు జబ్బనుకుంటున్నారేమో! అది కాదు కారణం. తండ్రికావూరునుండి బదిలీఅయింది.

పాపం! సుబ్బారావు మొట్టమొదటనే రామమూర్తిమాట విని వుంటే యింత విచారం, యేడాది చదువు దండుగ, పరాభవం, డబ్బు నష్టం- ఇవన్ని కలుగకుండా పోయేవి కదా! కాని, యిటువంటి పనులు చేసేవాళ్ళకిట్టి కష్టాలు సంభవిస్తాయనేభయం నలుగురకు కనపడేలాగు యీగొడవంతా జరిగింది; సుబ్బారావు ఇంక నన్నాబుద్ధిగా సంచరిస్తే బాగుంటుందనుకోరూ మీరు?

# ప్రేమ – త్యాగము



దేవదాసీ సంఘమున పుట్టిన స్త్రీలు భార్యలగనుండుటకు తగరా? ఈమాటల నేనంగీకరింపను. చదువుకొను దినములలో నాకు కూడ యిట్టి యభిప్రాయమే యుండెడిది. స్వానుభవముబట్టి నాయుద్దేశము మార్చుకొనవలసి వచ్చినది. ఆకులమందును భార్యలుగ నుండదగిన సుగుణవతు లెందరో యున్నారు.

... ... ... ... ... ...

వీథిలో నిలచియున్న నామిత్రులకు సమాధానము చెప్పి తిరిగి లోనికి వచ్చునరికి సుభద్ర దుఃఖపూరిత వదనముతో "నేటి సాయంకాల మే బయలుదేరెదరా?" అని నన్ను ప్రశ్నించినది. "ఎక్కడకు?" ఆమె ముఖచిహ్నములయం దొక్కమారుగ మార్పు జనించెను. "ఎక్కడకా? ఎరుగరా! ఎందుల కింకను దాచియుంచెదరు? నేడే పయనము గంటు! ఈయుత్తరమును నేనుచూచితిని. పంక్తిపంక్తియు దుఃఖపూరితమై యున్నది. తల్లియు పిల్లయు నెంతటిబాధలయం దున్నారో! కడసారి చూడవలయునని యున్నదట! పాపము! త్వరగ వెళ్ళుడు!" అని యామె మరలననియెను.

నాహృదయమున నొకబండ బడినట్లయ్యెను. పరాకున బల్లపై నుంచినయుత్తరమును సుభద్రచూచినది. నాగుట్టంతయు బయటబడినది. నేను పలుకక అటనేయున్నకుర్చీయందు కూలబడితిని. "లెండు! త్వరగ బయలుదేరుడు! రైలునకు వేళయగుచున్నది." అని యామె నన్ను తొందరచేయ నారంభించెను. "నేను వెళ్లను." "ఏమి! భార్యయు, కన్న పుత్రికయు యీక్షణముననో మరుక్షణముననో మరణించుచున్నారని తెలిసియు చూచుటకేని వెళ్లరా!" అని యామె ఆతురతతో ప్రశ్నిం

చెను. «వెన్నెను. నేను వెన్నెను" అని బదులు చెప్పితిని. «ఏమిరోగిగనుండెడి పెండ్లియాడినభార్య—కడుపార కనినపుత్త్రుడు! మగవానవస్థయందుండెను!— అయ్యో! ఇంతకన్న—" అని యేమియో యనుచుండ «నీవు నాకు చెప్పనక్కరలేదు. పలుకవలదు. నాకాసంగతి వలదు.» అని గద్దించితిని.

ఐదు నిముసము లామె నిశ్శబ్దముగ నుండెను. మరల నన్ను రెండుమాటలు ప్రశ్నించినది. నొకటికి యుత్తరమున్నే మరల నొసగితిని. సుభద్రకు కోపమువచ్చెను. «అటులయిన నాయింటవలదు! అవలకు పొమ్ము! మరల మోమునేనియు చూపవలదు!" అని యనెను. నామొద లుమండినది «అటులనా? సరే" యని క్రోధముచే మండిపడుచు బిరబిర సుభద్రయిల్లు విడచితిని.

ఇక్కడ సుభద్రచరిత్రయు నాచరిత్రయు ఇంచుక మీకెరిగించిన బాగుగ నుండునని తలంతును. సుభద్రతల్లి వ్యభిచారవృత్తివలన కాలము గడపినది. ఆమె యెట్లుప్రవర్తించినను కొమరితయగు సుభద్ర మాత్రము గౌరవముగ కాలము గడపవలయునని యామెకోరిక. కాన సుభద్రకు సంగీతము నెక్కుడుగ చెప్పించెను. సభల గావించి తద్వారా ధనము నార్జింపవలయునని యామె యుద్దేశము. పుత్రిక పెండ్లిప్రయత్నములు జరుగుచుండగనే పాపము తల్లి మృతినొందెను.

ఇంక నావృత్తాంతము—నా తల్లిదండ్రులు కడుబీదవారు. నావదునైదవయేటనే తండ్రి కాలముచేసెను. ఇంక యెటుజూచినను ప్రపంచమున మిగిలియున్న దొక్కతల్లి. నేను వృద్ధిలోనికి రావలయునని ఆమె కోరిక; అందువలన చదువుకొనవలసినదిగ నన్ను మదరాసున కంపిరి. చేసినపాపము చెప్పిన పోవునందురు. నేను పాఠశాలయందు చేరితినేగాని సరిగ బడికిపోవుచుండెడివాడనుగాను. నాకుసంగీతజ్ఞానము కొంతగలదు; దానివలన పట్టణమందు దేపాంతమందైనను గానసభలైనయెడల యెన్ని యాటంకములు వచ్చినను వాటినన్నింటిని నొక మూలకు త్రోసివైచి

హాయిగనుండెడివాడను. వీలైనచోట్ల నేను కూడ నాజ్ఞానమును వెల్లబుచ్చెడివాడను.

అట్టిసమయమున సుభద్ర నాపాటవినినది. ఆమె నన్ను మనసార ప్రేమించినది. తనయింటికి రావలసినదిగ నొకటి రెండుత్తరములు వ్రాసినది. ఒకనాటి యుదయమున నేనామెగృహమున కేగితిని. సుభద్ర నన్నెంతగనో గౌరవించినది. తానెవ్వరికడ విద్యనభ్యసించినదియు తెలిపినది. తరుచుతన యింటికి వచ్చుచుండవలసినదని కోరినది. నేనామె ప్రేమించితిని. నే నింతకుపూర్వము చెప్పినయట్లుగ సుభద్ర నన్ను మనసార ప్రేమించినది. నాకు చిన్ననాటనే పరిణయమైన దనువిషయమును మరుగుపరచి నేనామెను పెండ్లియాడెదనని నమ్మించి ఆమెతో హాయిగ కాలము గడుపనారంభించితిని. నా నిజస్థితి నామె కెరిగించక మరుగుబరచియుంచితిని. పాపము శారదమాత్రము నా మాటల పరిపూర్ణముగ నమ్మినది. నన్నామె భర్తగా భావించుచుండెడిది. ఆ వినయవిధేయత- ఆ ప్రేమ- ఆ మర్యాద- ఆ విద్య- ఆహా! ఇంకెవ్వరిదగ్గర నుండవని నా నమ్మకము.

3

తిక్క తలకెక్కనే యెక్కదు; యెక్కినదా తిరుగుట కెంతయో కాలముపట్టును. ఆసమయమున—సుభద్ర నన్ను నాభార్యను చూచుటకు వెంటనే వెళ్లవలయునని కోరినసమయమున - నా శరీరమున జొచ్చియున్న మద్యముయొక్క శక్తి యెక్కుడుగనుండెను. అట్టి సమయమున నెవ్వ రెంతటి మంచివిషయములజెప్పినను రుచింపవు. అన్నియును కోపమునే యెక్కుడుచేయును. కాన నాయెడ లాసమయమున మండినది. నేటికిని నాకు బాగుగ జ్ఞాపకమున్నది. సుభద్ర గడగడవడకినది. నాకనులెఱ్ఱవారెను. ఇంక ఒక్కమాటచెప్పితిని. "నేటినుండి నీగడప దొక్కిన వొట్టని వెంటనే గిఱ్ఱునతిరిగి వీధిలోనికి బోయితి.

౪

ఉన్నతల్లియు స్వర్గస్థురాలైనది. ధనము నాకడ లేదని తెలిసికొనిన నా త్రాగుబోతు మిత్రులు మందునకైనను లేకుండ మాయమైనట్లు నా వంక నొక్కమారైనియు రాలైరి.

ఇంక బడికిపోవుట కవకాశములేనందున చదువుచాలించితిని. ఉదరపోషణమునకై యుద్యోగము నొకదానిని జూచుకొంటిని. అదియేమి చిత్రమొగాని బెల్లమున్న యీగలు జేరుననునట్లు నాకు నెలజీతమందిన మానటిదినముననే పూర్వస్నేహితులందఱును నాచుట్టును జేరుకొనెడివారు నాకు నెలకు వచ్చునది ముప్పది రూపాయలే యగుటవలన అది రెండుదినములలో ఆఖరగుచుండెడిది. మరల మిత్రులు మాయమగుచుండెడివారు. అంతటితో ప్రపంచముయొక్క మంచిచెడ్డలన్నియు నాకు తెలిసినవి.

౫

వెంటనే నాలో నొకమార్పు జనించినది. సుభద్ర యింటికి-కాదు కాదు- ఆమె గృహమున్న వీధికేనియు అడుగిడుట మానిన నాకు పాపమామె యెట్లులున్నదో చూడవలయునను బుద్ధికలిగెను. కాని నేనామెకడకేగిన యేమియవమానము జరుగునోయను భయము నాకు కగిలినది. రెండు గంటలవరకు నాలో నేను వితర్కించుకొనితుదకేమియైనను సరే వెళ్లవలయునని నిశ్చయించుకొంటిని.

సాయంత్రమెప్పుడగునా, యెప్పుడు సుభద్రనుజూతునా. యనుకోక మనమం దెక్కుడగుటవలన నాడు కార్యాలయమున కాగితముపై కలము నుంచియుండలేదు తుదకెట్లులేని సాయంకాలమాయెను. సుభద్ర గృహమునకు బయలుదేరితిని త్రోవలో-సుభద్ర నేమనిపలుకరించుట?-నేను వచ్చుచు సుభద్రా! యనిసంబోధింప నామె నాకుప్రత్యుత్తరమిచ్చునా? లేక అవమానమొనరించునా? ఈవిధముగ తలపోయుచు సుభద్రగృహముకడ కేగితిని.

సోపానముల నెక్కితిని. ద్వారముకడ నిలచి తలుపు నించుక త్రోసితిని. అదిబయటనే తాళము వేయబడియున్నది. కాని నేను పిలువకుండ యూరకొనజాలనైతిని. "సుభద్రా! సుభద్రా!!" అని రెండుమారులు పిలచితిని.

అచ్చటనే నిలచి సుభద్రయెక్కడకు వెళ్లియుండునా యని యాలోచించుచుంటిని; యింతలో ప్రక్కనే యొక కుటీరమున నివసించుచున్న వృద్ధస్త్రీ వచ్చెను. ఈమె పేరు రూపులు; నేనీమె నెఱుగుదును, నాగొంతు నాలించిన యామె నెమ్మదిగవచ్చి "నాయనా! ఎంత కాలమునకు వచ్చితివి! ఇన్నినాళ్ళను యెక్కడ కేగితివి." అని ప్రశ్నించెను.

ప్రథమమున నేనామె కుశలప్రశ్నలకు సమాధానము చెప్పకుండ "సుభద్రయెక్కడ?" అని యడిగితిని.

"నాయనా! ఆ విషయమే నీవు కానుపించిన అడుగవలయునని యెన్నియో నాళ్ళనుండి యనుకొనుచున్నాను. నాడు నీతో నేదియో కోపముగా మాటలాడుచుండుటను వింటిని. ఆ మరుసటిదినముననే యెవ్వరితోడను చెప్పకుండగ బయలుదేరి వెళ్ళినది. ఇరుగుపొరుగువారెన్నియో విధముల నన్నడుగ యెందులకైనను మంచిదని యెంచి సుభద్ర తాతగారి గృహమున కేగినదని తెలిపితిని." అని యామెకంట తడి పెట్టుకొనుచు బలికెను.

నేను మాటలాడకపోయితిని. నా కాలు సేతు లాడ వాయెను. అచ్చటనే ప్రతిమవలె ఒకగంటకాలము నిలచితిని. నాటిసాయంత్రము నేను సుభద్రతో కఠినముగ మాటలాడినసంగతి జ్ఞప్తికివచ్చినది. ఆ సందర్భమున నా భార్యయగు కమలయు నా పుత్రుడును నా కనులకు కానుపించినట్లాయెను. ఇంక ఒకటి రెండుదినములకన్న నెక్కుడుకాలము బ్రతుకరని కదా నాడు జాబువచ్చినది. ఇరువురును మరణించియే యుందురని నిశ్చయించుకొనిన నాకేలనో మరల వారలు జీవించియే యుండవచ్చునను అనుమానముకలిగెను. ఎట్టులీసంశయమునునివారించుకొనుట!

౬

నాటినుండియు నామనమున ఆశ లెక్కుడుకాజొచ్చెను. కమలయు నాముద్దుబిడ్డయు బ్రతికియేయుందురని రాత్రింబవళ్ళు తలపోయ మొదలిడితిని, తుదకు వేసంగి సెలవులు వచ్చినవి. వారముదినముల సెలవుండుటచే స్వగ్రామమునుజూడ బయలుదేరితిని.

గృహద్వారమునకెదుట బండియాగినది. నేను బండిదిగి ముందునకు రెండడుగులిడితిని. కలకల లాడు మోముతో కఱ్ఱగుఱ్ఱము నెక్కియాడుకొనుచుండు బాలుడొకడు నాకెదురాయెను.

ఆబాలుని జూడగనే నాహృదయమదరెను; కనుల అశ్రువులు నిండెను. ఈ బిడ్డడే నాపుత్రుడై యుండునా యను సంశయముకలిగెను. కుఱ్ఱనికడ కేగి చేతనొకరూకయిడితిని. అంత నాబాలుడు దానిని నాకిచ్చుచు "నాకువద్దు; పెద్దమ్మదగ్గరయున్ని లూపాయిలున్నాయి" అని ముద్దుగ బలికెను. బాలుని ముద్దుపలుకులు నాకెంతయో ఆనందమును గొలిపినవి. ఒక్కమారుగ బిడ్డను చంకనిడుకొని లోనికేగితిని.

ప్రక్కగదియందు యెవ్వరో మూల్గుచున్నట్లుండెను. తడబడుపదములు నన్నాగదిలోనికి గొనిపోయినవి. గదిమధ్యనున్న పర్యంకముపైనొక శుష్కదేహిని పరుండియుండెను.

ఆమెను గాంచిన నాసంతోష మింతింతగాదు. ఆమెయే. ఆశ్చర్యించి, శల్యావశిష్టమైయున్న యామెయే నా కమల! బహుకష్టముపై వచ్చితిరా" అని కమలయనెను. ఇంకను యేమియో మాటలాడ బ్రయత్నించెను. గాని శక్తి లేకపోయెను. ఆమెను గాంచిన నాహృదయము బ్రద్దలయ్యెను.

౭

ఇంతలో చంకనున్న బాలుడు చల్లగ జారుచు "పెద్దమ్మా" యని పరుగిడిపోయెను. ఈ పెద్దమ్మ యెవ్వరాయని నాకు సందియము గలిగెను. నేను [illegible]వద్ద కేగితిని. కొమరు డొకయువతిచంక కెగ

ణాత్రికి యేమియో చెప్పుచుండెను. ఆ "పెద్దమ్మ" యెవ్వరు!—నాకు బుద్ధిసెప్పిన సుభద్రియే.

సుభద్రి నన్నుజూచినది; నేను సుభద్రినుజూచితిని. ఒకరియెదుట నొకరుగ యిరువురమును అరగంటకాలము కదలక మెదలక నిలచితిమి. తరువాత "సుభద్రా!" యని సంబోధించితినిగాని యింక యేమియను టకును తోచలేదు. సుభద్రియు మాటలాడలేకపోయెను. నాటిరాత్రియే సుభద్రివలన సర్వమును వింటిని. సుభద్రియే లేకయున్న నాభార్యయు పుత్రుడును యింతవరకును బ్రతికియే యుండరు.

నాటిసాయంకాలము నన్ను మా గ్రామమున కేగవలసినదని యెంతయో చెప్పి, నేను నిరాకరింప నేనామెయెడ నెంతకపటముతో మెలగినను లెక్కసేయక తిన్నగ మరుసటియుదయమున బయలుదేరి మా గ్రామమునకు వచ్చి వలయుధనము వ్యయపరచి మందు లిప్పించి నా భార్యయగు కమలను నాబిడ్డను కాపాడినది. ఆహా! సుభద్రియెంతటి జాలి హృదయ!

నేను వచ్చినవారముదినములకే నా భార్యయగు కమల లేచి తిరు గాడ నారంభించెను. అందరికన్నను సుభద్రిసంతోష మెక్కుడుగనుండె ను. కమల నెన్నియోవిధముల నలంకరించి ఆనందించుచుండెడిది.

౮

ఒకనాటి సాయంకాలము మాయిరువురి అనుమతిపై నాకొమరు ని వెంటకొని పట్టణమునకు వెళ్ళి మూడుదినములలో తిరిగివచ్చెను. నా టిరాత్రి పదునొకొండుగంటలవరకును మాటలాడిన యనంతరము నిద్దు రపోయితిమి. కాకులింకనుకావు కావుమనికూయనైన కూయలేదు. కొమ రుడు "పెద్దమ్మా" యని యేడువదొడగెను. కాని సుభద్రిమాత్రము పలుకలేదు. నేను లేచి ఆమె గదిలోనికేగితిని. గదిలో సుభద్రిలేదు. నాకాశ్చర్యము గలిగెను. ఆగదివెతకితిని; మంచముపై నొకయుత్తరము కానుపించినది.

ఆతురతతో, విప్పిచూడ అందు రెండు కాగితము లున్నవి. ఆ రెం టిలో నొకదానిని విప్పిజూచితిని. అందిటులున్నది.

అయ్యా!

నమస్కారములు. నే నీ ప్రపంచమున నాకిష్టమైన వారిని వివాహమాడి సుఖముగ కాలము గడుప నిశ్చయించుకొంటిని. మీరు వివాహమయ్యు ఆసంగతిని రహస్యముగ నుంచి నాకడ మెలగిరి. మీరు బ్రహ్మచారులనియే నేను భావించితిని... అదియంతయును మన కిరువురకును తెలిసిన యంశమేకాన యింతతో నావనిండు. మీకమల నాచెల్లెలినిగా భావించి నావలన నగుసేవ యొనరించియుంటిని. మీ యిరువురసౌఖ్యములకు నే నంతరాయము కలిగింపజాలను. ఇంక నాకీ ప్రపంచము పై ఆసలేదు. నాకు గల కొలది యాస్తియు మీకు సంతసమున సమర్పించుచున్నాను. దయతో స్వీకరింపుడు. పుత్రుడు మోహానుని యెంతయో దయతో బెంచుడు. ఇందు తోడనే వీలున్నది దానిని భద్రపరచుకొనుడు. సెలవు.

ఇట్లు

సుభద్ర.

ఈ యుత్తరమును గాంచిన హృదయమందెంతయో తత్తరము గలిగెను. తరువాత నా రెండవ కాగితమును విప్పితిని, అదియే ఉత్తరమున ఆమె యుదహరించిన విల్లు! తరువాత ఆమెకై యెంత ప్రయత్నించినను జాడ లెచ్చటగాని కానరాలేను.

# "లలితయే చిట్టియని నాకేమి తెలియును?"

౧

నిజముగ వారెవ్వరిని గాని నేనెఱుగను. వారి యింటి పొరుగననే నివసించుచుంటి ననుసంగతిగూడ ఆ యింటికివచ్చిన యొక బాలికకు తప్ప వేరెవ్వరికిని తెలియదనియే నా నమ్మిక. ఒకనాటి సాయంకాలమున „లలిత వచ్చినది" అను పసి కంఠములును, ఆనందమున పరుగులిడుచుండిన బాలురపదముల సవ్వడియు వినబడినవి. మేడమీదనుండి క్రిందకు చూచితిని; పదమూడేండ్లబాలిక బండినుండి బయటకు వచ్చుచుండెను. ఆమె యేలనో యొక్కమారు మోమును పైకెత్తిచూచెను. నేనును ముద్దులొలుకు నామె సుందరవదనమును గాంచితిని. ఆమెయు నన్ను చూచెను. ఒక నిముసమువర కామె దృక్కులనానుండి మరల్పలేదు. తుదకామె యొక్కచిరునవ్వునవ్వి శిరమును వంచుకొని యెదుట బాలురువచ్చుటను గాంచి లోనికేగెను.

అదియే మొదలుగ నాకెంతయో ఆమెపై మక్కువగలిగెను. ఆమె డాబాపై బాలురతో నాడుచుండగ ప్రతిదినమును చూచుచుండెడివాడను. దినదినమునకు ఆమెమోమందు నూతన సౌందర్యము కానబడుచుండెడిది. ఈమెతో చెలిమిచేయుట యెట్లు? ఈ తలంపు నాకొక పెద్ద సమస్యయాయెను. ఆమె చక్కదనము నెంతగనో నాలో నేను వర్ణించుకొనెడివాడను. నా విశాలమగు గదియందు, చేతకలముబట్టి బల్లపై తెల్లకాగితముల పొత్తమును తెరచియుంచి నాలో నేనే యాలోచించుకొనుచు నవ్వుకొనుచు నెన్నియో పద్దెములల్లితిని. ఆ వ్రాతలన్నింటిని ప్రకటించినచో నూరుపుటల ఖండకావ్యమగునని నాతలంపు.

౨

దిన దినమునకును నెండలు ముదురుచున్న యట్టులే నాహృద

యమందలి తలంపుకూడను గాఢమగుచుండెను. ఇంతకును నా పొరుగు వారినిగురించి నాకు తెలియున దేమియునులేదు. ఆయింట యజమాను నిపేరు కృష్ణమూర్తిగారు. వీరు పురమందలి సుప్రసిద్ధ న్యాయవాదు లలో నొకరు. వీరికి లలిత యేమగునో కూడ నాకు తెలియదు. ఎవ్వరి నేన అడిగి తెలిసికొందమన వారేమనుకొందురో యనుభవమును అభి మానమునుకూడ నాకు కలదు. వేసవికాల మగుటచే కృష్ణారావుగారు నీలగిరుల కేగిరి.

చెప్ప మరచితిని, నారముదినములకు కృష్ణారావుగారు నీలగిరి కేగెదరనగ లలిత ప్రయాణ మాయెను. ఎక్కడ కేగుచున్నదో నేనెరు గను. పట్టణము చాలవరకు పాడువడినట్లు కానుపించెను. గడపదాటి బయట కేగుటకూడ మానితిని. పద్యముల పుస్తకములోని పదిపుట లుత్తవిగనున్నవి. ఏమియు తోచకుండెను. ఎట్లులైనను యీ పదిపుట లను నింపవలయునని ప్రయత్నించితివిగాని ఆకార్యముమాత్రము నావ లన గాలేదు.

నాటిసాయంకాలము ఛార్లీ ఛాప్లినుయొక్క యాత్రికుని కథను క్రాను సినిమాయందు ప్రదర్శించెదరని పత్రికలందు గాంచి బయలు దేరితిని. అప్పుడే గదితలుపు తాళము వేసి మెట్లు దిగునంతలో నాగది యందే నాతో యిదివరలో నివసించుచున్న మిత్రుడు సదాశివరావు చెమ్మటలు గ్రమ్మియున్న దేహముతో యెదురుగవచ్చెను. అతని యీ తురతేన్నుగాంచి నేనెంతయో విస్మితుడనైతిని. వారము దినములక్రిందనే పుదుచ్చేరినుండి స్వగ్రామమున కేగినయాత డింతత్వరలో రానేల? నా కెంతయో నాశ్చర్యమాయెను. అప్పుడేమియు ప్రశ్నింపక వేవేగ తలు పులదెరచితిని. సదాశివరావు కుర్చీలో చతికిలబడెను. అతని నాస్థితియం దుగాంచిన నా యందుకూడ కలతజనించెను. కాని, వెంటనే కారణము డిగిన మరింత కంగారగునని యెంచి యించుక విశ్రమించ వలసినదిగ యంటిని. అతడును కడుడస్సియుండుటచే యించుక విశ్రాంతినందెను.

# 3

ఎనిమిది గంటలగును. ఇరువురమును డాబామీద కూర్చుంటిమి. ఇంతత్వరలో వచ్చుటకు కారణమును తెలుపవలసినదని సదాశివు నడిగితిని. అంత నాత డిట్లులారంభించెను.

“నాకిప్పటికించుక భయముతగ్గినది. నీకింతవరకును తెలుపనివిషయ మొకటియున్నది. నేడు చెప్పవలసిన సమయమువచ్చినది. ఈవిషయమున నీవు సహాయమొనర్చవలయును. మొదట మాటనిమ్ము! లేకున్న నాభయము తగ్గదు. నేననుకొనినది కానిచో నాజీవితమంతటిని యీ ప్రపంచమున దుఃఖముతో గడుపవలయును. ఏమి? సహాయము చేసెదవా?”

“తుదయు మొదలును తెలుపకుండ సహాయము చేయుమనిన యెట్లుచేయుట? చెప్పుము! నావలననగునేని తప్పక సాయమొనరింతును” అని యంటిని.

“నీవలన కాగలదనియే యింతప్రయాసపడి నీకడకు వచ్చుట. అదియుగాక మనమిరువుర మొకవిషయమున సమాన సంధిగ్ధావస్థయందే పడియున్నారము. నీవు లలితను ప్రేమించితివని నాతో యెన్నియో మారు లనియుంటివిగదా?!’ అని యాతడాగెను.

‘ఔనని’ నే బదులు చెప్పితిని.

“నేనును అట్టులే యొక కన్నెను ప్రేమించితిని. ఆమెయు నా యెడ ప్రేమాను రాగములు గనబరచినది. ‘నిన్నుతప్ప వేరెవ్వరిని గాని పెండ్లియాడన’ ని ఆమెకు మాటయిచ్చియుంటిని. అటులననేల? ఒకవేళ నాకామె యింకెవ్వనినేని యిటీవల ప్రేమించినను నే నీజన్మనంతటిని బ్రహ్మచారిగ నుందునేగాని వేరొక కన్యనుమాత్రము వివాహమాడను. ఇది యిట్లుండ, యిదివరలో- అనగా, నాచిన్నతనముననే- మాగ్రామమునకు ప్రక్కనున్న యూరియందు శంకరరావుగారను పెద్దమనిషి యొక

రున్నారు. ఆయనకొక కొమరిత; పేరు చిట్టి. ఈ చిట్టిపుట్టిన మూడవ యేటనే మానాయనగారు 'యీబిడ్డ మా కోడల' ని నగ నొకదాని నామె మెడనుంచిరట. అదియే యిప్పుడు నా కంఠమును బట్టుకొన్నది." అని కొంచమునే పూరకొనెను.

"ఇంక శంకరరావుగారదియే ప్రధానముగ భావించి నేనే చిట్టిని వివాహమాడుదునని వేరు సంబంధము నేదియు చూడకుండ యూరకొనిరి. చిట్టికి తప్పకుండ యీసంవత్సరము వివాహము చేయవలయును. చేయకున్న ప్రమాదము వాటిల్లును. మా నాయనగారితో సిగ్గువిడచి నా మనోభిప్రాయము నెరింగించినను తప్పదని ముందు నెలలో పెండ్లిజేయ ప్రయత్నములుజేయు చున్నారు. నేనెన్నియో విధముల చెప్పితిని. తప్పించుటకు సమయము దాటిపోయినది. గాన యింక వీలులేదని మా నాయనగారనుచున్నారు. నా కామెను మోసగించుట కిష్టములేదు. ఏమి చేయుటకును తోచకున్నది." అని సదాశివరావు మరల యూరకొనెను. నేను కొంతవరకాలోచించితిని. ఏమియును తోచలేదు. "ఏవిధమున నీకు సహాయపడమనెదవు?" అని యడిగితిని. సదాశివుడు పలుకలేదు. "చిట్టి అందకత్తెకాదా?" "అందమైనదే యందురు కాని నావలచినకన్యకన్న యెక్కుడు అందముగనుండదని నేననుకొందును. అందుకు సందేహ పడవలసిన యగత్యము లేదు." "నీవామెను చూడలేదా?" యంటిని "చూచుటెందులకు? నాకు తెలియదా? నాశారదనుయెవ్వరును మించరు." "అటులైనయిపుడేమిచేయమనియెదవు?" "నేనెట్టులైన యీ వివాహమునుండి తప్పించుకొనవలయును." "ఏదియేని దారి గోచరించినదా?" యంటిని. "దారియా?—ఉన్నదికాని దాని సాధించుటలో నీసహాయ మత్యవసరము."

"అటులనా! ఆయుపాయము?—" "ఏమియులేదు; చిట్టికి దగ్గ వరులెవ్వరినేని కుదిర్చి యీవిషయ మామెతండ్రి కెరింగించవలయును. ఆతడందులకు తప్పక యంగీకరించును." "అంగీకరించునా?"

"నిస్సందేహముగ; నాయుద్దేశమును మా నాయనగారు శంకర రావుగారికి సంభాషణా సందర్భమున తెలియపరచినారు. ఆయన "మిమ్ములనవిన్న యింకొకసంబంధమును వెతకికొనకుండ నుంటిని. వీరు తగిన యువకు నెవ్వనినేని కుదిర్చిన అతనికి నా పిల్లనిచ్చి పెండ్లిచేయుట కేవిధమగు ఆటంకముగాని యుండదు. ఎట్లులేనియు యీవేసవికాలము తప్పక వివాహము కావలయున"ని యన్నారు. అందుచేత విద్యాబుద్ధులు గల యువకు నెవ్వనినేని కుదర్పగలిగినచో, మనము తప్పుకొనగలము."

నేను కొంచము సేపాలోచించితిని. స్నేహితునకు సహాయము చేయవలయునని తలంచితిని. "మనకున్న వ్యవధియెంత?" అని సదాశివు నడిగితిని.

"రెండుమూడు నెలలున్న మొక్కటేమి." "ప్రయత్నించిన ఒక్క నెలలో నెవ్వనినేని యొక మంచివానిని కుదర్చవచ్చును. నాకు ధైర్యమున్నది" అని నేనంటిని.

సదాశివుని యానంద మింతింతయని చెప్పజాలను. అతడానంద పరవశుడగుచు నాచేతిని పట్టి యూపుచు "నిజముగ నీకు ధైర్యమున్నదా?" యని రెండుమారులనెను. ఔనని బదులు చెప్పితిని.

"అట్లైన ఉదయముననే బయలుదేరి మా గ్రామమున కేగుదము. ఈవిషయమును మానాయనగారి కెరిగింతము. నేనొక్కడనే వెళ్ళి చెప్పిన ఆయన నమ్మరు," అని యాతడనెను.

"సరే, రేపటియుదయముననే బయలుదేరి మీగ్రామమున కేగుదము. తరువాత చిట్టియింటికేగి ఆమె నొకమారుచూచి వరునినిర్ణయించుట కారంభింతము. నామాటలవిను మిత్రులిరువురున్నారు. ఉదయముననే బయలుదేరవలయును. వేళయైనది. యింక పరుందమ"ని గదిలోనికేగితిమి.

## ౪

సదాశివుని గ్రామమునకేగి వారమునదినములుంటిని. స్వచ్ఛమగు

గాలి యెటులుండునో యెరుగని ప్రాణి పరిపూర్ణసౌఖ్య మనుభవించినది. నదీస్నానము, తోటపికారు, స్వభావసిద్ధమగు ప్రకృతిసౌందర్యము నా కెంతయో యానందమును గలుగజేసినవి.

ఇంక చిట్టిని చూడవలయును. ఆదివారము సాయంకాలము పొలముగట్లపై బడి నడచుచు ఐదుమైళ్ళదూరములోనున్న చిట్టిగ్రామముజేరితిమి. అచ్చట సదాశివుని మేనమామ కాపురమున్నాడు. ఆయనకు నడచుచున్నది అరువదియవడి యైనను బాలురతో సంతోషముగ మాటలాడుట యన యెంతయో యిష్టము. మరునటి యుదయముననే సదాశివుని మిత్రుడెవ్వరోవచ్చి యాతనిని తనగృహమున కాహ్వానించెను. నన్నుకూడ రావలసినదిగకోరెను గాని నాకిష్టము లేనందున వెళ్ళలేదు. త్వరగ వత్తునని చెప్పి సదాశివుడేగెను.

నాకేమియు తోచనందున కాఫీత్రాగిన యనంతరమా గ్రామమందొక చిన్నపుస్తకభాండాగారము మున్నదనివిని అచ్చట కేగితిని. కొంతవరకచ్చటనుండి యిల్లుచేరవలెననిబయలుదేరితిని. భాండాగారమున కొంచెముదూరముగ నొక చిన్నయుద్యానవనము కానుపించెను. దానిజూడనేగితిని. ఆయుద్యానవనమధ్యమున నొక పర్ణశాలయున్నది. పర్ణశాలయెదుట కట్టబడియున్న బోర్డువలన నది బాలికా పాఠశాలయని తెలిసినది. బడి మూయబడియున్నది. నే నుద్యానవనమున ప్రవేశించితిని. అది యెంతయు రమణీయముగనున్నది. పట్టణముల యందువలె క్రోటనుమొక్కలే గాక పరిమళ సుమభరితములగు పూలమొక్కలెన్నియోకూడగలవు. మొక్కలనన్నింటిగాంచుచు బడివెనుకభాగమున కేగితిని. అచట అరటిబోదెలు గుంపుగ పెరిగియున్నవి. నేనొకించుక దూరమున నిలచిచూచుచుంటిని. ఒక నిముసమట నుండునంత రెండు స్త్రీకంఠములు నాకు వినబడినవి.

ఏమి! నేనాశ్చర్యమందితిని. అందొక కంఠము నేనిదివరకెన్నియో మారులు విన్నదివలెయున్నది. అదినాకు ప్రియమైనది నా హృదయము వేగముగ కొట్టుకొననారంభించెను.

చెట్లమధ్య బావియుండునని భావించితిని. ముందున కేగుటగాని, చెట్లమాటునుండి చూచుటగాని, అచ్చట నిలచుటగాని మర్యాదగాదని యనుకొంటిని గాని వెనుక కడుగిడుటకు మనమియ్యకొనదాయెను. పరిచితకంఠమువలె వినబడుచున్న దెవ్వరిదో తెలిసికొనవలయునను ఆస యెక్కుడాయెను.

ఇట్లు నాలో నేను తర్కించుకొనుచుండ యిరువురు బాలికలు కలశములబూని నావైపునకు వచ్చుచుండుటను కాంచితిని.

తుదకు వారి కనులబడితిని. ఇంకనేమి చేయుటకును వీలులేదు. అందొక బాలిక నన్నుజూచి నిర్భ్రాంతపడి హఠాత్తుగా నొక్క క్షణము ఆట నిలచిపోయెను. ఆమె పెదవులపై చిరునగవులు మొలకలెత్తెను కాని యెట్టులనో నణచివైచెను. తరువాత రెండవబాలిక నామె యనుసరించెను. ఆ నవ్వు నాపుకొనినబాలిక యెవ్వరో యెరుగుదురా? అమెయే నేను ప్రేమించిన లలిత! నేను చూడనట్లుగ నేను శిరము వంచితిని.

ఇరువురును కొంచము ముందునకేగిరి. రెండవబాలిక లలితతో "సీవాతని నెరుగుదువా?" యని నెమ్మదిగ యడిగెను.

"ఎంత మొరటుతనము! స్త్రీలుండు తావని యాతడెరుగడుకాబోలు!" అని యూ రెండవబాలిక యనెను.

తుదకు నేను ప్రేమించిన లలిత దీ గ్రామమని తెలిసికొంటిని. ఇంక సదాశివునిసంగతిపై నాకంతశ్రద్ధ లేదు. ఈవిషయ మెవ్వరితోడను చెప్పలేదు.

## ४

నాటిసాయంత్రమే సదాశివుని మేనమామ, పెండ్లికొమరితను చూచుటకై నన్ను రమ్మనియెను. మేమువచ్చుచున్న సంగతి చిట్టి తండ్రి కెరిగించవలసినదిగ నొక సేవకుని సదాశివుడు వారి గృహమున కంపెను.

బయలుదేరుటకు ముందు చావడిలోనుండగ సదాశివుని మామ నన్నుజూచి హాస్యముగ "చిట్టి చాల లక్షణమైన చిన్నది. నచ్చిన పెండ్లి చేసికొన్నదా" యని యడిగిరి. నేను నవ్వి యూరకొంటిని.

ఇరువురము శంకరరావుగారి యిల్లుచేరితిమి. శంకరరావుగారు స్వాగతముగ వచ్చి చావడిలోనికి తీసికొనివెళ్ళి అచ్చట పరుపబడియున్న రత్నకంబళముపై కూర్చుండజేసి యెంతగనో గౌరవించిరి. ఇంతకును నేను యువకుడను, ఇదివరకెన్నడును సంబంధ బాంధవ్యముల కుదుర్చుటకు బయలుదేరియుండలేదు. నాకు నవ్వువచ్చుచుండెను. ఎట్లు ప్రవర్తించుటయో నాకు తోచుటలేదు. శంకరరావుగారు మాత్రము నన్నెంతగనో గౌరవించుచుండిరి. అందులకు నాలోనే నేను నవ్వుకొనుచుంటిని; బయటకు నవ్వితినా మర్యాదగాదు. ఎటులనో పెద్దమనిషి ననిపించుకొనవలయును.

సదాశివుని మామ శంకరరావుగారితో "అమ్మాయిని రమ్మనుడ" నియెను. నాహృదయవేగ మెక్కుడాయెను. "చిట్టియెట్లుండునో?—చామనచాయయా? లేక బంగరు వన్నెయా! కంటికింపుగ నుండునా? లేక ?"

ఇంతలో ప్రక్కతలుపు తెరచుకొనియెను. బాలికయొకతె బయటకు వచ్చెను. అవనత వదనయై, కనుకొనలనుండి దొంగచూపుల జూచుచు, ఆశ్చర్యమందుచు, ఒకయడుగు వెనుకకువైచి, మోమును త్రిప్పుకొనినబాలిక-యింకొకతెను ప్రేమించితిని గాన నాకువలదని, సదాశివునిచే నిరాకరింపబడి పెండ్లియాడునకు వచ్చిన చిట్టియెవ్వరు? చెన్నపట్టణమున కృష్ణమూర్తిగారి యింటికివచ్చి, నాహృదయమున తనఛాయను వీడి యెన్నటికిని మరువకుండజేసిన లలితతప్ప వేరెవ్వరునుగాదు.

నాయొడలొకమారు పులకరించినది. నాప్రక్క పెద్దలున్న విషయము మరచితిని. పక్కుమని నవ్వితిని. లలితయు—కాదు చిట్టియు నవ్వునాపుకొనలేక సిగ్గుచే ద్వారము దెరచి లోనికేగెను.

పెద్ద లిద్దరికిని యేమియు బోధగాలేదు. సదాశివుని మామ సామాన్యుడుకాడు. ఏలనవ్వితివని నన్నాతడడిగెను. నాయానందము నాపుకొనలేక పోయితిని. వారిప్రశ్నల కన్నింటికి సమాధానముల నొసగుటకు దగ్గ స్థితియందు నేనులేను. కాని, యొక్కమాటలో "నేను లలితను—కాదు. చిట్టిని—పెండ్లియాడెదను" అని యంటిని. తరువాత పూర్వవిషయ మంతటిని వారికి తెలియజేసితిని. ముహూర్తము స్థిరపడెను.

ముందుగ గృహముజేరిన మామవలన సదాశివుడు జరిగిన దానినంతయు నెరిగి నేనిల్లుచేరిన యనంతరము "దొంగా! నా కిన్నాళ్ళును చెప్పకుండ దాచియుంచితివిగదా! నన్ను మోసముచేయదలచితివా?" యనెను. "నేను మనసార ప్రేమించితినని అనేకమారులు చెప్పుచువచ్చిన లలితయే చిట్టియని నాకేమి తెలియును?" అని నవ్వుచు బదులుచెప్పితిని.

# ఆత్మార్పణ.

## ౧

శారద లేజిక్కిళ్లరంగు యెక్కుడాయెను. ఆమె యేమియో మాటలాడ నుద్దేశించియున్నదీ. కాని పెదవులు మాత్రము విడువడకుండెను. తనువంతయు యించుక కంపించుచుండెను. ఆ స్థితియందు దామెను గాంచిన ప్రతివారును తప్పక కన్నీరుగార్తురు.

తుదకు శారద తెగువజేసినది. ముందుగ నాలుగైదు అశ్రుబిందువులు నేల వ్రాలినవి. శారదదృష్టి భూమిపై నుండెను. కనుకొనల నుద్భవించి నేలవ్రాలిన కన్నీటి బిందువులు క్రిందనున్న రెండుమంటి రేణువుల నొకటిగ జేయుటయును శారద చూచినది. ఆమె హృదయమున యించుక ధైర్యముగలిగెను. ఆమె మోము నించుక పైకెత్తినది. దృష్టిని యెదుట అశ్రుపూరిత లోచనుడై నిలచి తన్నవలోకించుచుండిన యువకుని వదనమండలముపై ప్రసరింపజేసినది. "మరల ఒక

మాఱసిగి చూడరాదా !" అని శారద రుద్ధకంఠమున బలికెను. ఇంత వఱకును హృదయమునసే యిమిడియుండిన దుఃఖము, గట్లుతెగి ప్రవహింపనారంభించెను. ఆ దుఃఖపూరితే వదనమును గాంచిన నా యువకుడు దూరకొనలేక పోయెను. చేరుమాలును మోమున కడ్డుబెట్టుకొని తనలో తాను హీనస్వరమున విలపించెను.

యువకుడు కొంత ధైర్యమవలంబించెను. ఆతడు రెండుమూడడుగులు ముందునకు వైచి శారద కొంత గజము దూరములో నిలచెను. ఆతని హృదయమం దెంతయో దుఃఖమున్నటు లాతని వదనమే చెప్పుచున్నది. "శారదా ! నాకై నీవింతగ తలపనేల ! భగవంతుడు నిరుపేదనగు నా హృదయమున నీచిత్రమును చిత్రించివైచెను. దానిని నేను తుడిచివేయజాలను. నామాటల నింకొకవిధముగ అర్థము జేసికొనకుము. నా యీ నిస్సహాయతను గాంచిన నీవు నీ యభిప్రాయము నించుక మార్చుకొనరాదా ! నీవేని సుఖముగ నున్నావని వినిన నాకెంతయో ఆనందము గలుగును. అటులనే యీతనువును వెళ్లబుత్తును. ఏల—" అని యా యువకుడు యింకను యేమియో యనుచుండ శారద, ఆతని మాటల కడ్డువచ్చి "మరల నడుగరాదా ?" యనియెను. "ఎన్నియో మారులైనది! మీ నాయనగారు నావంటి నిర్భాగ్యునకియ్యనని ఖండితముగ చెప్పిరి. ఇంక ఆయనకడకేగి సిగ్గువిడచి యడుగుటవలన లాభము లేదు. నీవేనియు వివాహమాడి సుఖముగ నుండరాదా?"

శారద జొటజొట కన్నీరుగార్చెను. ఆమె చీరకొంగంతయు కన్నీటితో తడసి ముద్దయైనది. "ఎన్నటికైనను మిమ్ములనే పెండ్లియాడవలయును. లేదా యీతనువు నంతటిని దుఃఖముతోడనే గడపివైచెదను. నాయందు దయయున్న, నేను మాట యిందు ! లేదేని అయిష్టతను దెలుపు గాని, యింకొకనిని పెండ్లియాడవలసినగనిమాత్రము సలహా నియ్యవలదు. ఇది నాప్రార్థన".

ఆమె యింక మాటలాడలేక పోయెను.

యువకునికంట ప్రవాహవేగమున అశ్రులుద్భవించినవి. అతని హృదయ మొక్కమారుగ నుప్పొంగెను. శారదతప్ప మిగిలిన ప్రపంచ మంతయు నాసమయమున ఆతనికి గోచరించలేదు. రెండుహస్తము లును శారదవైపున కేగినవి. అవి శారద నాతని హృదయమునకు జేర్చి నవి. «శారదా! శారదా! నిన్ను నేను యెన్నటికేనియు పరిణయమా డెదను. నీప్రేమ అపారము, నీకంటె ప్రియమగు వస్తువు యింకొకటి యీప్రపంచమున లేదు. రేపటి యుదయముననే నేను రంగూనుకు ప్ర యాణమగుచుంటిని. ఒకటిన్నరవత్సరములలో తిరిగివచ్చి తప్పక నిన్ను పెండ్లియాడెదను.” అని యువకుని హృదయ కుహరమునుండి కొన్ని వాక్యములు వెలువడినవి. ఒక కోవెల కూయికూని ముమ్మారుకూసినది. ప్రపంచమును చీకటులలముకొనినవి. ఆయంధకారమున మైమరచి నొ కరినొకరు విడువలేక శారదయు నాయువకుడును అటులనే యెంతవరకుం డిరో చెప్ప వీలుగాదు.

౨

ఇంక నిట నీ శారదగురించియు నీ యువకుని గురించియు కొంచ ము చదువరులు తెలిసికొనుట మంచిది. శారద వెంకటరత్నముగారి కొ మరిత వెంకటరత్నము గారు రైల్వే కంట్రాక్టరుగనున్నారు. మొట్టమొ దట యెంతటి దుర్భరస్థితియం దుండియున్నను నేడుమాత్రము చాల యాస్తి సంపాదించియున్నారు.

ఇంక నీ యువకునిపేరు కృష్ణమూర్తి; గౌరవ కుటుంబమునజన్మిం చినను ఆతనికి డబ్బు కొరతయొక్కటికలదు. తండ్రికి గల యాస్తియంత యు వోడవర్తకమందు పోయెను. దానివలన కృష్ణమూర్తి తలిదండ్రు లు బెంగగొని పరలోకగతులైరి. ప్రస్తుతము కృష్ణమూర్తికి బంధువు లె వ్వరును లేరనియే చెప్పవలయును. ఏలనన ధనము లేనిసమయమున మా వాడని చెప్పుచు దగ్గరకు చేరదీయునంతటి మూఢులీప్రపంచమున నుం దురా! ఈవిషయము మందఱెరింగియేయుందురు. కృష్ణమూర్తి శారదను

ప్రేమించెను. శారదయు కృష్ణమూర్తినితప్ప యింకెవ్వరిని గాని పెండ్లి యాడనని హృదయపూర్వకముగ పలికియున్నది. ధనములేనివానికి తన పిల్ల నిచ్చుటకు వెంకటరత్నముగా రంగీకరింపరైరి.

3

శారదాకృష్ణులు మాటలాడుకొని నిండు ఆశలతో నొకరినొకరు విడచి ఆరు నెలలైనది. కాలమెల్లప్పుడు నొకరీతిగనే యుండదుకదా! ఈ లోపున నెన్నియో మార్పులు గలిగినవి. పాపము శారదతండ్రి వెంకటరత్నముగారు కాలధర్మమునొందిరి. శారద మరుతల్లి కడ దిన ముల నతికష్టముతో గడుపవలసివచ్చినది. ఆమె కెంతయో కష్టముగ నుండెను. శారదయు దినములు లెక్కబెట్టుచుండెను. కృష్ణమూర్తి యొ కటిన్నర వత్సరములకుకదా తిరిగివత్తునని మాటయిచ్చియుండెను. ఆత డు రంగూనునకేగి యిప్పటి కారుమాసములైనది. ఎప్పుడు వత్సరము ముగియునా, యెప్పుడు కృష్ణుని చూచెదనా యని శారద యెంతయో ఆసతోనుండెను.

శారద మరుతల్లియగు పార్వతియు నీ శారదను తన తమ్మునకొ సగి పెండ్లిచేయవలయునని పన్నాగములు పన్న నారంభించెను. వీటినన్ని టిని గమనించుచున్న శారద మనమునకెంతయో కంటకముగనుండెను. ఆమెకు దినమొక యుగమువలె దోచుచుండెను.

తుద కొకనాటి సాయంకాలమున పార్వతి తన మనోభీష్టమును శారద కెరిగించెను.

శారద కెక్కడలేని కోపమును వచ్చెను. ఆమె శరీరమంతయు నొకమారు వడకెను. నేత్రములు మరింత విశాలములాయెను. "నేను మామను పెండ్లియాడను." అని తుదకామె తెగువజేసి మరుతల్లి కెరుక పరచెను.

"నీవు ఆతనినే పెండ్లియాడవలయును." అని మరుతల్లి తన నిశ్చి తాభిప్రాయమును వెళ్ళబుచ్చెను. "నే నొల్లన"ని శారదబలికెను.

పార్వతి కెక్కుడలేని కోపమువచ్చెను. "అట్లయిన నీవు పెండ్లియే చేయను" అని బిగ్గర పార్వతి యరచెను. "అదియును మేలే" యని శారద బదులుచెప్పి గదిలోనికేగెను.

౪

శారద ప్రతిదినము స్నానమాచరించిన వెనుక తనపెట్టె దెరచి అందుండి యొకపటమును బయటికిదీసి దానిచుట్టు నొక పూలమాలనుంచి కొంచముసేపు జూచి మరల దానిని యథాస్థానమునందుంచి వేయును. అటుపిమ్మట తలదువ్వుకొని సరియగు వస్త్రములధరించి నిలువుటద్దమున కెదుట చాలసేపు నిలచి తనలో తాను "నేనించుకేనియు మారిపోలేదు. నా కృష్ణుడు నన్ను తప్పక గుర్తించును. నన్ను మనసార ప్రేమించును" అని అనుకొనుచుండును. ఈ పనులమాత్రము మానక చేయకుండ నున్నదిన మొక్కటేనియు లేదని నొక్కివక్కాణింపవచ్చును. నిజముగ శారదయందుకూడ నించుకేనియు మార్పుగలుగలేదు.

౫

కృష్ణమూర్తి రంగూను కేగినమీద మొదటి యారుమాసములను ఒక కార్యాలయమున నూరు రూపాయల వేతనముమీద కంపెనీ యధ్యక్షునికడ నాంతరంగిక కార్యదర్శిగ పనిచేసెను. ఇదియుగాక రాత్రులందు పత్రికలకు వ్యాసముల వ్రాసియు కూడ కొంతధనమును సంపాదింపకలిగెను.

రంగూనుదేశమున ఆంధ్రకార్మికు లెక్కుడుగ నున్నారు. వీరి యమాయకత్వమును గనిపెట్టి మేస్త్రీ లెక్కుడన్యాయముల నొనరించుచున్నారు. వీని నంతటిని గాంచి కృష్ణమూర్తి కార్మిక ప్రజలకు సహాయముచేయు నుద్దేశముతో తనకుగల కొలదిధనముతోడ నొక వారపత్రికను ప్రకటింప నారంభించెను.

కృష్ణమూర్తి సుప్రసిద్ధవ్యాసకర్త యనునామమును యిదివరకే

సంపాదించి యుండుటచే ఆతనికిగాటయున నెంతయో ప్రజలు గౌరవింప నారంభించిరి. దినదినమునకు పత్రిక కెక్కువ పలుకుబడి కలుగుచుండెను. దానితోబాటు చందాదారుల సంఖ్యయు నెక్కుడైనది. కార్మిక ప్రజల కెన్నియో సహాయములు పత్రికద్వారా గలుగుచుండెను.

కృష్ణమూర్తిపై [illegible] బూనిరి. మునుపటి వలె అన్యాయముగ ధనమును సంపాదించుటకు మార్గములు [illegible] మెను. న్యాయముగవచ్చు ధనముచాలన వారికి తృప్తిలేదాయెను. కాన వారెన్నియో కుట్రలుపన్ని పత్రికలయందు మానసష్టమగు వ్యాసము లున్నవనెపమున కోర్టున కనేకపర్యాయములు రప్పించి తుదకాతనిపై దొంతనమువారు యేడేండ్ల కఠినశిక్ష విధించులాగున గావించిరి. ఇంత కును ధనము న్యాయమున కన్నగనెనియు గోడను గట్టింపగలముగదా!

౩

మూడేండ్లాయెను. శారద యింకను నిండుటాశలతో నుండెను. నేడుగాకున్న రేపైనను కృష్ణుడు వచ్చుననియే ఆమె నమ్మియుండెను. మరుతల్లిబెట్టు కష్టములనన్నింటిని శాంతముగనోర్చినది. ఆమె దృష్టి యంతయు కృష్ణునివైపే యుండెను. శారదమాత్రిమ్ము దినదినమును కృష్ణుని ఛాయాపటము దిలకించుటగాని నిలువుటద్దమున కెదుటనిలచి 'నేను మునుపటివలెనే యున్నాన'ని యనుకొనుటగాని మానలేదు.

కృష్ణమూర్తి జైలునందు కృశించెను. ఏడేండ్లును పూర్తియైనవి. జైలునుండి విడుదలచేయబడెను. కార్మిక ప్రజలందఱును నాటిదినమున పనులమాని కారాగృహముకడకువచ్చిరి. శల్యావశిష్టుడైయున్న కృష్ణుని గాంచినవారెంతయు దుఃఖించిరి.

కృష్ణమూర్తి యింక కార్మికులవిషయమై పనిచేయజాలడు. అతడత్యావశ్యకముగ నొనరింపవలసిన కార్యమింకొకటియున్నది. అదిశారద యెట్లున్నదో? యేమైనదో తెలిసికొనుట. కృష్ణమూర్తి మోడనెక్కి నాటిసాయంకాలమే గృహమునకు బయలుదేరెను.

కృష్ణమూర్తి తన్నువిడచి యెనిమిదేండ్లు నాటితో నిండిపోయినివి. నాడేలనో శారదహృదయమున జంకుపుట్టెను. “నాకృష్ణుడు నాకు. దక్కడా?” యని యనుచు అద్దముయెదుట పదినిముసము లట్టెనిలచెను ఆమె కనులనుండి అశ్రువులు వ్రాలెను. తిన్నగ శారద మంచముపై బడెను.

౨

కృష్ణమూర్తి పదములు తడబడ నారంభించెను. ఆతడు శారదా సదనముయొక్క సోపానముల నెక్కుచున్న సమయముననే శారద మరు తల్లి నాతడుగాంచెను. అతడామెకు వినయపూర్వకముగ నమస్కరించెను. పార్వతి తూష్ణీంభావముతో నాతనిని దిలకించి లోనికేగెను.

కృష్ణమూర్తి - ఆమె తన్ను గుర్తింపలేదనుకొనియెను. మెల్లగ నాతడు శారదగదికడ కేగి నిలచెను. శారదగదితలుపులు యించుక దగ్గరగ వేయబడియుండెను. ఆతడక్కడనే నిలచి తలుపుకరె చెవియొగ్గెను “నన్ను కృష్ణుడు ప్రేమించునా? నేను మునుపటియందముతో నుంటినా?” యనుమాట లాతనికి వినబడెను. అవి శారదమాటలని కృష్ణుడు కనిపెట్టెను. ఆతని కనులశ్రుపూరితములాయెను.

కృష్ణమూర్తి తలుపులనించుక తెరచి లోనికడుగిడెను. నిలువుటద్దముకడనున్న శారద యించుకపక్కకుతిరిగెను. ఆమె విశాలనయనముల శోకనూతన వికాసము గలిగెను.

శారద శల్యావశిష్టుడగు కృష్ణుని గుర్తించినది. “వచ్చితిరా! వచ్చితిరా!! నన్ను మరువకుండ తుదకు వచ్చితిరా!” అనుమాట లామె రుద్ధకంఠమునుండి వెలువడెను.

శారదాకృష్ణులహస్తము లొండొంటితో కలసికొనినవి. తరువాత “నా శారదా! నా శారదా!!” యనియు “యీతనువును మీకర్పణగావించిన నన్ను మరువకుండ తిరిగివచ్చిన మీ ప్రేమయే ప్రేమ” అనియు

శారదాకృష్ణులొకరినొకరు నమకొనినట్లు ప్రక్కగదినున్న పార్వతికి వినబడినవి. కాని శారదాకృష్ణులీ ప్రపంచమున హాయిగ కాలముగడపిరా?

ఈప్రపంచమున హృదయజనితమగు నిజప్రేమకు తావున్నదా? మతము, ధనము, కులము, గోత్రము-యిన్ని అడ్డులున్నవిగదా! అట్టి యెడ అనాగరికమను ఆటంకములుగల ఈప్రపంచమున నిశ్చలప్రేమ శాశ్వతములగు నాయాత్మలెటులుండును? రెండును వొకటియై గాలి గలసినవి.

## నా జీవిత పత్రము.



౧

నేనును మాప్రక్కవీధిని యున్న కామాక్షియు ఒకే తరగతి యందు చదువుచుండెడివారము. కామాక్షి వయసున నాకన్న కొంచెము పెద్ద. ఆమె చాలా తెలివిగలది. నేనును కామాక్షికి తెలివితేటలయం దెంతమాత్రమును తీసిపోయెడివాడను గాను. బడివిడచిపెట్టిన వెంటనే నేను కామాక్షి గృహమునకేగుచుండెడివాడను. అదెందుచేతనో గాని కామాక్షితల్లి నన్ను గాంచిన నాటనుండియు అల్లుడా యని పిలువ మొదలిడినది. నన్నామె యెంతయో ప్రేమగా చూచుచుండెడిది.

కామాక్షి కొక చెల్లెలు కలదు. ఆమె శారద, శారద చక్కదనముల కుప్ప యనక తప్పదు. మిత్రులారా! సోగకన్నులు, విశాల ఫాలభాగము, కారుచీకటివంటి నల్లని పొడుగాటివాలుజడ, బంగరుఛాయ దేహము—ఇవి యన్నింటితోడను గూడిన బాలిక నొకమారు మీయెదుట నున్నట్లు తలంచుకొనుడు! అట్టి బాలిక, పదునాల్గేండ్ల బాలుని యెదుటబడినయప్పుడు,—ఆ బాలిక తల్లిదండ్రులా బాలుని అల్లుడా యా

మూర్ఖయి భర్త" యని ప్రేమతో బిలచునప్పు డా బాలునిహృదయ మె ట్టిస్థితియందుండునో వీరా రాలోచించుకొనుడు!

అదియేమి చిత్రమో గాని శారద నన్ను చూచునప్పటికి మోముపంచుకొనుచు సిగ్గు నెంతయో యభినయించుచుండెడిది. శారద యెంతటి సిగ్గుబడుచుండినను యెవ్వరును లేనిసమయమున ఆమెను మంచినీళ్ళ దెమ్మనిచెప్పి పాత్ర నందుకొనెడినెపమున నామె లలితకరము నే బట్టిలాగెడివాడను. అట్టిసమయమున నా యానంద మెంతవఱకు విజృంభింతుచుండెడిదో!—హా! ఆ విషయమును నేను తలంపునకు దెచ్చుకొనుకొలదియు దుఃఖతరంగములు నామనోకందకమున బొంగిపోవుచున్నవి

౨

దినములు, వారములు నెలలు గడువనారంభించెను. శారద తండ్రికిని, మానాయనగారికిని మనస్పర్థ లుండినప్పటికిని ఆమె తండ్రిమాత్ర మావిరోధ భావమును నాయెడ కూడ వహింపకైరి,—చెప్ప మరచితిని, శారద తండ్రిపేరు మాధవరావుగారు, మాధవరావుగారనిన నాకెంతయో ప్రేమ; యెంతయోభక్తి; యెంతయోచనవు.

ఇట మానాయనగారివిషయమై చెప్పవలసిన దొక సంగతియుగలదు. వీరికి కోపము మెండు. చెప్పుడు మాటల నెక్కుడుగ వినునట్టి స్వభావము గలదు.

మాధవరావుగారు యెట్లులైన శారదను నా కిచ్చి వివాహము చేయవలయునని దృఢనిశ్చయులై నాలుగైదేండ్లనుండి హృదయమున నాటుకొనియుండిన వైషమ్య భావము నావలకు బారద్రోలి కొంతమంది పెద్దల నిడుకొని మాగృహమునకు విచ్చేసిరి. వారందరిని గాంచిన మానాయనగారు లేచి మాధవరావుగారిని దప్ప మిగిలిన వారందరిని లోనికి రావలసినదిగ ఆహ్వానించిరి. నే నా సమయమున అచ్చటనే యుంటిని. ఇంటికి తనంతతావచ్చిన మాధవరావుగారిని మా నాయనగార గౌరవపరచుటను గాంచిన నా కెంతయో దుఃఖమును కోప

మును గలిగినవి. ఆయన అట్లవమానింపబడుటను గాంచిన నేను చిన్నబోయితిని. నా కాసమయమున నేను మాధవరావుగారి యింట నందిన సత్కారములన్నియు జ్ఞాపకమునకువచ్చినవి. వినయ విధేయతలతో చిఱునవ్వు నవ్వుచు రావుగారిని సమీపించి చనవుగ హస్తమును బట్టుకొని లోనికి రావలసినదిగ వేడితిని. వారునన్నెంతగనో మెచ్చుకొని దరహసిత వదనులై దరికిదీసి భుజముపై తట్టుచు “పరవాలేదు నాయనా” అని సమాధానపరచి, గడపకడనే నాతోనిలచి మా నాయనగారి వైపు తిరిగి “అయ్యా! నేను మోహనునకు శారదనిచ్చి పెండ్లిచేయ నుద్దేశించితిని. ఇందులకు మీరు సమ్మతింతురా?” అని సవినయముగ నడిగిరి. అందుమీఁద వారితోడ వచ్చిన పెద్దలందరు మాధవరావుగారి కోరిక ప్రకార మొనరించిన బాగుగనుండునని యెంతయు సలహా నొసగిరి. మా నాయనగారి ముఖచిహ్నములబట్టి ఆయన కామాటలు విషతుల్యముగ దోచినట్లు గ్రహించుకొంటిని. వారి హృదయమున విరోధాగ్ని యింకను ప్రబలుచునేయున్నది. ఆయనకు విరోధమే ముఖ్యమని నే ననుకొంటిని. ఆఖరున కాయన ఒక్కమారుగ “మావాని కింతలో పెండ్లిచేయు తలంపులేదు.” అని యొక్కవాక్యముతో నూరకొనిరి.

తరువాత యింక చెప్పున దేమి? మాధవరావుగారు వివర్ణవదనులై గృహాభిముఖులైరి. నాకు దుఃఖమును కోపమును గలిగినవి. నే నేమి సేయుదును! శారదను నేనెన్నటికైనను యెట్టులైనను పెండ్లియాడెద నని నిశ్చయించుకొంటిని. అటు లుద్దేశించి లోనికి బిరబిర బోవుచుంటిని. దారిలో మా నాయనగారు నన్నాపి బరబర లోని కీడ్చుకొని పోయి “మాధవరావును లోని కేలరమ్మంటివి?” అని కేకలువేసిరి.

## ౩

కొన్ని యేండ్లు గడచినవి. ఇందులకు సంబంధించి వారందరి పాత్రలును ఆఖరైనవి. ఇంక నే నేవిషయమును దాచవలసిన యగత్యములేదు. స్పష్టముగ జెప్పెద నాలింపుడు!

శారదపై గాఢానురాగము నా కుదయించినది. నేనెంతయో ఆ సజెంది యుంటిని. అట్టి నాయాశయంతయు నొక్కమారుగ మొదలంట దుంపివేయబడెను. ఇంతవరకును ప్రవహింప తావులేని దుఃఖప్రవాహ మొక్కమారుగ గట్లు విరుగునట్లు ప్రవహింప నారంభించెను. ఆప్రవాహపరిపూరిత రాగజాలము నాహృదయసంతోష మొక్కమారుగ కొట్టుకొని పోయినది.

శారదకు పెండ్లి యీడువచ్చినది. యువతియైనమీద పెండ్లి జేయుదమనుకొనిన వీలా? హిందూధర్మములు! అయ్యో! రజస్వలావివాహములజేయుట కెక్కడ తావుకలదు? అట్టి తలపుదలచిన నెంతయో నపరాధ మొనరించుటయే యనవలయును. ఇంతయేల? తెగువజేసి రజస్వలా వివాహము లాచరించిన వారల నెంతటిచిక్కులవలయందీ హిందూసంఘ మిదివరలో నిడినదో ఒక్కమారు తలంచిన నిట్టికార్యముల నింకెవ్వరును తలంపరు; ఆచరింపరు.

౪

తుదకు మాధవరావుగారు శారదకు వేరొక సంబంధముజూచి పరిణయ మాచరించిరి.

ఇంక పరిణయానంతరము శారదజీవితమెట్లు పరిణమించినదో యనిమాత్రి మడుగవలదు. మిత్రులారా! ఆవిషయము తలంచునంతనే అబ్బ! నాదుఃఖము! నేనేమని చెప్పుదును! ఒక్కమాట;—అంతటి తోసరి; శారద నాకెట్లులైననిచ్చి పెండ్లిజేయదలచి— యేండ్లనుండి హృదయకుహరమున నాటుకొనియుండిన ద్వేషభావముల బారదోలి మా నాయనగారికడకువచ్చి నోరువిడచియడిగి, లేదనిపించుకొని, అవమానితులై, తుదకు వేరొకని కిచ్చి తప్పనసరిగ వివాహము గావింపబడిన శారద జీవితము శోకపూరితము! శోకాంతసమన్వితము! ఇంతకంటెనే నెక్కడు చెప్పజాలను. నన్ను మన్నింపుడు!

అంతటితో నాకు తండ్రిగారిపై గల ప్రేమ కొంతవరకు తగ్గినది.

మానాయనగారియొక్క యాటంకమువలన శారదయొక్కయు హృదయసీమల నబ్బురముగ బెంచుకొనుచుండిన ప్రేమపూరిత పరస్పరానురాగలతిక యొక్కమూలుగ ఛేదింపబడినది.

గృహమున నుండుటయని నాకెంతయో విసుగుగ నుండెను. బాటను శోకసముద్రముల బాష్పపూరిత లోచనయై గవాక్షము నుండి చూచు విషణ్ణ సుకుమార కోమల శారదా వదన సీమను గాంచునప్పుడు నాహృదయము వ్రక్కలగుచుండెడిది.

శారద వరుల సొమ్మైనది. ఇంక యాసలుంచుకొని విచారించుట మహాపరాధము, ఇట్లులాలోచించుకొనుచు నేనొకనాటి సాయంకాలము తల్లిదండ్రులకు చెప్పకుండ బయలుదేరి కాకినాడ చేరితిని.

౫

తల్లిదండ్రుల కడనుండి వారి యదాయములపై నాధారపడియుండుటకన్న కష్టపడి ధనము సంపాదించుకొనుచు కాలము గడపుట మంచిది కాదా ! కాకినాడయందొక చిన్నగృహమును పది రూపాయల కద్దెకిదీసికొని అట నివసించుట కారంభించితిని. పత్రికలకు వ్యాసములను చిత్రములను వ్రాయుచు దాన వచ్చుధనముతో హాయిగ కాలము గడుపుచుండెడివాడను.

శారద పెండ్లియైన నాటినుండియు నా యందొక నూతనమగు మార్పుగలిగినదని మాత్రము మీరు జ్ఞాపకముంచుకొనవలయును. న్యాయముల నిర్ణయింపజాలని—కనులుండియు లేని యట్లుగనే సంచరించు నీ ప్రపంచముయొక్క జడత యెంతమాత్రమును నాకు సరియని దోచలేదు. పసికందుల, పండ్లూడిన బోసినోటి వృద్ధులకు వివాహము గావించుట లోకమన నెట్టిదో యెరుగని- ముక్కుపచ్చలారని పసికూనలకు వివాహములు గావించి కట్టబడిన యాతడు గంగగలియ అన్నెము బున్నెము నెరుగని ఆబాలల వితంతువులనుగా తయారుజేసి వారిజీవితముల నధోగతి పాలుగావించుట, ఆచారములను పేరిటను ధర్మశాస్త్ర

ములందరికి విధాలయ్యా యివియని డబాయించుటను, మేము బ్రహ్మ తలనుండివచ్చితిమి; మమ్ముమిగిలిన జాతులవారందరును రెండుచేతులు నొకచో జేర్చి మొక్కవలెను, అని నిరంకుశాధికారమును చలాయించుచు కాలమును గడపు సంఘములతోడను, నిండియుండిన యీ ప్రపంచ రీతుల బాగుగ నాలోచించిన వాడెవ్వడేనియు విశ్వసించునా ?

ఐనను సాధ్యమగునంతవరకు ప్రయత్నముల గావించి ప్రేమమీదనే యీప్రపంచముయొక్క వృద్ధియాధారపడియున్నదని ప్రజలకు తెలియజేయవలయునని మనమున నిశ్చయించి నాకువచ్చు రాబడినుండి కొంతధనమును వెచ్చించి తరుచు అందరకును అవసరములగు మందులను దెచ్చి నాగృహమందుంచి అవసరమైన వారికందరికిని యిచ్చుచుండెడివాడను.

మూడు మాసములలో మా వీధియందలి ప్రతివారితోడను నాకు పరిచయము గలిగినది. ఒకరితో కయ్యములుగాని విరోధములుగాని లేకుండ కాలము గడపు సాత్వికుడనని ఆవీధి వారికడ పేరు సంపాదింపగలిగితిని. అదియు నాయదృష్టమే.

౬

నాటి సాయంకాలము, దొడ్డిలో పూలమొక్కల కడ గూర్చుండి, ఆంధ్ర చిత్రకారుల గూర్చి యొక వ్యాసమును వ్రాయుచుంటిని. ఆ సమయమున యెవ్వరో తలుపు తట్టి నట్లాయెను. నేను వ్రాయుట మాని యెవ్వరు పిలుచుచున్నదా యనియుండ "ఏమండోయ్ ! తలుపు తీరు? " అని పిలుచు బాలునికంఠము వినబడెను.

వెంటనే ద్వారము తెరచితిని. ఒక బాలుడు నామీద బడెను. అతనిని హస్తములనెత్తి "ఏమి" యని ప్రశ్నించితిని.

మానాయనగారికి కుత్తింది" అని యేడువదొడగెను. "ఏమి పాము [illegible]కుట్టినది?" అని యేడువదొడగెను.

"ఏమి పామా తేలాకుట్టినది!" అని యడిగితిని గాని ఆ బాలుడు సమాధాన మీయ లేదు.

ఒందులకై నను మంచి దేయని తలచి పాము కాటునకును తేలు కుట్టునకును వలయు పరికరములను మందులను చేతబుచ్చుకొని బయలు దేరితిని. అది మా ప్రక్క వీధియందలి గృహము. ఇంటముఁగ్గిను ఏడ్పులును వినబడుచున్నవి. ఒకరిద్దరు మందలించుచుండిరి. "మా యింటికి నిదీసికొనివచ్చిన బాగుగనుండుననిి" యెంతయో మంది యనువారలేగాని పోవువారొక్కరేనియు కానబడలేదు.

నేను బిరబిరలోనికి బోయితిని. నలువదియైదు వత్సరముల పెద్దమనిషి క్రిందపరపబడియుండిన చాపపై పడియుండి నురుగలు గ్రక్కుచుండెను. ఆయన కనులు పచ్చబడుచుండెను. తప్పక యిది పాముకాటేయై యుండునని యనుకొని కాటు వేయుబడిన స్థానమున చిన్నకత్తి నాటు వేసి మందునంటించితిని. కొంచముమందును నోట బలాత్కారముగ బోసితిని.

ఒక్కగంట కాలమువరకును వీవనకర్రను చేబూని విసరుచు ప్రక్కనే కూరుచుంటిని. ఆయనభార్య యేడ్చుచుండ మరి మేవిధమగు భయమును లేదని అభయ మొసగితిని.

రాత్రి పదిగంటలాయెను. ఆయన కనులు దెరచి లేచి కూర్చుండెను. ప్రథమమున దాహము గావలయునని కోర నొక గ్లాసు పాలు నిప్పించితిని. ఇంక పరవాలేదని తెలుపుచునే నింటికి వెళ్లెదనని యంటిని కాని ఆయనభార్య అందులకియ్యకొనక నాటిరేయి అచ్చటనే ఉండవలసినదిగ బ్రతిమాలెను. ఆమెయొక్క ఆతురత నన్నారాత్రి అటనే ఆపివైచెను.

తరువాత ఆపాముచే కరువబడిన యాయన పేరు కేశవరావుగారనియు చాల మర్యాదగ జీవనముగడపు పెద్దమనుష్యులనియు తెలిసికొంటిని.

నాటినుండియు నేను కేశవరావుగారి కుటుంబములో నొక్కనివలె మెలగనారంభించితిని. ఆయన భార్యయగు పార్వతియు నన్నొక్కదినము చూడకయుండిన కబురంపి "నాయనా ! యిటులుండవచ్చునా !" అని యెంతయో జాలిగ మాటలాడుచుండెడిది. అందువలన దినమున కొక్క రెండుగంటలేనియు ఆయింటి కడనుండెడివాడను. క్రమముగ కేశవరావుగారి బిడ్డలందరును నాకడనే విద్యల నభ్యసింప నారంభించిరి. ప్రథమ పుత్రుడు చిత్రకళ నేర్చుకొన మొదలిడెను. అతని యిరువురు చెల్లెండ్రును ఆంధ్రమును ఆంగ్లమును చదువుచుండెడివారు. రావుగారి పెద్ద కొమరిత లలిత- ఆయింట లలితయే అందరిదుఃఖమునకును కారణము లలిత పదునాల్గేండ్ల బాలవితంతువు. ఆమె విషయమై కేశవరావుగారు నాతో ముచ్చటింపక యున్న దిన మొక్కటేనియు లేదు.

కోమలగాత్రి యగులలిత చాల చక్కనిది. ఆమె వితంతువని వినిననాటినుండియు నాకెంతయో విచారముగలిగెను. లలితకు విద్యయన యింతింతయుత్సాహమని చెప్ప వీలు లేదు. నేను వ్రాసినకథలను వ్యాసములను అన్నింటిని చదువుచుండెడిది. తెలియని విషయము లేదియేని యుండిన నాకడకువచ్చి అవనతవదనయై యెంతయో వినయముగ అడుగుచుండెడిది. ఆమెను చిన్నిచిన్ని వ్యాసముల వ్రాయవలసినదని నేను ప్రోత్సాహము చేయ చిన్ని చిన్ని వ్యాసములను వ్రాసి నాకొసగుచుండెడిది. వాటిని పత్రికలయం దామె పేరున ప్రకటించెదనని యన అందుల కామె లజ్జచే అంగీకరించెడిదిగాదు. అందువలన వాటిని "శకుంతలయను" మారుపేరుతో ప్రకటించుచుండెడివాడను. పత్రికాపరిచయముగలవారు చాలమంది యానామముతో ముద్రింపబడిన వ్యాసములయొక్క శ్రేష్ఠతను గమనించియే యుందురు. లలిత నాకడ చిత్రకళకూడ నేర్చుకొన నారంభించెను. తెలివితేటలుగల లలిత యిందునకూడను జ్ఞానమును సంపాదింపగలిగినదని వ్రాయనవసరము లేదు.

౭

అది శ్రావణమాసము, ఎవ్వరో బంధువులయింట మాఁడు వివాహము లగుచుండుటవలన కేశవరావు గారు భార్యను కొమరుని వెంటబెట్టుకొని గ్రామాంతరము వెళ్ళిరి. ఇరువురు చిన్నికొమారితలనుకూడ వెంటబెట్టుకొని వెళ్ళవలయుననితలచిరిగాని పరీక్షాదినము లగుటవలన అట్లు సేయుటకు వీలులేకపోయెను.

నా డాదివారము. లలితే వంటచేయుచుండెను. గదిలో బాలికలకడ కూరుచుండి ఆటలాడుచుంటిని. ఇరువురిలో చిన్నదియగు సరళ "అక్కతో చెప్పకండి, పెట్టెలో బొమ్మలు దీసుకుంటా" అని యనుచు పరాకున లలితవిడచిన తాళములతో పెట్టె తెరచి అందుండి చిన్నఅట్టలపెట్టె నొకదానిని బయటికిదీసెను. దానిని నేనందుకొని ఒక్కటొక్కటిగ జూచుచు లలితయొక్క హస్తనిపుణతకెంతయు నాలోనేను మెచ్చుకొనుచుంటిని. ఆసమయమున నన్ను నేనే నమ్మకొనజాలకపోయితిని. ఆపెట్టెయడుగున నాయొక్క చిత్రమున్నది. దానిని లలితయే స్వహస్తములతో చిత్రించినది. దీని నెన్నడును నాకామె చూపియుండలేదు. చిత్రముక్రింద ముద్దులొలుకు అక్షరములతో కొన్ని వాక్యముల వ్రాసినది. వాటిని మీాయెదుట బెట్టజాలను. అందులకు నన్ను క్షమింపవలయును. దాని సారాంశమును మాత్రము మీాకు దెలిపెదను. లలిత- బాలవితంతువగు లలిత- నన్ను మనసున వరించినది.

నాడు బాలికలకు పాఠముల జెప్పుటగాని, వ్యాసముల వ్రాయుటగాని జరుగలేదు. నాలో నేనే యెంతయో ఆలోచించుకొంటిని. ఎన్నియో ఆసలు- యెన్నియో ఆటంకములు నామనోదృష్టికి కానుపించినవి.

రాత్రి తొమ్మిదిగంటలైనది. బాలిక లిరువురును నిద్దురజెందిరి. లలిత యేదియోపుస్తకమును పెట్టుకొని నాయెదుట కూరుచుండెను. ఎన్నియోమారులు పలుకరించవలయు ననిపెదవి విప్పెడివాడనుగాని మరల వెనుకకు తగ్గెడివాడను.

తుదకు పండ్రెండుకాగనే నిదురవచ్చుచున్నదని లలితచెప్ప నిద్ర పోవ్వనియెను. నేనుమాత్రి మాస్థలముకడనే కనులు మూసికొని దీపము తగ్గించి కూరుచుంటిని.

నాకు నిద్రురవచ్చుచుండుట లేదుకాని కనులుమాత్రము మూసికొనియే యుంటిని. గోడపైనున్న గడియారము ఒంటిగంట కొట్టెను. ఒక్కమారు కనులుతెరచి వెనుకకు తిరిగితిని, ఏదియో చప్పుడైనట్లు వింటిని. లేచి ప్రక్కగదిలోనికేగితిని. లలిత మంచముపై పునకు పరుగిడుచుండెను.

దీపము నించుక పెద్దదిజేసి "లలితా!" యంటిని.

లలిత సిగ్గుచే కనుల మూసికొనెను. నే నామె మంచముమీదనే కూరుచుండి ఆమెకరముల నొత్తిగించి వేరు మాటయాడక ఆమెలిఖించిన నాచిత్రమును జూపితిని. లలిత దృక్కులొక్క నిముసమాచిత్రము మీద బడెను; ఆమె ఒక్కమారుగ తెల్లబోయెను; కనుకొలకుల కన్నీరు బయలుదేరె.

నే నింక యూరకొనజాలక "లలితా" మన మిరువురము నొకటి! నీవు నన్ను ప్రేమించితివి. నిన్ను నేను ప్రేమించితిని" అని హస్తముల లోనీ కామెను దీసికొంటిని.

రెండు నిముసము లట్లులే మే ముంటిమి. నాకరముల లలిత గజగజ వడంకెను. ఆమె పెదవులనుండి "నను విడువుడు" అను శోకపూరిత వాక్కులు బయలువెడలినవి.

నేను లలితను విడచితిని. అవనతవదనుడనగుచు ఆగదిని వీడి బయటకు వచ్చితిని.

వారము దినములు యెట్టులో గడపితిని. లలిత తల్లితండ్రులు తిరిగి వచ్చిరి.

నేను మరునటిదినమునుండి రావుగారియింటికి వెళ్ళినను లలితను జూడ మానితిని.

ఇంకొక వారముదినములు గడచినవి. లలితకు జ్వరము వచ్చెను. నాకు యెంతటి కోరికయుండినను ఆమెను మాత్రము చూచుటకేనియు పోనైతిని.

ఇట్లు లిరువదియొక్క దినములు గడచినవి. నేను నాగృహమున కూరుచుండి దినముల గడపుచుండెడి వాడనేగాని యేకార్యము నేనియు జేయజాలకుంటిని.

రాత్రి యెనిమిదిగంటల సమయమని నాకు జ్ఞాపకము. కేశవరావుగారు కన్నుల నీరుగార్చుచు నాగృహమునకు వచ్చి “నాయనా! లలిత యింక దక్కదు. నిన్ను చూడవలయు ననుచున్నది. ఒక్కమారు రా నాయనా” అనిరి.

“లలిత అంతటి—” అని యింక మాటలాడలేక పోయితిని. గృహము నేనియు బంధింపకుండగ బయలుదేరితిని.

శల్యావశిష్ట యగు లలిత యిరువుర చిన్నిచెల్లెండ్రను చేరి యొక ప్రక్కకును దీసి ముద్దాడుచుండెను. నన్ను జూచిన కేశవరావుగారి భార్య “నాయనా! లలిత!” అని శోకభరమున మాటలాడక యేడ్చెను.

లలిత నన్ను జూచినది. ఆమె చేయితో దగ్గరకు రమ్మని బిలచినది నేను మోకాళ్లపై ప్రక్క నిలచితిని. ఆమె పెదవులు మెదపుచుండెను! నాచెవి ఆమె పెదవులదరి నుంచితిని. “క్షమింపుము; తలక్రింద-” అను మాటలు వినబడినవి.

తలగడ క్రింద తడమితిని. అటనొక కాగితము దొరికినది. విప్పి “నేను వితంతువును మిమ్ముల ప్రేమించితిని గాని అది మన ధర్మములకు విరుద్ధమని మనమునసే యుంచుకొంటిని. దానిని మీరు గుర్తించి నాకు సాయపడవచ్చితిరి. దానివలన మీ గౌరవమునకు భంగము కలుగునని నేను తలంచితిని. మీ పైగల ప్రేమవలననే నేను త్వరలో యీలోకము లన్ను విడచుచున్నాను. నన్ను క్షమింపుడు. ఇట్లు,

మీ అభాగ్యపులలిత.

అని చదువు కొంటిని. లలితను జూచితిని. చేతుల జోడించినది. వాటిని బట్టునంతలో ఆమెకనులు మూతలు వడీనవి.

## స్వరాజ్యము లభించిననేగాని పెండ్లి యాడను.

చదువు మానినది సహాయ నిరాకరణోద్యమ సందర్భమున. మానాయనగా రెన్నియోవిధముల బోధించినను, బ్రతిమాలినను, కను లెర్రజేసి గజగజ లాడింప బ్రయత్నించినను వినలేదు; లెక్క సేయలేదు. ఉద్రేకపూరితుడనై యూరూర తిరిగి దేశమునకు స్వరాజ్యముయింక మూడు మాసములలో రానున్నదని ప్రజలనమ్మింప నారంభించితిని. ఆదినములలో కొంతమంది నాబోంట్ల చర్యలు నేడు తలంచుకొనినను, నాడై రీపత్రముల తిరుగవైచి చదివిచూచినను, నాకే యెంతయో నవ్వు వచ్చుచున్నది. పనులమానిన ప్లీడరుగుమస్తాలు, కాసేనియు ప్రాక్టీసు లేని న్యాయవాదులు, యిదివరకెన్నియో దొంగతనములును ఖూనీలును గావించిన పేరుగన్న క్రూరులు- అందరును దేశభక్తులుక్రింద ఒక్క మారుగ మారిరి. ఒకప్రక్క జేగురుగుడ్డల రామదండు హాహాకారము లు, యింకొకప్రక్క ఖద్దరురూపము గల జపాను ముతకనూలు కోరా వస్త్రధారుల జయజయ ధ్వానములు, మరియొకవైపు పత్రికా సంపాద కుల పటాటోప ప్రబోధములు, ఉత్సవములు, ఊరేగింపులు, పిచ్చికేక లు, అన్నియును ప్రజలయొక్క హృదయశాంతికి భంగము గలిగించినవి. సలసల గ్రాగుచున్న పాలవంటి యువకుల హృదయము లొక్కమారుగ ఆకర్షింపబడినవి. నావంటి యువకు లెంతమందియో పాఠశాలలను కళా శాలలను విడచివైచిరి. తల్లిదండ్రుల ధిక్కరించిరి, ఊరూరును తిరిగి

స్వతంత్ర రథము త్వరలో రానున్నదని పల్లెప్రజలకు బోధపం నారంభించిరి.

ఇంకను నవ్వు బుట్టించు సంగతులున్నవి. ఒక యువకుడు స్వరాజ్యము వచ్చిననేగాని మోకాలు దిగువ వస్త్రమును గాని చొక్కాను గాని ధరించనని శపథము జేసెను. ఇంకొకడు స్వరాజ్యము వచ్చిననేగాని రెండుపూటల భోజనము చేయనని మాటయొసగెను. వీరితోబాటు నేనును ఒకనవ్వు బుట్టించు శపథ మొనరించితిని. దీనిని నాదినచర్య గ్రంథమున యెర్రసిరాతో పెద్దయక్షరములతో ఆంగ్లాంధ్రభాషలయందు వ్రాసికొంటిని. దానినిక్కడ బేర్కొనుటకు సిగ్గిలుచున్నాను. నన్ను జూచి నాపిచ్చిశపథమునుజూచి మీారందరును నవ్వెదరని నాకుభయము. ఐనను దీనిని దాచవలసిన యంతయగత్యము లేని సమయమున నాయనుభవములనే బేర్కొనదలచిన సమయమున అన్నివిషయములను వ్రాయుట నావిధి. ఇంక నాశపథము—నేను స్వరాజ్యము సంపాదించునంతవరకును పెండ్లియాడనునది.

ఉద్యమమందు కాలిడి ఒకవత్సరముగడచినది. నాశపథము మా నాయన గారి కెంతయో ఆగ్రహము గలిగించినది. నాకు తన కొమార్తె నిచ్చి వివాహముచేయ ముందుగనే బేరసారములాడి నిర్ణయించుకొనిన మా మేనమామ, మానాయనగారి నెంతగనో తొందరచేయ నారంభించెను. దానిపై మానాయనగారునన్ను ప్రథమమున బెదరించిరి. నాకింత త్వరగ వివాహమవసరములేదని బదులుచెప్పితిని. తరువాత మాఅమ్మయు, యిరుగుపొరుగు అమ్మలక్కలందరును చుట్టునుజేరి యెంతగనో బ్రతిమాలిరి. తుదకు యిదివరకు నేను గావించిన నాశపథమునే వారి ముందును యేకరుబెట్టితినిగాని యెక్కిన గుర్రము నొకించుకయేనియు దిగనైతిని.

మామామ, సిప్పుదొక్కిన కోతియాయెను. కులమందలి పదిమందితోడను చెప్పి పెద్ద యల్లరి గావించెను.

అటుతాయన చిందులుద్రొక్కుటకును తగినంత కారణము లేక పోలేదు. నా భార్య—ఆ—అటులనిన లోకమూరకొనదు—నాకు ప్రిధానము జేయదలచిన ఆయన కొమార్తెయును శాంతకు పంచోదశవత్సరములు నాటికే దాటినవి. ఇంక యెక్కుడుకాలము వివాహముగావింపకుండ నుంచిన ఆ కుటుంబమువారు సాంఘిక నియమముల ప్రకారము వెలివేయబడుదురు. ఒక్క కుటుంబముపై కులమువారందరు కత్తిగట్టెదరు; బహిష్కరింతురు. ఆహా! వెలి యనిన లోకమెంత జడియును! ఇంతకును నేనేమి సేయుట! శాంతను నేను ప్రేమించలేదని ఒక్కమారేనియు చెప్పియుండలేదు. ఐనను నాశపథమును వీడగలనా!

మా మేనమామయు చాల పట్టుదలగలవాడు. ఆలసించిన కష్టము వాటిల్లునని భార్య యెంతచెప్పినను వినలేదు, ఒకనాటి యుదయమున మా గృహము యెదుట నిలచి నన్ను జూచి "నీవొనరించిన మోసము దేశమంతయు నెరుంగులాగున జేయుదును. నీకై యేమియునెరుగని బాలిక యొక్క జీవిత మధోగతిపాలుగానున్నది. ఇష్టమున్న నీవే పెండ్లియాడుము. లేదేని అస్ట్లేకృసియింపనిమ్ము. నేనుమాత్ర మింకొకనికిచ్చి వివాహముచేయ"నని మామ శపథము జేసెను.

ఒక వత్సరముగడచినది. ఎన్ని యోమార్పులుగలిగినవి. మామామ గృహమున్న వీధికేగుటయే మానివైచితిని. మా నాయనగారు లోకుల నిందల భరింపజాలక గుండె రాయిజేసికొని మర్యాదగజీవింప, నన్నావలకు తరిమివైచిరి.

ఇంకనాయిష్టము. జిల్లాయంతటను ప్రచారము జేసితిని. కూయమనిన కూతలనన్నింటిని కూసితిని; చేయమనిన చేతలనన్నింటిని జేసితిని.

తరువాత రెండవ వత్సరము గడచినది. నేను జైలునకంపబడితిని. నన్నా పోలీసువారు శాంతగృహమున్న వీధినుండియే తీసికొనిపోయిరి. నా వెనుక నొక పోలీసు యినస్పెక్టరు, ముందు సర్కిల్ యినస్పెక్టరు, యిరుప్రక్కలను యిద్దరు పోలీసుభటులును గలరు. శాంతగృహమును

సమీపించువరకును నిశ్చలముగనున్న మనస్సేలనో వేవేగ గొట్టుకొన నారంభించెను.

శాంతగృహము నింకొక రెండు నిముసములలో దాటెదను. నా దృష్టిఅంతయు ఆగృహముమీదనే యుండెను. ఇంతలో "అక్కా! బావనే" అనుమాటలు నాకు వినబడినవి. కంఠము శాంత తమ్మునిదని నేను గ్రహించితిని.

ఆసమయమున నాహృదయ ముప్పొంగెను. దుఃఖమడ్డు గట్లు తెగి ప్రవహించెను. ఆబాలుడు 'బావ' యనియనుటతో నాశరీరమును పులకించెను.

గృహమున కెదుటనే నిలచితిని. ఒక్కయడుగేనియు ముందునకు వేయలేనైతిని. పోలీసువారు వికృతహాసముల గావింపుచు 'మొదటనే యీబుద్ధివుంటే యెంతో బాగావుండేది. నడునడు! యీటక్కులకేమిలే' అని నన్ను చిన్నబుచ్చిరి. వెంటనే డాబామీదికి నాయశ్రుపూరిత నయనముల బరపితిని. ఒకక్షణమువరకును యేమియు కానుపించలేదు. ఇంచుక పీలునేసికొని కనులగ్రమ్మియున్న కన్నీటి తెరలదొలగించి చూచితిని. కంపితగాత్రముతో, బాష్పపూరితలోచనములతో విషాదవిహ్వాలతయై గద్గదకంఠమున "అయ్యో" యనుచు బలికిన శాంత నొకనిముసమువరకు కాంచితిని. తరువాత ఆడాబా మీదనే ఆమెకృంగెను. పిమ్మట కఠినశిక్ష విధింపబడిన నేను ఖైదునకు గొనిపోబడితిని.

3

ఇంకొకవత్సరము ఒకదీర్ఘవత్సరము బందిఖానాయందు గడిపితిని. తోడిఖైదీయొక్క బాధను గనిననేను జైలునందు మంగలిని నాదరికొక్కమారేనియు రానియ్యనైతిని.

జైలునుండి బయటకువచ్చుసరికి యెంతయోకాలమునుండి హారము లేని సింహమువలె గడ్డముతోనున్న నేనుంటిని. ఆగడ్డముతోనే

తిన్నగ మాయూరు జేరితిని. మాయిల్లుసేరుటకు ముందుగ శాంతగృహ ముపై జేగితిని. నాయడుగులు తడబడనారంభించెను. ఎట్టులనో శాంత యింటికి ప్రక్కగనున్న యొక తమలపాకు దుకాణమున కేగి నా యా తురత కొలది మొదట మామను గురించి యడుగుట మాని ఆ దుకాణ దారుని "శాంత అత్తవారింటి కేగినదా? లేక యిక్కడనే యున్నదా" యని యడిగితిని. ఆతడు నన్ను నుమానముతో జూడ నారంభించెను. హృదయవేగ మెక్కుడౌట వలన మరల నదేప్రశ్నను వైచితిని. అంత నాతడు 'నీకేమియవసరము' అని ప్రశ్నించెను. పాపమాతడు నన్ను గుర్తింపలేదు.

ఇంక నీతని ప్రశ్నించుటవలన లాభములేదని తలచి బిరబిర తల్లి దండ్రుల జూచుటకై నాయిలు సేరితిని.

మా గృహ మించుమించుగ పాడుపడిన ట్లున్నది. కృంగి కృశి యించిపోయిన పూలమొక్కల జూచిన నాకనులు ఒకటి రెండు కన్నీటి బిందువుల రాల్చినవి. మా నాయనగారి పఠన మందిరము మూయబడి యుండెను. అంతయు నిశ్శబ్దము.

ఇంటి ముందుగల మెట్లెక్కు కొలదిని నాశరీరమందలి నెత్తురెల్లయు పట్టుదప్పుచున్నటు లుండెను. నా హృదయ వేగమును పూర్తిగ పాఠ కులకు ప్రదర్శింపవలయునని యెంత ప్రదర్శించినను నాకు విధము స్ఫు రించుటలేదు. కాన యూహించుకొనవలసినదిగ చదువరులకు విన్నవిం చుచున్నాను.

గృహముయొక్క ప్రధాన ద్వారమును సమీపించి తలుపు గొళ్లె మును యించుక పట్టునిచ్చునని పట్టుకొని "అమ్మా! అమ్మా!" అని రెండు మారులు బిలచితిని. నా రెండుపిలుపులకును ప్రత్యుత్తరమేమి?

తలుపు తెరువబడినది. వాడివత్తియైయున్న మాయమ్మయొక్క "తండ్రిలేనివాడవైతివి నాయనా!" యను శోకపూరిత గద్గదకంఠము వింటిని.

నా కనులొక్కమారుగ చిట్టిచీకటులు గ్రమ్ముకొనినవి. హృదయము పగిలినట్లయినది. విషాదభరముచే కృసియించియున్న మాయమ్మ నేలవ్రాలి మూర్ఛిల్లినది. నాతండ్రి మరణసమయమున నుండుటకు నాకుభాగ్యము లేకపోయెను. ఉత్తరక్రియల నెరవుటకు నా కవకాశము జిక్కినది. ఈవిషయమెరింగిన నాదుఃఖము మరింత యెక్కుడాయెను. ఒక్క పదిదినములు బ్రతికియుండిన నాతండ్రిని నేను కనులార కడసారి చూచియుండెడి వాడనేగదా యని చింతించితిని.

కర్మ జేయుటయనిన నాకెంతమాత్రమును నమ్మకము లేదు. ఇష్టము లేదు. అట్టిసమయమున నీ బ్రాహ్మణులు నాదుఃఖము నేనియు గమనింపక దానికనియు దీనికనియు పేరుబెట్టి డబ్బులాగుట ప్రారంభము చేసిరి. మాయొక్క కష్టములనేనియు గమనింపక వీరుచేయు తొందరలు నాకెంతేయో ఆగ్రహమును గలిగించినవి. ఒక్క కానేనియు యిచ్చెడివాడనుగానని వారితో ఖండితముగనంటిని. అంత వారు కర్మకాండ జరుపమనిరి. కర్మయందు అనగా యీతంతునంతయు జరుపుటవలన మా నాయనగారి ఆత్మకు శాంతిగలుగునని నమ్మని నే నీ బెదరింపులకు జడియువాడనా?— అటులనే మీ యిష్టమువచ్చినట్లు చేయుడు నాకు భయము లేదంటిని. కులమువారందరును ఒక్కమారుగ మోము లెర్రజేసికొనిరి. నేనుమాత్రము యొక్కబ్రాహ్మణునేనియు బిలువలేదు. అంత కులమువారు ననులివేసెదమని బెదరించిరి; మీయిష్టమని యంటిని. అంతటితో—నాటితో—నాకును మాకులమువారికిని గల సంబంధము తెగిపోయినది.

౪

నాయనగారి మరణము శాంతపై గల వాంఛ నించుక తొలగించినది. నేనుమాత్రము నాగృహము నొక్క మారేనియు కదలలేదు. నాడు నేను మానాయనగారి పఠనమందిరమును దెరచి వారిబల్లకడ నిలచి యెదుటనున్న వారి చిత్రపటమును తిలకించుచుంటిని. ఆసమ

యమున మా నాయనగారి కర్మదినమున నేసియు గడపద్రొక్కని మా మామ విషాదపూరితవదనముతో నాయెదుటకువచ్చి ఒక్కక్షణము నిలచెను. అతని వదనమును గాంచిన నాకెంతయో జాలిగలిగినది.

ద్వారము కడనిలచి «అమ్మయెక్కడ?» అని మామయనడిగెను. «లోపల వసారాలో» నంటిని.

ఇంకొక్క నిమిసమేనియు అతడాగలేదు. ఆసమయమున నాకాతని యాతురతయేమియు బోధపడలేదు పిచ్చియెత్తినదేమోయని భ్రమపడితిని. ఈయన వింతప్రవర్తన నాకాశ్చర్యము గలిగింప నేనును నెమ్మదిగ లోనికేగితిని.

అతడు మాయమ్మ పదముల బట్టుకొని యుండెను. «అక్కా! క్షమించుము! నేను పాపిని, ఎంతయో అపకారము చేసితిని, ఐనను నన్ను నీవు రక్షింపవలయును» అని యేడ్చెను.

తరువాత అంతయు నాతల్లివలన తెలిసికొంటిని. శాంతయొక్క కష్టముల గాంచజాలక నీయేడాదిలో రెండు సంబంధముల నామె తండ్రి కుదిర్చెనుగాని పాపము శాంతమాత్రము నన్నుతప్ప వేరెవ్వరిని వరింపనని పట్టుబట్టి ఆసంబంధముల నిరాకరించినది. శాంత మనోస్థిరత్వము నాకెంతయో ఆందోళన గలిగించినది. ఇంకను అటనుండి వినవలయునని యెంతయో ఆతురత యుండెనుగాని యిన్సురెన్సు యేజంటు వచ్చియుండెనని సేవకుడు చెప్పుటవలన ఆస్థానమును వీడుటతప్పినది గాదు.

నేను యింకను ఆయేజంటుతో మాటలాడుచు నుండగ నే మాయమ్మ ద్వారముకడకు వచ్చి నిలచినది. ఏదియో అవసరకార్యముండునని యెంచి త్వరలో సంభాషణను ముగించి కార్యాలయమున కలసికొందమని యుద్యోగి కెరిగించి మాయమ్మవైపు తిరిగి ఆమె యేమిచెప్పునో యని వేచియుంటిని.

నన్నుచూచి ఆమెకనుల చెరగుతో నద్దుకొనుచు «నాయనా! మామతో వెళ్లుము» అని యనెను. ఎందులకో యని ప్రశ్నింపదలచితిని.

అది యేదియో ఆమెకు విషాదమును గలిగించునదిగ నుండుననియెంచి అటనే నిలచియుండ మామ సోపానముల దిగుచుండెను.

అవసరకార్యమై యుండుననితలచి యింక యాలసింపక ఆయనను వెన్నంటితిని. రెండు ఘట్టాంగులు యిరువురము నడచితిమిగాని ఒకరి నొకరు ఒక్కమారేనియు ప్రశ్నించుకొని యుండలేదు.

వంచినసిరముల నెత్తకుండనే యిరువురమును మామ గృహము చేరితిమి. గృహమంతయు నిశ్శబ్దముగనుండెను. మామ నన్ను మేడ మెట్ల వద్దకు దీసికొనివెళ్లెను. పైనున్న మేనయత్త జూచి చీరచెరగున మోము నొక్కమారు గప్పుకొని రా నాయనా! అని దుఃఖముతో బలికెను. నాశరీరము జలదరిల్లెను. నాకేమియుతోచలేదు. చిన్న బావ గోడకు జేర బడియుండెను. ఆతని వదనముకూడను శోకపూరితముగనే కన్పట్టుచుం డెను. అత్త శాంతగదిలోనికేగెను. నేనును ఆమె ననుసరించితిని. ఒక్క ప్రక్కనుండి మూల్గువినబడెను. ఆవైపునకు తిరిగితిని. అటనున్న పర్యంక ముపై శాంత—స్వరాజ్యము వచ్చిననేగాని పెండ్లి జేసికొనజాలనని నాచే యించుమించుగ దుఃఖవారధిని త్రోయబడిన శాంత—నామస్థైర్యమునకు పోలీసుభటులు నన్ను గొనిపోవుచుండగజూచి, ఆదృశ్యమును గాంచ జాలక డాబామీద మూర్ఛితయైన శాంత—నన్ను తప్ప వేరెవ్వరినిగాని పరిణయమాడనని పట్టుబట్టిన శాంత—కృంగి కృంగి కృశియించి వాడి, వత్తియై పర్యంకమున బడియుండెను.

ఆసమయమున నాయందుగలిగిన మార్పులనేను వ్రాయజాలను. అందులకు నాఅసమర్థతయే కారణమని యొప్పుకొనుచున్నాను.

భూమియంతయు గిర్రుగిర్రుమని తిరుగుచున్నయట్లు కానుపించెను నాచుట్టును నాబంధువు లెంతయోమంది యుండిరిగాని శుష్కదేహిని యగు శాంతదప్ప నాకేమియు పదునైదునిముసములవరకును కానుపించ లేదు.

నాచెవులకు "నాయనా! శాంతను పిలువుము" అను మాటలు

వినబడినవి కాని వాటినెవ్వరు ఉచ్చరించిరో మాత్రము గుర్తింపజాలక పోయితిని.

అంతటితో నాకనులుకూడను ఒకక్షణమువరకు మూతలుపడినవి. చెవులకు మాత్రము నాయనా! శాంతను పిలువుము, అను మాటలు వినబడుచునే యుండెను.

మరల కనులదెరచితిని. ఇదివరకువలె ప్రపంచము తిరుగుటలేదు. శాంతవైపు దృష్టినిగిడ్చితిని. ఆమెను "శాంతా! శాంతా!" యని పిలచితిని. శాంత పలుకలేదు. నేనూరకొని యుండలేకపోతిని. ఆమె కరములబట్టి మరల 'శాంతా!' యంటిని. శాంత కనులుతెరచినది. నన్ను చూచినది. ఐదునిముసములు చూచినది. నాకనులనుండి రెండశ్రు బిందువులామెపైవ్రాలినట్లు నాకు జ్ఞప్తియున్నది. అంతనామె "నన్ను మీదానననియెదరా?" అని ఆమె యనినది. "ఆ నీకన్న నాకీ లోకమున యెవ్వరు? నీవు నాదానవు. నేను నీవాడను" అని సమాధానమొసగితిని శాంత నవ్వినది. కనులు సంతుష్టితో మూతలుపడినవి. నా హృదయము బద్దలైనది.

# శాంతమూర్తి అయ్యరు.



జగన్నాధఅయ్యరు రెండున్నరవత్సరములు తెరపిలేకుండ నిద్రాహారములకూడ మాని కొమరితయగు మంగళమునకుదగ్గవరుని కుదుర్చుటకు తమ తాలూకాసంతతిని గాలించెను. తుదకాయనకు మహాద్భాగ్యమువలె శాంతమూర్తిఅయ్యరు దొరకెను. శాంతమూర్తిఅయ్యరు బి.యే. చదువుచున్న దినములలోననే సముద్రతీర సమావేశములయందు

సముద్రఘోషమనుకరించు కంఠముతో ఉపన్యాసములనిచ్చు సలవాటుగల దనియు యింక ముందు న్యాయవాదవృత్తి యందే యీతడు ప్రవేశించిన వేలకువేలుగ ధనమును ఆర్జించగలడనియు శాంతమూర్తి అయ్యరు యువ గుణములు గుణములు కొంతమంది జగన్నాథ అయ్యరుతో ననిరి. మంగళము తండ్రి తన కొమరితసుఖపడగలదని మనమున నెంతగనో సంతసించెను. తనలో అల్లుడు న్యాయశాస్త్ర మభ్యసించును. ప్రధానన్యాయ స్థానము న తన గంభీర కంఠముతో బల్లగుద్దుచు న్యాయాధికారియెదుట తాను అవలంబించిన పక్షమువారి కనుకూలముగులాగున వాదించును. అల్లునికి పట్టణమందెంతయో పలుకుబడి గలుగును. దాన మనకుగూడను కొంత వరకు గౌరవముగలుగును. వేలకొలదిగ ధనము నార్జించును; కోరికలు తీరునట్లు నా మంగళాంబ వస్త్రాభరణముల ధరించి సంతసించుచుండును. అని యనుకొనుచు సంబంధము స్థిరపరచుకొనిన యనంతరమున తన గ్రామమునకు బయలుదేరెను.

౨

ఇచ్చట మన శాంతమూర్తి అయ్యరునుగూర్చి కొంచెము చెప్పిన బాగుగ నుండును. శాంతమూర్తి అయ్యరుతండ్రి కాలముచేసి చాల వత్సరములైనది. ప్రస్తుతము ప్రపంచమున నున్నది అతడును అతనితల్లియు దప్ప బంధువు లెవ్వరును లేరనియే చెప్పవలయును.

శాంతమూర్తి పట్టపరీక్షయందుత్తీర్ణుడైన యనంతరము న్యాయశాస్త్రము నభ్యసింప నారంభించెను. చైత్రమాసమున ఒక శుభదినమున వివాహము జరుప జగన్నాథ అయ్యరు నిశ్చయించెను.

పాపము జగన్నాథ అయ్యరు సాధారణ సంసారి; మంగళాంబాకు తరువాత వివాహము గావలసిన బాలికలు ముగ్గురున్నారు. ఆపిల్లల సంగతి తలచుకొనినంతనే అతని కెంతయో భయముగలుగును. తన ప్రథమ పుత్రికకు భర్తను గుదుర్చుటకు తన కీప్రపంచమున గల క్రొల

ది యాస్తియు ఖర్చు చేయవలసివచ్చినది. ఇంక మువ్వురకెట్లు వివాహము గావించుట? ప్రతి సమస్కారమునకు ఒక్కొక్క బంగరుకాసు — పదునైదు రూపాయల విలువగల బంగరు కాసునకు తక్కువ కానిదైన వెలుపడ లేదు — ఒకటి కొనవలెనని శాంతమూర్తి అయ్యరు మామతో కపటముగ చెప్పివైచెను. ఒక్కమారు రెండు హస్తములను జోడించిన ఒక కాసు! అబ్బ! ఒక్క బాలికకు వివాహము చేయుట యన నెంతకష్టము! తుదకెట్టులేని జగన్నాథ అయ్యరు కొమరిత యగు మంగళను శాంతమూర్తి అయ్యరున కిచ్చి వివాహము గావించెను.

ముందు వచ్చు కష్టములనన్నింటిని యాలోచింపక జగన్నాథ అయ్యరు వివాహము గావించెను. పెండ్లియైనది మొదలు చిన్నపండుగయైనను పెద్దపండుగయైనను అల్లుని తనయింటికి ఆహ్వానించవలసి వచ్చుచుండెను. ప్రతిమారును అల్లుని యలుగులకు మామ యోర్చుకొనుట కష్టమగుచుండెను. ఐనను యేమి సేయుట? తప్పక అన్నింటిని పాపమాత డోర్చుకొని యుండవలసి వచ్చెను. వివాహమై రెండువత్సరములైనది మూర్తి అయ్యరు న్యాయవాది వృత్తి నభ్యసించుటకు పట్టణమందలి యొక ప్రసిద్ధ న్యాయవాదికడ అప్రెంటిస్ చేయుచుండెను.

ఆరుమాసములనుండి జగన్నాథ అయ్యరు పునస్సంధానము నొనరింప నుద్దేశించియున్నట్లు అల్లునకు వ్రాసినను అల్లుడు సరియగు ప్రత్యుత్తరము నొసగడాయెను. కార్యము జేయకుండ యింక నెక్కుడు కాలముంచిన లోకులు లేనిపోని యుదంతముల నెన్నింటినో గల్పింతురను భయమున స్వయముగ బయలుదేరి అల్లుడగు శాంతమూర్తి అయ్యరు గృహమున కేగెను.

నాడాదివారము. భోజనానంతరము అల్లుడును మామయు హాలులో తాంబూలము సేవించుచు కూరుచుండి యుండ శాంతమూర్తి అయ్యరుతల్లి వంటయింటి పనులనన్నింటిని చక్కబెట్టుకొని వచ్చి కొమరునికొక ప్రక్కగా క్రిందపరుపబడియున్న చాపమీద కూర్చుండి కొం

చము సేవ్ర కోడలియొక్క దేహారోగ్యమును గూర్చి ప్రశ్నించి తగిన సమాధానముల బడసెను.

పిమ్మట యింక నేను బయటకేగవలయునని శాంతమూర్తి అయ్యరు అనుచుండ మామ పునస్సంధానమును గూర్చి మాటదెచ్చి, యెప్పుడు నిర్ణయింప నిశ్చయించిన బాగుగ నుండునో తెలిసికొనవచ్చితి నని నెమ్మదిగ అనెను. ఈవిషయము తన కెంతయో విసుగు గలిగించు చున్నయట్లు శాంతమూర్తి అయ్యరు మోమును చిట్లించుకొనెను. ఆమె తల్లి ‘‘యేమి రానాయనా? మాటాడవేమి ?’’ అని యనెను.

ఆ శాంతమూర్తి శాంతత వహించెను. మామ అల్లుని యెన్ని యో విధముల ప్రశ్నించెను; యెదిగిన పిల్లనుంచుట ఆరోగ్యశాస్త్ర ప్రకారము విరుద్ధమని చెప్పెను. ఇరుగు పొరుగు వారు నవ్వెదరనియెను. ఇట్లాతడు పావ మొక్క గంటవరకు చెప్పెను. శాంతమూర్తి మాత్రము యిటునటు నెమ్మదిగా అడుగులిడుచుపచారు చేయుచు నుండెనేగాని జవాబియ్యక యూరకుండెను. తుదకు మామకువిసుగు జనించెను. దాని తో కోపము కూడ గలిగెను. ఏదియో నొకమాట చెప్పవలయునని ఆ యన ఖండితముగా ననెను.

శాంతమూర్తి అయ్యరు వదనమున యించుక చిరునవ్వు జనించె ను. అతడు మామ యింతటి స్థితికి రావలయుననియే యింతవరకును వేచియుండెనని అతని వదనము నాసమయమున గాంచినవారు తప్పక యనుకొనియెదరు. తరువాత మూర్తి అయ్యరు తల్లివైపు తిరిగి ‘‘చెప్పవే’’ అనియనెను. వితంతువు ముసుగు నించుక సరిజేసికొని ‘‘ఎందుకు, యింక దాచడం? మావాడు యీమధ్య యెవరో వకీలు వద్ద జేరుటకు ఆరువందలు అప్పుజేసెను. అడబ్బు కూడా మీరు మీపిల్ల ఒంటిమీద బెడతానన్న వెయ్యి రూపాయలనగలు, మీరు యిస్తానన్న నాలుగు వందల రూపాయల పాత్రి సామానులును గాక ఆరువందల రూపాయ లు యిస్తేనేగాని మావాడు కార్యము చేసుకోడట. ఈ మాటలు చెప్ప

డానికి మానాయన సిగ్గుపడుతూ వున్నా''డని వ్యవహార మంతటిని చెప్పి వైచెను.

జగన్నాథ అయ్యరు తెల్లవోయెను. అతని కేమి యనుటకును తోచదాయెను. ఈతని నల్లునిగా బడయుట వలననే తన కీ ప్రపంచము నగల కొలది ధనమును ఆఖరైనది. ప్రస్తుతము యీ పునస్సంధాన శుభమును గావించుటకు రెండువేలు రూపాయలగుచున్నది. ఇంకొక ఆరువంద లెక్కడనుండి తీసుకొని వచ్చుట? అతడు దీర్ఘాలోచన జేసెను. అల్లుని ధనాశ కాతడెంతెరయో కృద్ధుడాయెను. ఆతక్షణమే స్వగ్రామమున కేగవలయునని ఒక్కమారు లేచెను. కాని మరల పిల్లలతండ్రియగు నాతని కనులకు తనప్రథమ పుత్రియగు మంగళాంబవదనబింబము కానుపించెను. ఆమె లేత పెదవులపై చిరునగవులు తాండవ మాడుచుండి నట్లగపడెను.

ఒక్కమారుగ జగన్నాథ అయ్యరు కనుల కన్నీరునిండెను. కడుపార గాంచినబిడ్డయొక్క సౌఖ్యమున కెంతటి యడ్డంకులు వచ్చినను వాటినన్నింటిని అడ్డుకొనవలయునని ఆతడు నిశ్చయించుకొనెను. మామయొక్క ముఖకళల అల్లుడు దొంగతనముగ గమనించుచునే యుండెను. తుదకేమియు చేయునదిలేక నాతడు నాల్గువందల రూపాయ లల్లునకొసగుటకు నిశ్చయించికొని నాడే యొక శుభముహూర్తమును నిశ్చయించి గృహాభిముఖుడాయెను.

## 3

మరలశాంతమూర్తి అయ్యరుయొక్క పట్టణ జీవనమును గూర్చి యించుక ముచ్చటించవలసిన యగత్య ముదయించినది. మూర్తి అయ్యరు నరుగురితోబాటు తిరుగుదినములు దాటినవి. తానొక పెద్ద రాజకీయవేత్తయాయెను. ఏసందుగొందులలో జూచినను పెద్దకంఠముతో సభ్యాసభ్యములను విషయమును గమనింపకుండనే నోటికెంతవచ్చిన అంత కూ

యనారంభించెను. పురమందలి పెద్దల కీతనిపై తుడకసహ్యాము జనించె
ను. కాని సమయా సమయముల గిమనింపని- మంచిచెడ్డల నెరుగని
యీమూర్తి అయ్యరుచే నేలమాటపడవలయునను ఉద్దేశముతో నే
మియు ననకుండ పెద్దలు ఊరకుండెడివారు. వీరియొక్క సుగుణము లింక
ను యెన్నియో కలవుగాని వాటినన్నింటిని యిప్పుట నుపహరించుట
భావ్యముగాదని యూరకుంటిమి. ప్రసన్నంధాన మెట్టులో గానింపబ
డినది.

ఆరు నెలలయనంతరము మంగళాంబ మగనిగృహమున కంపబడె
ను. ఆమె తనతోడిబాలికలవలన వినిన సౌఖ్యపుంజములన్నియు తాను
గూడ నికమీద భర్తయింట ననుభవింపవచ్చును గదా యని తలచుచు
తల్లిదండ్రులను చెల్లెండ్రను విడచుచున్న దుఃఖమునేనియు దిగమ్రింగి
బయలుదేరి భర్తృగృహమున కేగినది.

పాపము! తన తలపులన్నియు గాలి మేడలవలె కానుపింప నారం
భించెను. అత్తగారు, యింటనింతవరకును పనిచేయుచుండిన సేవకురాలిని
మానిపించెను. గృహమందలి పనులన్నియు నాప మాబాలికతలపై బ
డెను. ఏ మాత్రము తప్పువచ్చినను అత్తయు, భర్తయు కలసి తన్ను
మొత్తుచుండెడివారు. ఎంతటిసామాన్యకుటుంబమున జెందియుండినను
పాపము మంగళాంబ కడుగారాబముగ బెరిగినది. అందునను ప్రథమపు
త్రిక యగుటవలన తల్లిదండ్రులింతింత గారాలముతో బెంచుచుండెడి
వారని మాత్రము చెప్పజాలము. అత్తవారియింటికడ నా ను రొయింటిపై
నెన్ని చీపురుకట్టలు విరిగెనో చెప్పుట చాల కష్టము. రాత్రులయందుదు
అయ్యరువేయు కేకలు బోనులోని ఆకలిగొన్న సింహగర్జనలకన్న భీక
రములయి యుండెడివని చెప్పి మిగిలిన విషయములగూర్చి యాలోచిం
చుకొనవలసినదిగ పాఠక మహాశయులకు వదలెదము.

౪

జగన్నాథఅయ్యరును అతనిభార్యయు నాడుచుట్టములయింటికి

పెండ్లిసంబంధమున వెళ్ళి,తిరిగివచ్చి వసారాయందు కూర్చుండి నూతన దంపతుల గురించియు కట్నముల గురించియు మాటలాడుచుండెను. ఆసమయమున తపాలావాఁడొక యుత్తరమును దెచ్చి జగన్నాథ అయ్యారున కొసగెను. అయ్యారు ఉత్తరమును ఆతురతతో చింపెను. అందు మన రాము అని ప్రథమమున వ్రాసియుండెను. ప్రక్కనే నిలచియున్న అయ్యారు పెండ్లికొమరిత "నాన్నా ! యీయుత్తరం బెవరాసినది" అని యడిగెను.

జగన్నాథఅయ్యారు దానిని తనలో తాను చదువుకొనుచుండెను. రెండుమూడు మారు లాతనిభార్య పైకి చదువుమని యర్థించెను. కాని అయ్యారుమాత్రి మట్లుచేయడాయెను. అతడాకమ్మను చదువుచు కన్నీరుగార్చుచుండెను. దీని గమనించిన అతనిభార్య యేదియో యుపద్రవమువచ్చి యుండునని యెంచి "ఏమి? అల్లుడు, మంగళకరులాసాగానే వున్నారుకదా ! పలుకరేమి " అని యాతురతతో ననియెను.

పాపము జగన్నాథ అయ్యారు శోకపూరితవదనము నొకమారు పైకెత్తెను. ఆముఖమును గాంచ అతని భార్యకు కారణము తెలియకుండగనే కన్నీళ్ళుద్భవించెను. అతడేదియో చెప్ప నుద్దేశముతో రెండు మూడు మారులు పెదవుల దెరచెను. కాని శోకభార మాతనిని మ్నాటలాడనియ్యలేదు. ఇంతలో జగన్నాథ అయ్యారు కొమరు డచ్చటికి వచ్చెను.

శోకసాగర నిమగ్నులై యున్న తల్లిదండ్రుల గాంచిన యాతని కేమియు దోచదాయెను. కొమరుని రాకనుగాంచి తల్లి వేవేగ భర్తసమక్షమున బడియుండిన యుత్తరమునుదీసి అతని కందించి చదువవలసినదనెను. అత డిట్లు చదువ నారంభించెను:—

మ॥ రా॥ శ్రీ జగన్నాథ అయ్యారుగారు.

అయ్యా !

నన్ను మీ రెరుగరు. నేను మీయల్లుని గృహమునకు యెదురుగ

నున్న యింటియందే నివసించుచున్నాను. ప్రతిదినమును మీకోమరిత ను బెట్టుచుండిన కష్టముల గమనించి పిల్లలు గలవాడనైననేను మీమం గళకష్టము జూచి కడుపు మండిపోవ యీయుత్తరమును మీకు వ్రాసి యున్నాను. నాభార్య మీయల్లుని గృహమునకు తరుచువెళ్ళి ప్రత్యక్ష ముగ అత్తబెట్టుబాధల తిలకించినదై యెంతగనో విచారించుచు నన్ను తమకు తెలియపరుప వలసినదిగ కోరియున్నది. మీయల్లుని డెంతటి విద్యావంతుడై యున్నను అంతమూర్ఖుడును అవివేకియు యింకొక డుం డజాలడని వ్రాయుట కెంతయు చింతిల్లు చున్నాను. ఇట్లు వ్రాసినందు లకు నన్ను మాత్రము మీరు క్షమింపవలయును. దయచేసి మీరు వెం టనేవచ్చి మీ యమ్మాయిని మీయింటికి దీసికొనిపోయిన చాల బాగు గానుండును.

చిత్తగించవలెను.

రామనాథ అయర్.

దీనిని వినిన జగన్నాథ అయ్యరు భార్య బడిన సంతాపమును నిటనుదహరించి పాఠకమహాశయుల మనస్సుల బాధింప మా కిష్టము లేదు.

౫

వెంటనే—ఒక్క క్షణమేనియు ఆలసింపక జగన్నాథ అయ్యరు బయలుదేరి పట్టణముజేరి కొమరిత మంగళాంబను వెంటబెట్టుకొని స్వ స్థానమునకు బయలుదేరెను.

తరువాత రెండవ వివాహమును జేసికొనుటకు శాంతమూర్తి అయ్యరు ప్రయత్నముల నారంభించెను. ప్రథమభార్యకు దేహారోగ్య ము తక్కువయనియు ఆమెకడ నింకను యెన్నియో లోపము లున్నవని యు చాటుచు న్యాయస్థానమునకుకూడ నీవిషయమును తేబ్రయత్నము

లుచేయ నారంభించెను. వీని యక్రిమములు గమనించుచుండిన యిరుగు పొరుగువారు అన్యాయముగ నొకబాలిక జీవిత మధోగతి పాలగుచున్న దని యెరింగి ఒక దినమున శాంతమూర్తి అయ్యరును రప్పించి యిట్టి యన్యాయమునకు బాల్పడిన తనకీర్తికి భంగముగలిగించెదమని బెద రించిరి.

దానిపై ఆరుమాసములు గడచిన తరువాత నాతడు వెంటనే అనగా తన యుత్తరమందిన యిరువదినాలుగు గంటలో తన భార్యను తన కడకంపవలసిన దనియు అటులగాకున్న యీావజ్జీవము తనకడకు రావలసినయగత్యమే యుండదనియు అందుదహరించెను.

ఇట్టి యుత్తరమును గాంచిన యెంతటి పనికిమాలిన వానికైన కోపమువచ్చుట సహజముకదా. ఈనిరిదా పూరిత వాక్యముల గనిన మంగళాంబ సోదరుడు క్రుద్ధుడాయెను. చెల్లెలిని పంపకుండుటయే మంచిదని యాతడు మనమున నిశ్చయించుకొనియెను. కాని మరల యాలోచించి, యిట్టి విరోధపథమునే ద్రొక్కిన దానివలన తన చెల్లెలికెంతటి నిరాశ-యెంతటి దుఃఖము జనించునో యాలోచించి ఆత్మగౌరవము నొకమూలకు ద్రోచివైచి వెంటనే చెల్లెలగు మంగళాంబతో పట్టణమునకు ప్రయాణమాయెను.

౬

కాని చిరుపులి తనమచ్చల మాన్పుకొనగలదా? శాంతమూర్తి అయ్యరును అతనితల్లియు యేవత్కము దినములో యూరకొనియుండి మరల తమ యాధాపథమునే యనుసరింప మొదలిడిరి. పాపము మంగళాంబ భర్తృగృహమున నుండుచాకిరి సంతయు జేయుచుండెడిది, ఐనను ఆకతి నహృదయము లాయెను బాధింపకుండ నొకదిన మేనియు నుండజాలకుండిరి.

అది యర్ధరాత్రిసమయము. లేనిపోని జగడము నొకదానిని వారు బెంచుకొనిరి. తల్లికొమరు లాయుధముల-తల్లి చీపురు గట్టయు, భర్త చే

తిక్కరియు-బుచ్చుకొని తమ్ము-జేహానినై-శోకదేవతవై యున్న మంగళాంబను నెత్తిగ-పాషాణ హృదయులై మోదిరి. పాపము! బాల-నిస్సహాయ యగు నామెమ్మ-బాల-యేమిచేయగలదు! రక్షింపుము! రక్షింపుడని యెంతయో వేడుకొనియెను. కాని కఠినపాషాణములు కనికర వాక్కులకు కరగునా? అదియేటిమాట! తుదకు మంగళనాయర్ధ రాత్రిసమయమున-ఘోరమగు ఆకసము చిల్లులు బడినచందమున వర్షించుచున్న సమయమున-నిర్దయహృదయులు గృహమునుండి బయటికిద్రోసివైచి ద్వారమునుబంధించిరి. ఆహా! నిన్న మొన్న కన్నతల్లిదండ్రుల వీడిన నీ చినతబాల-యీ లోకమందునకు శరణ్యామేది! ఆమె చిరుహస్తములతో ద్వారముపై నెన్నియోమారులు తట్టినది. గద్గద కంఠముతో నెన్నియోమారులుపిలచినది. కాని గృహమందలివారి హృదయములు మాత్రము యించుకేనియు కరుగలేదు.

౨

మంగళ జీవిత మింతవరకును అమంగళముల తోడనే నిండియున్నది. పత్రిక-వీధియందు కొంచము దూరపుబంధువులుండుటను యెరిగి ఆమె ఆనిశయుందట కేగి ఉదయముననే అన్నకొరక తంతినంపెను.

మంగళ పుట్టినిల్లుసేరినది. ఆమెనుగాంచిన గృహమంతయు గొల్లుమనినది. మంగళతల్లియేమనజాలక మూర్ఛనొందెను. దీనినంతటిని గాంచిన జగన్నాథ అయ్యరునకు తాత్కాలికముగ పిచ్చిజనింప బావికడ కేగి మాయమాయెను.

ఇంక పట్టణమున శాంతమూర్తి తన అన్యాయ ప్రవర్తనను కప్పిపుచ్చుటకయి మరుసటిదినమున తన భార్య పారిపోయినదనియు కొన్నినగలు కూడను పోయియుండుననియు పోలీసువారికి తెలియపరచెను. తరువాత జగన్నాథ అయ్యరుమరణమునుగూర్చి యాలించిన యనంతరము యేమి ప్రతిబంధకమువచ్చునో యను భయమున నేమియు చర్య తీసుకొనడాయెను.

అదియొక విషాదచరిత్రము. చదువరులయొక్క యుపయోగార్థ మై శాంతమూర్తి అయ్యరు బి. ఏ. బి. ఎల్. యీమధ్య స్త్రీస్వాతం త్ర్యాది విషయములగూర్చి గావించిన గంభీరోపన్యాసమునుండి కొంత భాగము నీట ప్రకటించుచున్నాము;-

"మన దేశముయొక్క పూర్వ ఆదర్శములకు సరిపోవునట్లుగ భార తస్త్రీలకు స్థానమును మన మెట్లయినను యియ్యవలయును. దురదృష్టవ తియగు ఫ్రాన్సురాణి కేవిధమగు అవమానము కలిగినప్పటికిని వెయ్యి మంది యోధులు పగసాధించుటకు సిద్ధముగ నుండిరని బర్కు వ్రాసియు న్నాడు. అటులనే యిక్కడ సమావేశమై యున్న భారతీయ సోదరులును అవసరమైన యెడల స్త్రీల మర్యాద కాపాడుటకై ప్రాణముల నేనియు నర్పింప సిద్ధముగ నుందురని నేను తలంతును. భారతీయు లోకజాతివార లే యని తెలుపునట్టి స్త్రీల గౌరవమును, నీతి నియమములు భారతీయుల సొమ్మని అన్యదేశీయులు చెప్పుకొనుటకు తగ్గ పరిస్థితుల గల్పించిన స్త్రీ ప్రపంచముయొక్క గౌరవమును-అనాదినుండియు వచ్చుచున్న గౌరవ మును మన ప్రస్తుత నవీన నాగరికతనుండి తప్పించి కాపాడవలసిన బా ధ్యత మనమీద నున్నది. మననాగరికత, నక్షత్రమండలము కన్నను చా లపురాతన మైనది. దీనిని మనము నేడు పోగొట్టుటయన అంతకన్న చే తగానితన మింకొకటి యుండబోదు. మన స్త్రీలకు యిదివరలో యెంత టి గౌరవము, స్వాతంత్ర్యత మున్నగునవి యుండెడివి! అవి నేడెచ్చటను కానరావు. మహాజనులారా ! స్త్రీలను యింతటి స్థితికి దీసికొనివచ్చినది మనమే. ఇందుల కెంతమాత్రమును సందియము లేదు. స్త్రీలను మనము గుమ్మములనేనియు దాట నిచ్చుటలేదు. వారల కిసుమంతయేనియు స్వతంత్రత నొసగుట లేదు. అన్నిటి యందును మనమే జోక్యము కలుగ జేసికొనుచున్నాము. వారల అడ కత్తెరయందుంచి నొక్కు చున్నాము. ఇట్లనుటవలన మీరెంతయో సంకటపడవచ్చును కాని నన్ను మాత్రము క్షమింపుడు ! స్త్రీలను బాధించుచున్న యెందరినో ప్రత్యక్ష

ముగ జూచిన మీదనే యిట్లు చెప్పుచున్నాను ఇది యంతయును యథార్థము. మన స్త్రీలు-కులదేవతలుగ జూడబడుచుండవలసిన స్త్రీల-నిక యెంతకాలము యిట్లు యిక్కట్ల బాలుచేసి మన యింటనుండు మూగ వస్తువులవలె చూచు చుండుట ! సోదరులారా ! ఇది యింక కూడదు.”

ఆహా! అయ్యరుయొక్క నీతిమార్గము!



# రాలిన నీలి పూలు.

నామిత్రుడీప్రపంచమును వీడి నాలుగు మాసములైనను యింకను ప్రజలు నిజమునెరుగక యనేక విధములగు కథల జెప్పుకొనుచున్నారు. పత్రికలయందు పెద్దలందరును వింతవింతలగు యూహాలనూహించి వ్రాయుచున్నారు. వీట్నెన్నింటిని దినదినమును చూపుచున్న నా కిటులూరకుండుట మేలుగాదని, నేటికి నిజమును మీ యందరియెదుటను బెట్ట బూనుకొంటిని. ఇందువలన మనలవీడిన నామిత్రుడు శ్యామలరావుయొక్కయు, నాతనికి బలాత్కారముగ గట్టబడిన లలిత యొక్కయు ఆత్మలకు శాంతిగలుగునను నమ్మకముతోడనే నిజమునెరిగిన నేనీ క్రింది విషయమును మీకెరింగించుచున్నాను.

ప్రథమమున నాతని దినచర్య పుస్తకమందు శ్యామలుడు వ్రాసికొనిన కొన్నింటిని ముందుగ నిట నుదహరింతును; వాటివలననే, నిజము మీకు తెలియగలదు.

3-8-1923 మన మొకటి తలచిన దైవ మొకటి తలచును. నేననుకొనినవాటికన్నింటిని విరుద్ధముగ సంచరించవలయునే మోయని తోచుచున్నది.

21-8-23 లలితను తప్పక పెండ్లియాడవలయు ననుచున్నాను. మె

నరికమును విడువరాదట. చిన్ననాటనే నగనుంచి మాయమ్మ మాటయి చ్చినదట. ఆవల మరణించిన తల్లిమాటను త్రోసివేయరాదని నాయన గారు చాల పట్టుదలతోనున్నారు.

4-9-23 ఇప్పటికే యపవాదు లెక్కువ యగుచున్నవట; నా పెండ్లి యింక మూడునెలలలో నగునట్లు తోచుచున్నది. తండ్రిమాట కెదు రాడలేను. కమలను ప్రేమించిన మీఁద, నేను లలితను ప్రేమింపజాలను ఆమెకు నాపై ప్రేమయున్నదనియు లేనిదియు నేనె యెరుగుదును. ఇంత కు నొకయువతి జీవితమును శిథిలము గావింప నున్నాను. ఈపాపమునకు నే నొడిగట్టుకొనవలసియున్నది. నేను మహాపాతకుడను.

15-9-23 ఒకరి జీవితమును దుఃఖ పూరితము జేసి నా జీవితము నిష్ప్రయోజనముగ నొనరింప నిశ్చయించుకొంటిని; ఏదియెట్లున్నను నేను మాత్రము తండ్రిమాట జవదాటలేను లేను. విధి యెట్లున్న నట్లు జరుగక మానదు.

ప్రస్తుతమున కింతటితో నాపుదును. తరువాత యవసరమున్న చో యింకను కొన్నింటి నుదహరింతును. శ్యామలరావు మేనమామ సుందరరావుగారు చాల మర్యాదగల సంపన్నులు. మేనయల్లుడన వారి కెంతయో ప్రేమ, సుందరరావుగారి యేకపుత్రికయగు లలితయు చక్క దనముల కుప్పయని చెప్పక తప్పదు. ఇదివర కెందరో పెద్దలువచ్చి తమ పుత్రులకు లలిత నియ్యవలసినదని కోరియుండిరి. కాని సుందరరావుగా రు మేనరికము నాసించి యెవ్వరికిగాని మాట యిచ్చియుండలేదు.

"నీకు లలితను పెండ్లియాడుట కిష్టములేదని మీనాయనగారికి నెరిగింతు'నని యెన్నిమారులనినను శ్యామలుడు 'వలదు, నేనిదివరకే యెన్నియోవిధముల ప్రయత్నించితిని, వారు చాల పట్టుదలతో నున్నా రు' అని యాటంకపరచెను. చేయునది లేక నేనును యూరకొంటిని.

లలితా శ్యామలుల వివాహ మతివైభవముగ జరుపబడెను. 'సం గీతసభలు, పెద్దపెద్దవిందులు ఊరేగింపులు జరిగినవి, ఐదు దినములును

కన్నుల పండువుగనున్నది. బంధువులు మిత్రులు చాలయానందించిరి. కాని శ్యాములుని మోమునవొక్క చిరునగవునైనను గాంచనైతిని. అతని దుస్థితినిగన్న నాహృదయము పగిలినట్లయ్యెను. హా!యిష్టములేని పెండ్లివలన నెంతటికష్టము!

పెండ్లియై పదునైదు దినములైనది. ఇరువుర మొంటరిగ హాలులో కూర్చుంటిమి. మునుపటివలె రాజకీయ విషయములను చర్చించుటగాని యొకరితో నొకరు మంచిచెడ్డలూహించుకొనుచు వ్యాసముల వ్రాయు టగాని లేదు. ఒకరి నొకరు పలుకరించుకొనకుండ కాలము గడపుచుంటి మి. కొంతవరకట్లు లేయుండిఆత డొక్కమారుకనుల మూసికొనియెను. నాహృదయము బ్రద్దలైనట్లాయెను. కాని నేనుపలుకరింపలేదు. తరువాత ఆతని కనుకొలకులనుండు అశ్రువులు స్రవాలనారంభించినవి.

నేనింకచూచుచు నూరకుండలేక పోయితిని. లేచిశ్యాములునికడ కేగి రెండు హస్తములును బట్టుకొని 'నీదుఃఖముల నాకడదాచెదవా, అనిబ్రతిమాల నారంభించితిని. ఆతని దుఃఖముల మరింతయెక్కువా యెను.అతడొక బాలునిరీతి హీన స్వరమున నేడువ దొడగెను.

ఇంతలో తపాలావా డొకయుత్తరమునుదెచ్చి నాకొసగెను. దా నిపై శ్యాముల రావుయొక్క విలాసమున్నది. శ్యామలరావున కా యుత్త రమునువిప్పియందించితిని. అతడాయుత్తరమును జదివెను. రెండుపర్యాయ ములు దానిని చదివి భీతావహుడైనావైపు జూచుచు "కమలకు జబ్బు జేసినదా? కమలకు జబ్బుజేసినదా?" రెట్టించి యడిగెను.

ఆయుత్తరమాతని హస్తమునుండి దీసికొంటిని. ఉత్తర మేయూ రినుండి వచ్చినదియు నేనిట నుదహరించను. గాని అందు వ్రాయబడిన లెక్కగానున్న మూడువాక్యములను మీమెదుట బెట్టెదను. ఈ కమల యెవ్వరో తెలిసికొనగోరి మాత్రము దయయుంచి ప్రశ్నింపకుడు. ఇట్లు యూరుపేరును దాచినందులకు మాత్రము నన్ను క్షమింపుడు ఏలనన నామిత్రుని వాక్యముల నేను జవదాటలేను.

గ్రామము——          తేది——

శ్యామలరావుగారి పదములకు నమస్కారములు. చిన్నదాననైనను మీ యిరువురకును శుభములొనగూడుగాతయని హృదయపూర్వకముగ కోరుచున్నాను. రెండు మూడుదినములకన్న యెక్కుడు కాలము జీవింప ను. ఒకసారి చూడవలయునని యున్నది కనుక నాయందు దయయుంచి యొక్కపరాదు రాగోరెదను.

ఇట్లు అభాగ్యురాలగు మీకమల.

ఈయుత్తరమును గాంచిన ఒక్క నిముషములో నాకంతయును బోధపడినది. కమల శ్యామలరావును మనసార వరించినది. శ్యామలు డు కూడ నామెను ప్రేమించెను. అట్టి యామె శ్యామలు డింకొకయున తిని పెండ్లియాడెనను విషయమును విని బెంగగొని మంచము పట్టినది. కమలా శ్యామలుల కొకరియెడ నొకరి కెంతటి ప్రేమయుండెడిదో చ దువరుల కెరింగించుట కిటనొక చిన్న యంశమును చేర్కొనెదను. ఒక యుత్తరమును శ్యామలునకు వ్రాయుచు నొక నాటి రేయి తనకువచ్చిన కలను కమల యీవిధముగ వ్రాయుచున్నది.

"మీరు మాయింటి యెదుటనేయున్న మేడమీద గదియం దు నివసించుచున్నారట. అది రాత్రిసమయము. మీరు పరుండి యుంటి రేగాని యేదియో ఆలోచించుచుంటిరట. మీపక్క నెవ్వరోభోజనము చేసినట్లు, అరటియాకులును పాత్రలును కలవు; సుదర్శనుడుగారు మీగ ది కెదురుగనున్న మాండాబాయందు కూర్చుండుట వలన నేను వెంటనే రాలేకపోతిని. ఆయన వెళ్ళినమీద మీయెదుట రెండుమూడు మారు లు తిరిగితిని. మీరుమాట లాడలేదు. నేను మీమనస్సును కనుగొని మీ కడకు వచ్చితిని. తరువాత యేదియో యాపదయున్నదనివిని యిరువుర మును యొకరినొకరువిడువరాదని యనుకొని యెక్కడకో బయలుదేరితి మట-ఇదినాకల. మన జీవితమునయిట్టిది జరుగునేమోయని తోచుచున్న

డి. ఏమయినను యిరువుర మొకచో నున్న మనకు సంభవించు కష్టము లన్నియు కష్టములుగనుండునా?"-ఇందు యెంతటి ప్రేమయున్నదియో ప్రేమయన నెట్టిదో యెరింగిన వారికి విశదము కాగలదు. శ్యామలరా వాగలేదు. గోడపై నున్న గడియారవమాతము చూచెను. లేచి నన్ను ర మ్మని పిలచెను. దుస్తులనేనియు మార్చుకుండ యిల్లువిడచితివిం.

మేమును రైలుస్టేషనునకు బోవుసరికి రైలు యీలవేసెను. టి క్కట్టుకొనుటకేనియు వ్యవధిలేకపోయెను. ఇరువురము బండిలో బడితిమి.

పదకొండు గంటల రైలు ప్రయాణమును పదకొండు యుగముల వలె మాకు దోచినది. ఈప్రయాణ కాలమంతయును ఒకరితోనొకరము మాటలాడుకొనలేదు.

మేము మాగమ్యస్థానము చేరుసరి కుదయము యెనిమిది గంట లయినది. అది యేలనోగాని నాహృదయమందు కలవరము జనించినది. అట్టి సమయముననామిత్రుడు శ్యామలరావుయొక్క మన స్సెంతటి కల తనొంది యుండునో నేను వ్రాయజాలను. ఆవిషయమై తలంచుకొనిన నాహృదయ మేలనో జలదరిల్లుచున్నది. మూడుఫర్లాంగుల మేరమేము నడచిపోయితిమి. ఎదురుగ కొంతమంది శిరముల వంచి కిక్కురుమనకుం డ వచ్చుచుండిరి. నాతల తిరిగినట్లైనది.

శ్యామలరావు కదలక మెదలక ప్రతిమవలె నిలచెను. ఆతడు రె ప్ప వేయుటలేదు. శరీరమంతయు ముచ్చెమటలు గ్రమ్మినైచెను.

సహజముగ నేనధైర్యుడను. ఆసమయమున లేనిధైర్యమును తె చ్చుకొనవలసి వచ్చెను. శ్యాములుని నీడకేగి యాతనిని ధైర్యముగ నుం డవలసినదని యెన్నియో విధముల బోధించితిని. కాని శ్యామలుడుమా త్ర మొక యడుగైన వేయలేదు. అచ్చటనే నిలచెను.

ఆ నిశ్శబ్ద ప్రజాసమూహము మమ్ము సమీపించినది. అది కల యాయని సందేహము కిలిగినది. శ్యామలుడు "అదిగో- నాకమల! ఆ- ఆ! ఏమిది!" అని నాకరమును గట్టిగా బట్టుకొని నేలవ్రాలెను.

నేను. కనులు దెరచి చూచితిని. ఆనిశ్శబ్దజనమధ్యమున నున్నది. కమల యొక్క మృత కళేబరము.

మరల యూరునకు తిరిగివచ్చి వారము దినములైనది. ఒకనాటి సాయంకాలమున పేరుగాని నిలయముగాని లేని యుత్తరమొకటి వచ్చి చేరినది. అందు «మీరు రాత్రి తొమ్మిదిగంటలకు ఊరిబయట తోట లోని కొక్కరే రాగోరెదను. నేనేమియు నపాయమును చేయ తలపెట్ట లేదు» అనియున్నది.

ఒంటరిగ వెళ్ళవద్దని నేనెంతగనో చెప్పితిని. కాని శ్యామలుడు విన లేదు. నేనుకూడవచ్చి యెక్కడనేనియు రహస్యముగ పొంచియుం దునంటిని. అట్టిదికూడదని యాతడు గద్దించెను.

సరిగ తొమ్మిది కొక యరగంట యున్నదనగ శ్యామలు డిలువె డలెను.

పదకొండు గంటలవరకును నే నాతనిరాకకై యెదురు చూచితిని ఆతడు, రాలేదు. నాకేలనో యనుమానము గలిగెను. కరదీపిక నొక దానిని దీసికొని తోటలోని కేగితిని; తోటనంతటిని కలయ వెదకితిని; తుదకు శ్యామలుడొక చెట్టుక్రింద పడియుండెను; అతని శిరమునందొక పెద్దగాయమున్నది.

ఒక గంటసేపటికి శ్యామలరావు కనులుదెరచెను. మొదట నన్నా తడు గాంచి «ఆయుత్తర మిటులిమ్ము!» అనెను. చుట్టు ప్రక్కలంతట నేను వెదకితిని. ఆశ్యామలుని ప్రక్క నొక యుత్తరము పడియుండెను. దాని నాతని కందించి తిరిగి, బయలుదేరి యిల్లుజేరితిమి.

లలిత మాత్రము శ్యామలు నెంతగనో ప్రేమించినది. కాని అట్టి ప్రేమయే శ్యామలుని హృదయమున గలుగలేదు. భర్తకు గాయములు తగిలిన నాటినుండియు లలిత శ్యామలుని విడువలేదు.

ఇట్లు వారము దినములు గడచినవి. ఒకనాటిరేయి కలము కాగి తముల నందియ్యమని శ్యామలుడు నన్నడిగెను. ఇష్టములేకున్నను ఆతనికి వాటినందించి నేను నాగృహమున కేగితిని.

తెల్లగ తెల్లవారలేదు. రాత్రి యేలనో చెడ్డకలలు వచ్చినవి అం దువలన వేవేగ శ్యామలుని గృహమున కేగితిని. శ్యామలుని గదియందలి దీపములేదు; గదితలుపు దగ్గరవేయబడి యుండెను. నేను లోని దీపము ను వెలిగించితిని. శ్యామలుడు నిదురించు చున్నటు లుండెను. కాని నా కనుమానము గలిగెను. ఆతని గుండెపై చేయివైచితిని. ఇం కేమున్నది! శ్యామలు డీలోకమును వీడెనని తెలిసికొంటిని.

పరుగుపరుగున లలితగది కేగితిని, ద్వారము తెరచి లోనజొచ్చి తిని, లలిత గదియందు కానరాలేదు. బల్లపై మాత్రము రెండుత్తరము లున్నవి. నాహృదయమం దేలనో కలవర మెక్కుడగు చుండెను. ఒక దానితరువాత నొకటిగ వాటిని చదివితిని. "లలితా!

నీవునన్ను ప్రేమించితివి. నీజీవితమును సుఖవంత మొనరింప నేను జనింపలేదని తోచుచున్నది. నేనొకయువతిని ప్రేమించితిని. ఆమెనా కొరకే మరణించినది. నీయెరుకలేకుండగ నిన్ను ప్రేమించి మీనాయన గారినెన్నియోమారు లడిగి తుదకు విఫలుడై కసిదీర్చుకొనుటకై నన్ను నాటిరాత్రి అతడుకొట్టెను ఇదినాకు సరియగుశాస్తి; ఇంక జీవింపలేను.

ఇట్లు

శ్యా మ ల రా వు"

"నే నీ ప్రపంచమున ప్రేమించవలసిన దేమియును లేదు. నా కీ ప్రాణములపై యిష్టములేదు. దుఃఖపూరిత జీవనమును గడుపలేను. నా కళేబరమును మాత్ర మవసరముగ వైద్యుసిచే పరీక్ష చేయింపవద్దు.

ఇట్లు,

ల లి త.

లలిత ప్రాణముల పోగొట్టుకొన నిశ్చయించినది! ఆమెయెక్కడి కేగినది! నా కేమియు తోచలేదు. గవాక్షముగుండా చూచితిని. ఆ! నాయొడలు జలదరిల్లినది. "లలితా? లలితా!" యని కేకలు వైచితిని. కానిలాభ మెమి, ఆమె ప్రవాహమునబడి మాయమైనది,

ఇంకనాటిరేయి శ్యామలరావును కొట్టినదెవ్వరోయ నిచాత్రిము చెప్పవీలులేదు. ఆయనను నేనెరుగుదును. కానినామిత్రుడు నాకు విడచిన యుత్తరమందలి విషయములజవదాటను. కానక్షమింపుడు,

శ్యామలరావుయొక్క నిజవృత్తాంతమిది. నాసోదరులందరు దీనిని నిజమని నమ్మిహృదయజనితమగు అన్యోన్యానురాగమునకు యీమహావిశ్వములో సరిపడుతావులేదని యెరింగి, ప్రేమకై ప్రాణమువీడిన కమల, లలిత, శ్యామలరావు, వీరియొక్క యాత్మలకు శాంతిగలుగుగాకయని ప్రార్థింతురని నమ్ముచున్నాను.

# మే న రి కం.



౧

“వదినే! మాకాంతాన్ని మీఅబ్బాయికిచ్చి పెళ్లిజేస్తాను, పుచ్చుకుంటారా ?”

„సంతోషం ; అలాగే కానియ్యండి వదినా”

పై సంభాషణ మాఅమ్మకు, కాంతం తల్లికి ఒకనాటి సాయంకాలంజరిగింది.

... ... ... ...

తరవాత మానాన్నగారికి యింకొక వూరు బదిలీ అవడము, మళ్లీ ఆరు యేళ్లు యితర గ్రామాల్లో వుద్యోగంచెయ్యడము ఆతరువాత ఆగ్రామానికే తిరిగిరావడము, యివన్నీ జరిగేయి.

... ... ... ...

మాతమ్ముళ్లంతా పట్నంలో చదువుకుంటూవుండడమువల్ల మా

నాయనగారు వొక్కరే యీనపూ ఆవూరు వెళ్లేరు. విద్యుచ్ఛక్తి పరీక్ష నభ్యసిస్తానని బయల్దేరి కలకత్తా మొదలుకొని గయవరకూ ప్రయాణం చేసి యింటు విన్న విచారకరమైన విషయం తటస్థించడమువల్ల తిరిగివచ్చిన నేను మహానగరానికీ పల్లెటూరుకు మధ్యనున్న వూరిలో ఉండడానికి యిష్టపడలేదు. ఆరోజుల్లో అందుకోసం పల్లెటూరులోవుంటేనే హాయి వుంటుందని మానాన్నగారు పనిచేస్తూవున్న గ్రామానికి నాపుస్తకాల సరంజామాతో బయల్దేరేను.

౨

ఆ ఊళ్ళో నలుగురు వుద్యోగులకే యెక్కువ గౌరవముంది. ఆలా గౌరవింపబడే నలుగురిలో మానాయనగారు వొక్కరు. ఆయన కుమారుణ్ణవడంచేత నాకుకూడా కొద్దో గొప్పో మర్యాద జరుగుతూవుండేది. సుఖంగా యింత తింటూ పగలస్తమానూ పత్రికలు పుస్తకాలు చదువుకుంటూ బాలవితంతు వివాహాలామీద వ్యాసాలు, కతలు వ్రాస్తూ అల్లుతూ- కాలంగడపి సాయంత్రం పడగానే, సైకిలెక్కియే కొండ ప్రాంతాలకో లేక యే రిజర్వు అడవి తోటలదగ్గరకో బయలుదేరి వెళ్ళి తిరిగి వస్తూవుండే వాణ్ణి, ఒకవూరినుంచి యింకొకవూరుకు వెళ్లడమంటే. ఆసగల నేను దినాని కనీసం నలభై మైళ్ళన్నా ప్రయాణం చేసేవాణ్ణి. ఇంతటితో నాశక్తి సామర్థ్యాలిని వ్రాసుకోనడం కట్టిపెట్టి తిన్నగా జరిగినవిషయాన్ని క్లుప్తముగా మీయెదట పెట్టడానికి ప్రయత్నిస్తాను.

ఆవూళ్లో మాధవయ్యగారు అనే ఆయన వున్నారు. ఆయనకు ఒక్క కొడుకు, కూతురు. కొడుక్కు చిన్నప్పుడే. అనగా- పద్నాల్గవ యేటనే. పెళ్లిచేశారు. ఇంక యెటుచూచినా కుమార్తె సూర్యకాంతానికి పెండ్లి చేయవలసివుంది.

అసలుపేరు సూర్యకాంతం ఆపేరు వాడుకలోను సూరేకాంతం అయింది. సూరేకాంతం చనవువల్ల కాంతంగా మారింది, అందువల్ల యికముందు నేనుకూడా కాంతం అనే యీకథలో వాడుతాను.

## 3

పట్నంవాళ్లకు మామూలుగా ఉదయమే బయటకు పోయి స్నానం మొదలైన కృత్యాలు నిర్వర్తించే అలవాటు వుండదు. కాని చిన్నప్పటినుంచీ చెట్లెక్కడానికి, గుట్టలకెగబ్రాకడానికి అలవాటుపడ్డ నేను ఉదయమే మోకాలు లోతువున్న యేరుదాటి పక్కకొండలకు వెళ్ళి అడవి పువ్వులు, రంగు రంగుల కాయలు, అందమైన మొక్కలు మొదలైనవాటిని తీసికొని రావడము మాత్రము మానేవాణ్ణి కాను. ప్రకృతి చిత్రాలను యెంతో పొగడుతూవుండే అలవాటుగల మానాన్నగారు నేను కొండలమీదనుంచి తెచ్చి దొడ్డిలో నాటి పెంచే మొక్కలు చూచి యెంతో ఆనందించేవారు. ఆరోజున కొండపగులులో పెరిగిన ఒక అడుగుయెత్తు మొక్కను త్రవ్వడాని కారంభించేను. ఒక పక్క సూర్యుడు తీవ్రంగా బయల్దేరేడు. ఆకొండ బీటునుంచి ఆ మొక్కను త్రవ్వడానికి అప్పుడు నే పడ్డకష్టము యింతంత అని చెప్పడానికి వీలులేదు. దేహం అంత చెమటతో నిండిపోయింది. నాకష్టానికి ఫలమేమి? ఆఖరుకు ప్రాణాలతో ఆ మొక్కను యింటికి తీసికొని వెళ్ళలేక పోయాను. ఇంక ఆలస్యం అయిందని వేగంగా యింటిదారి బట్టేను.

అప్పటికే యెనిమిది గంటలై అరగంట ఐవుంటుంది. ఐనా నేను మాత్రం చురుగ్గా అడుగు వెయ్యలేకున్నాను. ఇందుకు శరీరం అలసి వుండడమే కారణం. ఏటి వద్దకు వచ్చి, దాన్ని దాటడానికి ముందు చమట బట్టివున్న చేతులు కాళ్ళు కడుకున్నాను. నాడేమోగాని నా హృదయంలో యేమీ చురుకుదనం లేదు. నెమ్మదిగా నీటిలో కాళ్ళు నీడ్చుకుంటూ యేటిలో నడుస్తూ వున్నాను.

ఏటిమధ్యకు వచ్చేను. ఎదుట రేవువైపుకు నాదృష్టి చలించకుండా ఆలాగే వుండిపోయింది. ఇంతవరకు మొద్దుబారివున్న నా హృదయములో కూడా కొంచెం చురుకుదనం ప్రవేశించింది.

ఆ రేవులోనుండి రెండు కాటుకకళ్ళు నన్ను రెప్పవెయ్యకుండా చూస్తూవున్నాయి. అంతవరకు నడుస్తూవున్న నా కాళ్లు ఆలాగే ఆగిపోయాయి. ఎదుట నన్ను చూస్తూవున్న ఆ బాలిక చిరునవ్వు నవ్వుతూ తలవంచింది.

ముందుకు అడుగులు వేస్తూ వొడ్డుకు వచ్చాను. చక్కని చుక్కవంటి ఆ బాలిక, బిందె నీళ్ళతో నింపుకొని భుజమ్మీదుంచుకొని మళ్లీ ఒక్కమారు క్రిందిచూపు చూచి తిరిగి యింటిముఖమైంది. నేను ఆ కాల అడుగులో అడుగు వేస్తూ నడువకుండా వుండలేకపోయాను. ఆ బాలికకు పదకొండు పన్నెండు యేళ్ళు వుంటూయనుకుంటూ యిల్లు జేరెను.

* * * * *

౮

మర్నాడు సాయంకాలం నెమ్మదిగా సైకిలుమీద షికారు వెళ్తూవున్నాను. ఆసమయాన్ని దారిలో తనయింటిఅరుగుమీద కూచున్న మాధవయ్యగారు నన్ను పిలిచేరు. నాకు అక్కడ ఆగాలని వుద్దేశంలేకపోయినా పెద్దలు పిలిచినప్పుడు త్రోసుకొని వెళ్లడము అంతమర్యాద గాదనుకొని సైకిలు దిగి ఆయనతో లోపలికివెళ్ళెను.

మాధవయ్యగారు మహావినయంగా మాటలాడడాని కారంభించేరు. మధ్యమధ్య నవ్వుతూ మా నాన్నగారి విషయమై ప్రస్తావన తెస్తూ “అబ్బో బావగారు సామాన్యులా!” అని అంటూవుండేవారు. ఇంతలో ఆయన కొడుకు నవ్వుతూ నావద్దకు వచ్చాడు. ఇప్పుడీయన భార్యతో కాపురంచేస్తూవున్నాడు. వచ్చినాయన కొంచముసేపైన తరువాత కలకత్తాలోని చిత్రాలు చెప్పవలసినదని అడిగాడు. నేను యేదో ముక్తసరిగా చెప్పడానికి ఆరంభం చేశాను.

నే నాయనతో మాటలాడుతూ ఒక్కమారు గోడమీద వ్రేలాడుతూవున్న పటంవైపు దృష్టినిపోనిచ్చేను. ఆలా చూస్తూవుండగా

వొక అమ్మాయి తలవంచుకొని వచ్చి పళ్లెంతో పలహారం తెచ్చి నాయెట వుంచింది. ఆసమయాన్ని నే నామెను చూడకుండాలుండ లేకపోయాను. పళ్ళెంకిరింద ఓరానితిరిగి వెళ్ళుతూవున్న ఆపిల్లముఖం కేశి దృష్టిపోనిచ్చేను. నాసంతోషం యింతంతని వా్రియలేను. అంతకుముందు యేటివొడ్డున చూచిన బాలికే నేను నాయెదుట పలహారం తెచ్చిపెట్టిన మాధవయ్యగారి కూతురని అప్పుడు తెలిసికొన్నాను.

పలహారం చేస్తూవుంటే మాధవయ్యగారిభార్య—కాంతంతల్లి-పరిక్కగావున్న తలుపు వెనకాతల నిలిచి "నాయనా! మీకప్పుడు చిన్న తనం; జ్ఞాపకముండకపోవచ్చు; మీ అమ్మగారు యిక్కడ యిదివరలో వున్నారు. శెలవుల్లో మీరు యీ వూరు వచ్చారు. అప్పుడు మాఅమ్మాయిని మీకిచ్చి వివాహం చేస్తానన్నాను. ఆలాగే అని వదిన అన్నారు." ఆలాగే అని అంది, నేనేమీ ప్రత్యుత్తరం యియ్యలేదు. నాటిదినం అంతటితో సంభాషణ ఆఖరుచేసికొని నాతో్రోవను నేను వెళ్ళేను.

నాడు మొదలుకొని మాధవయ్యగారు, ఆయన కొమారుడు సదాశివము, కాంతాన్ని పెండ్లిచేసుకోవలసినదిగ యెన్నో విధాల చెప్పడము మొదలుబెట్టేరు. నాతో షికారుకు వచ్చిన సమయాల సదాశివం "ఏమండీ బావగారూ? మిమ్మల్ని మాచెల్లెలు పెళ్ళిచేసుకుంటానంటుంది." అనేవాడు. ఇంక మాధవయ్యగారు యింట్లోకి తీసుకువెళ్ళి "చూడండి! మీకు మా అమ్మాయి నిద్దామని మా ఆడవాళ్ళకూ మా అబ్బాయికీ యెంతో యిష్టంగావుంది. మీరు వివాహంచేసుకుంటే చాలా సంతోషం. కట్నం అంటారా యిల్లు గుల్లజేసుకునైనా యిస్తాను" అని అనేవారు.

నేను యేవిధమైన జవాబు యిచ్చేవాడినిగాను. ఆపూళ్లో కొంతమంది హాహాలంకార్లుండేవారు. దారిని సైకిలుమీద పోతూవుంటే కొంతమంది పెద్దలు నన్ను పిలిచి "మాధవయ్యగారి కూతుర్ని చేసుకోండి;

రత్నంవంటిపిల్లనలదమయంతులల్లాగువుంటారు యిద్దరువొకదగ్గరవుంటే” అనేవారు. ఏమీా తోచక నాదేమి లేదండి, మానాయనగారు యిష్టప్డాలి అని సమాధానం చెప్పేవాణ్ణి.

౫

ఇలావుండగా మాధవయ్యగారి వితంతు అక్క విశాఖపట్నంనుండి వచ్చింది. ఆమెతో కూడా ఆమె కొడుకువచ్చేడు. పేరు కృష్ణారావు; ఇరవై యెనిమిది యేళ్ళ వయస్సుంటుంది. పొడగిరి. చామన చాయను మించివుంటుంది దేహంయొక్క రంగు.

తల్లి, కొడుకు యింకొక చుట్టాలింట్లో బసచేశారు. ఉదయం కావడముకు తరవాయిగా బయల్దేరి ఆ గ్రామంలోవున్న పెద్ద తలకాయల వద్దకు వెళ్ళి మాధవయ్యగారు తన మేనమామ అవడమువల్ల ఆపిల్లను పెళ్ళి జేసుకోనడానికి తనకే అధికారం వుంది కాని యింకెవ్వరికి హక్కు లేదనీ, తన్ను మోసగించడానికి నేను ఆ వూరుకు వచ్చాననీ కృష్ణారావు చెప్పడము మొదలుబెట్టేడు.

మా నాన్నగారు పక్కగ్రామం పనిమీాద వెళ్లేరు ఇంట నేను వొక్కడనే వున్నాను. కృష్ణారావు తల్లి నాదగ్గరకువచ్చి తాను కాంతం పుట్టగానే రెండుకాసుల బంగారపు గొలుసు కాంతం మెడలో వేసి ఆమె తన కోడలని ఉద్యోగము చెయ్యకుండా వుండడమే కారణమని కూడా ఆయన్మ అంది.

తరువాత సాయంకాలము కాంతంఅన్న సదాశివం నాదగ్గరకు వచ్చాడు. అతగానితో కృష్ణారావుతల్లికీ నాకు జరిగిన సంభాషణ అంతా చెప్పేను. అతగాడి కేమీా తెలియదని నన్ను వాళ్ల నాన్నగారు తీసుకు రమ్మన్నట్లుగా చెప్పి తన యింటికి తీసికొనివెళ్ళి తన మేనయత్త మాటల నన్నింటిని అక్కడ యేకరువుబెట్టేడు.

మాధవయ్యగారి కెక్కడలేని కోపము వచ్చింది. ఎర్రని ముఖం

కందిపోయింది. ఉగ్ర నరసింహావతారం దాల్చి «అయ్యా! ఇదంతా అబద్ధం. చూచారా. ఆడాళ్లు యెంతటి తెగింపన్నా చేయగలరు. కృష్ణారావు పుట్టినప్పుడు నేను నాలుగు కాసుల మురుగులు ఆపిల్లాడికి పెట్టేను. అలాగే నాకూతురుకు ఆమెకూడా పెట్టింది. ఇది, యిచ్చి పుచ్చుకోవడమైంది గాని ప్రధానం యెలాఔతుంది? ఈ రెండుకాసులు పెట్టి కొడుక్కు ప్రధానంచేశాననదీ? ఏమి మాటలు!» అని కేకలేశారు.

మధ్య్య నేనొక పెద్దమనిషి నయాను. కృష్ణారావు తల్లి అర్ధమ్ము వారానికి రెండుమార్లయినా వచ్చేది.. ఒకనాడు మాధవయ్యగారిమాట లీయమ్మతో చెప్పేను. అప్పుడామె నోటిమీద చెయ్యివేసుకొని “అవ్వా! తోడబుట్టిన ఆడదాని కొడుక్కు ఆయన తృణమో ఫణమో జేర్చవలసుందిగాని, తోడబుట్టిన ఆడది, అన్న కొమార్తెకుగాని తమ్మునికుమార్తెకుగాని నగ చెల్లెలు పెట్టడ మెక్కడైనా వుందా! ఇది యెక్కడి న్యాయమమ్మా? ఆపిల్లకు ప్రధానంగగానేనేను అప్పుడు పెట్టింది” అంది.

౬

ఆ దినాల్లో «కబుర్లపోగు» అనే వారపత్రికను నేను ప్రకటిస్తూ వుండేవాణ్ణి. అసహాయోద్యమము దేశము నల్లలాడిస్తూ వున్నది నాలవి. ఉద్యోగంలోవున్న మానాయన గారు నా యీ పత్రిక వ్రాతలవల్ల తమ ఉద్యోగానికే మోసము రావచ్చునని అంటూవుండేవారు. కాని నాకుమాత్రం పత్రికను ఆపువలచేసే వుద్దేశము వుండేదికాదు. పట్టుబట్టి యేలాగైన సాగిస్తామని అనుకున్నాను. ఆదినాల్లో నడకబట్టి గీతమాలికలువ్రాస్తూవుండేవాణ్ని, చదువడానికి యింపుగావుంటేనేచాలునని అనుకునేవాణ్ణి. ఆసమయంలో «ప్రేమపరివాహము» అను పేరుతో వొకగీతమాలిక వ్రాస్తూ

« సూర్య కాంతరో! నీదు విశుద్ధప్రేమ
వల్లికల దుంచి పర్విడ నొల్ల నేను”

అని పంక్తులతో ముగించాను.

మా వూళ్లో సురేకాంతం అనే వేశ్యవుంది. ఆమె «కబుర్లపోగు» యెప్పుడూ చదువుతూ వుండేది. ఈపద్యం చదివిన ఆమె దాన్ని తన "పతికి" చూపించింది. అతగాడు నాకు పరిచయస్తుడే. పత్రిక వెలువడ్డ మూడవనాడే యీయన నాదగ్గరకువచ్చి «అయ్యా! మూలనున్నదాన్ని యెందుకు ముందుకు తీసుకువస్తారండి, సూరేకాంతం యికముందు ఆమెమీద వ్రాయవద్దని కోరుతూవున్నాను" అన్నాడు. నాకు నవ్వొచ్చింది. నేను యేవుద్దేశంతోగాని వ్రాసి వుండలేదు. ఐనప్పటికీ అతణ్ణి సంతోషపరచాలనే వుద్దేశంతో అలాగేఅన్నాను.

౭

ఆసమయానికి మానాయనగారు కాతంపూరుకు యిరవైమైళ్లో దూరంలో వున్న ఒక మన్యపు గ్రామములో వున్నారని వుత్తరము రావడమువల్ల కాకినాడకు వెళ్లిన నేను తిన్నగా అవూరే వెళ్లేను.

వెళ్లి రెండు రోజులైంది. అది మిట్టమధ్యాహ్న సమయము. మానాన్నగారు ఆఫీసుపని చూచుకుంటూ వున్నారు. చమటలు కక్కుతూ కృష్ణారావు సైకిలుమీద వచ్చాడు. అతనిచూచిన నేను «యేమండీ యిలావచ్చారు?" అని నవ్వుతూ అన్నాను. అతగాడు నాకేసి చురచురచూచేడు కాని మాటలాడలేదు. తిన్నగా మా నాన్నగారి దగ్గరకు వెళ్లేడు. ఆయన కొంచముసేపు మాట్లాడి, వచ్చిన పనేమిటని అడిగేరు. అప్పుడు కృష్ణారావు మడిచివుంచిన «కబుర్లపోగు" పత్రికను బయటికి తీసి «ప్రణయ ప్రవాహము» ను మానాన్నగారికి చూపుతూ «అయ్యా! మీ అబ్బాయిగారు దీన్ని రాసి పత్రికలో వేశారు. ఇది న్యాయమేనండీ? నేను మా మేనమామ కూతిర్ని పెండ్లిచేసుకోనడానికి వచ్చాను. అది తెలిసి కూడా దీన్నివ్రాశారు. ఇదిన్యాయమాండి?" అన్నాడు.

మా నాయనగారు పలుకలేదు. ఆకాగితాన్ని చేతుల్లో పట్టుకొని

మాటలాడక వూరుకున్నారు. లోపలకు వెళ్లిన నేను కూడా ఆ సమ యానికి అక్కడకే వచ్చాను. ఆయన నన్ను ఒక్కమారు చూచి తల వంచుకున్నారు.

ఐదు నిముషాలవరకు యెవ్వరూ మాటలాడలేదు. నాలో నేను నవ్వుకుంటూ „ఇప్పుడు ప్రమాదం యేమివచ్చింది?" అని అన్నాను. మానాన్నగారు తలపైకెత్తి "నన్ను నలుగురిలోను తలయెత్తుకు తిరగని య్యవులాగుంది" అన్నారు.

„ఏమిచేశాను?" అని నేను అన్నాను.

„ఏమిచేశావా? ఇదంతాయేమిటి? తిని కూచోలేక యీ వ్రాత లన్నీ యేమిటి?" అన్నారు.

„ఇందులో తప్పుడువ్రాత లేమీలేవే?" అని కాగితాన్ని తీసు కున్నాను.

„లేవా?" అని కోపంతో మానాన్నగారు అన్నారు.

„లేవు" అని నేనూ గట్టిగా బదులుచెప్పేను. కృష్ణారావు వూరు కోలేదు. „ఏమండి! తప్పులేదంటారు. ఈ పద్యంలో సూర్యకాంతం అని యెందుకు రాశారు? అది తప్పుగాదా?" అన్నాడు.

„సూర్యకాంత యెలాతప్పు వ్రాతఔతుంది? నన్నాను.

„అది నేను పెండ్లిచేసుకోబోయే నామేనమామ కూతురుపేరు. అది మీకు తెలియదా?" అన్నాడు. „ఐతే అయిందికాని ఆపేరును మీరు పేటెంటు చేయించారా?" అన్నాను.

„బాగానేవుంది సంభాషణ" అని మానాన్న గారన్నారు.

„లేదండి ఇందులో యే ముందోచదవకుండా మీరుకూడా యీయన మాటనమ్ముతారు. అదేమి బాగాలేదు. సూర్యకాంతం అం టే తామరపువ్వుకు అర్థముంది. ఆవుద్దేశంతో నేను వ్రాశానా పద్యా న్ని" అన్నాను.

మా నాన్నగారు చాల భయస్తులు, అనవసరంగా వొకళ్లకు కష్టం కలిగించడమంటే ఆయన కిష్టములేదు. అందువల్ల “ఇతను చేసిన తప్పులకు యితడే బాధ్యుడు. అతన్నే అడగండి” అని తలవంచుకొని తమపని చేసుకొనడాని కారంభంచేశారు.

ఇంకే వృత్తాంతముమూర ప్రశ్నలు చెప్పుకుంటూ కృష్ణారావు మాపూరువెళ్ళి నేను దుర్మార్గుడననీ, తన పెళ్ళికాటంకములు కల్పిస్తున్నాననీ చెప్ప మొదలుపెట్టేడు. అనవసరంగా అనుమానించే వాళ్లని మరింత ఉడికించడమంటే నాకెంతో సంతోషం. ఆ పేరుతో కథలు, పద్యాలు, తమాషాలు వ్రాయడము మొదలుపెట్టేను.

ఈ బెదరింపులవల్ల లాభంలేదనుకున్నాడు. కృష్ణారావు. దగ్గరచేరి మర్యాదగా మాటలాడడ మారంభించేడు. ప్రతిరోజూ సాయంత్రం నాదగ్గరచేరి తన్ను కాంతం తన మేడవయేటే వరించిందనీ, ఒకనాడు ముద్దుమాట లాడుతూ యెనిమిదోయేట ఒక పువ్వులమాల పట్టుకు వచ్చి తన మెడలోవేసి యేమిటిది అంటే గాంధర్వం అందనీ అనేవాడు. నాకు నవ్వువచ్చేదికాని దాన్నిమాత్రం అణచి పెట్టేవుండేవాణ్ణి.

కృష్ణారావు తాపత్రియం చూస్తే నాకెంతో ఆఖరుకు విచారం వేసింది. ఇంత తాపత్రియం పడుతూ వున్నావానికి ఆశాభంగం గలిగితే చాలాకష్టము వస్తుందనుకున్నాను. ఒకనాటి సాయంత్రం యేటివడ్డున గూచుని వుండగా కృష్ణారావుతో “నేను కాంతాన్ని పెండ్లిచేసుకొనననని చెప్పెను.” అప్పుడుకూడా పాపం ఆతడు నిజమేనా నిజమేనా అని నవ్వుతూ అన్నాడుగాని అనుమానంమాత్రం పోలేదు.

ఈసంగతి మాధవయ్యగారికి మడతబెట్టి చెప్పెను. ఇంతవరకూ ఆసలతోవుండిన ఆయన నిరాశ చెందేరు. ఇతర సంబంధాలు చూడడానికారంభించేరు. ఇదియే సమయమనుకొని నేను ఆయనయింటజేరి మేనల్లుని కియ్యడమే మంచిదని, యితనికిస్తే పిల్లనీ అల్లునీ ఇంటనే వుంచుకొని

ఆనందించవచ్చుననీ యితరులకిస్తే వున్న వాకసూతుహూ దూరంగా వుంటుందని చెప్పేను.

నా పట్టు ఫలించింది. నేనొక పెండ్లిపెద్దనయ్యాను. ఒక్కవారంలో అన్నీ సిద్ధమయ్యాయి.

రాత్రి పండ్రెండు గంటలకు ముహూర్తము. వెళ్లనా మాననా అని కొంతవరకూ తర్కించుకొన్నాను. కాని ఆఖరుకు వెళ్లకపోతే బాగావుండదని పెండ్లికి వెళ్లేను. మంగళసూత్రము కట్టబడేటప్పుడు, అప్పగింతలు జరిగేటప్పుడు, కాంతం నన్ను కన్నెత్తిచూచి తలవంచుకుందని నేను వ్రాయడము తప్పుగావుంటుంది: ఆసమయములో నాకంట అశ్రువులు వ్రాలినవని.

పునస్సంధానమైన మరువారమునుండీ కృష్ణారావు వేరే గ్రామములోనూ, కాంతంపుట్టింటా కాలంగడుపుతూ వున్నారని వినడమువల్ల నేను దీన్ని వ్రాసి కొంచము దుఃఖిస్తూ ముగిస్తూవున్నాను.

# ప్రేమలేని పెండ్లియా?

[గత వత్సరము వంగదేశమున యీ కథయందలి చరిత్ర యంతయును జరిగినది. వివరము లన్నియు వంగదేశమందలి పత్రికలలో విపులముగ వ్రాయబడినవి. ఆ నిజాంశములమీదనే దీనిని వ్రాసితిని].

## ౧

ఒకరాత్రియు నొక పగలును ప్రయాణముచేసిన నేనును శకుంతలయు కడుడస్సి యుంటిమి. టర్నరు సత్రములో బసజేసితిమి. స్నానము, భోజనము ఐన తరువాత సర్వమును మరచి నాలుగు గంటలవరకు హాయిగ సుఖనిద్ర బోయితిమి.

ఐదు గంటలకు లోయతోటకేగితిమి. లోయతోట చూచుట కెంతయు ఆనందదాయకముగ నున్నది. సెలవు దినములందు యువకు లందరును యిక్కడకు వచ్చి సంతోషముగ కాలము గడపుదురట.

ఆ చలువగాలి, పూలమొక్కలు, లతలు మున్నగువాటి కెంత యు సంతసించుచు, యిరువురము నెమ్మదిగ ముందున కడుగు లిడుచుం టిమి. శకుంతల హస్తమందలి చేరుమాలు లాగుకొని, దానికొక ప్రక్క తాళములగుత్తి కట్టబడి యుండుటచే గిరుగిరున త్రిప్పుచు మాటలాడు చుంటిని. మాటల సందర్భమున చేయి యూతముగ తిరిగెను. పరియున సాన మే మన, నా రుమాలావడికి తాళములగుత్తితో సహా చేతినుండి జారి పదిగజముల దూరముగ బడెను. "అయ్యో" అని శకుంతల యను చుండగ "తొందర వలదు. వెళ్ళెదము, ఆ మహద్భాగ్యమును దొంగి లించువా రెవరు?" అని యనుచు మామూలుగనే నడచుచుంటిని. మేము చూచుచుండగనే ప్రక్కనుండి యొక యుడుతవచ్చి ఆ రుమాలు నెత్తుకొని పరుగిడ నారంభించెను. దీనిని చూచి నేనాయుడుతను వెంబ డించితిని. ఉడుత కొంతదూర మేగి యొకవృక్షము నెగబ్రాకెను.

నేను వృక్షమును సమీపించితిని; కాని దాని వెంటాడు టెటులు? అచ్చటనే నిలచి అది యేమి చేయునో యని చూచుచుంటిని. చెట్టు మొదలున కొంచెము పైగ నొక తొఱ్ఱ యున్నది. ఆ తొఱ్ఱకడ కొం తవర కదికూర్చుండి పంటితో- రుమాలుపై శకుంతల ఊలుతో యల్లిన పూలను బీకివైచెను. తరువాత నా కొంటెయుడుత రుమాలు నా తొఱ్ఱ లో పారవైచి కొమ్మ కెగబ్రాకెను. రక్షించినదిరా యని నాలో నేను నవ్వుకొనుచు వృక్షము నెక్కి తొఱ్ఱయందలి రుమాలును దీసితిని. తాళ ములతోబాటు నాకొక చిన్న తోలుసంచియు దొరకెను. నాకాశ్చర్య ము గలిగెను. "శకుంతలా! నీ కొక బహుమానము తెచ్చుచున్నాను." అని యనుచు ఆ సంచితో క్రింది కురికితిని.

సంచిని తెరచిచూచితిని. అందు రెండు పదిరూపాయల నోట్లు, కొంతచిల్లర, కొన్ని కాగితములును గలవు. ఎవ్వరేని దాచుకొని యుందు రేమో యను సంశయము శకుంతలకు కలిగెను. కాని దానిపైనున్న కాకిరెట్టలును, ధూళియు నాసంచి యెంతయో కాలమునుండి యచట నున్నట్టులు నిర్ధారణ పరచినవి.

౨

అప్పుడప్పుడే చీకటులు గ్రమ్ముచుండెను. ఆ కాగితములయం దేమియున్నదో చూడవలయునని మసకమసకగ కానుపించుచున్నను యెంతయో ప్రయత్నించి చదువనారంభించితిని. మొదటి రెండుపంక్తులును అలుముకొని పోయినవి. తరువాత "నా యీ యుత్తరము నెవ్వ రేని చూచిన చూతురు. లేకున్న లేదు. ఎవ్వరికేని యిది లభించిన యిక్కడ నేను వ్రాయునదియంతయు సత్యమని మాత్రము నమ్మవల యును. ఏలనన, ఒకటి రెండు గంటలలో మరణింపనిశ్చయించుకొనిన నే నసత్యమాడవలసినపని యించుకేనియులేదు. "Truth rests on the lips of the dying man" అనుమాట లెన్నటికేనియు అసత్యములు కాజాలవు" అనియుండెను. ఈ వాక్యములఁ జదివిన మా యిరువుర శరీరములును జల్లురనెను. ఇంతలో మాయచీకటులు మాకు సంపూర్ణముగ నడ్డువచ్చినవి. ఇందేదియో యొక విషాదవిషయ ముండునని యెంచి దానిని చదువవలయునను యాతురత మమ్మెంతయు ప్రోత్సాహింప వడివడిగ సత్రము జేరితిమి. భోజనమునకేనియు తొందరపడ లేదు. దీపమును వెలిగించి కాగితమును చదువనారంభించితిమి.

3

"నాపై నీకిష్టమున్న నన్నెందులకు పెండ్లియాడవు?" "ఏమి చే యుదును! నే నసహాయుడను. పెద్దలు నామాటల పెడచెవిని బెట్టెదరు"

"అట్టులైన యీ జీవితమునంతటిని యిట్లు దుఃఖముతోడనే గడు

పమబయునా? లేక ఇంటుల కేయ్యకొందువా?"

"నాకేమియును తోచుటలేదు. మీనాయనగారికి ధనముయెడల గల ఆశ నీయొక్క సౌఖ్యముపైనలేదు. నాజ్ఞాతియగు ఆవృద్ధునకిచ్చియే పెండ్లిచేయ నిశ్చయించినారు."

"ఇదియే నాటి సాయంసమయమున నదియొడ్డున మా యిరువురకును జరిగిన సంభాషణ"...తరువాత పదునైదు పంక్తులు చెరిగిపోయియున్నవి. చదువుట కెంతబ్రయత్నించినను వీలులేకపోయినది.

నా జ్ఞాతియగు యేబదియేండ్ల వృద్ధవెంకటరావునకు నా కమల నొసగి ఆమె తండ్రి వివాహ మొనరించెను. నా యాసలన్నియు చల్లారినవి. నాకీబ్రతుకుమీద పరిపూర్ణముగ విరక్తి జనించినది. అంతటితో జీవితమును చాలించుకొందమని యనుకొంటిని కాని, కమలకడనుండి తపాలాద్వారా రహస్యముగ వచ్చుచుండిన యుత్తరములు నా యుద్దేశమున కంతరాయములు గలిగించుచుండెడివి. ఆ యుత్తరములయం దెంతయోదుఃఖమును, ఆసయు, నుండెడివి.

మరల నిచ్చట కొన్ని పంక్తు లస్పష్టముగ నున్నవి.........

నేనిదివరకు వెంకటరావు గడప ద్రొక్కగూడదని కమల పెండ్లియైనమీద యనుకొంటినిగాని, నా కమలకొరకై నా యుద్దేశముల నొక్కమారు మార్చుకొనవలసివచ్చెను.

౪

"సంవత్సరాదిపండుగ. నేను పండుగకు వచ్చెదనని వెంకటరావున కొకజాబు వ్రాసితిని. తప్పక రావలసినదిగ నాతడు నాకు ప్రత్యుత్తర మంపెను. "ప్రేమ...నిష్కళంకమగు ప్రేమ నాపైపున గలదనుకొనుచు పండుగకు రెండుదినములు ముందుగనే రావుగృహమున కేగితిని.

"నేను గృహము చేరుసరికి బోసిపండ్ల వృద్ధవెంకటరావు గారింట మున లేడు. ఆతని ప్రథమకళత్రమునకు జనించిన యేకపుత్రిక యగు

శారద, యిరువది వత్సరముల యౌవనవితంతువు. ఆమె యింటనే విచారమున కాలము గడపుచుండ నీ వృద్ధుడును కొమరితకన్న నాలుగేండ్లు చిన్నయగు నా కమలను పెండ్లియాడినాడు! దీనిని లోకమెట్లు సహించినదో గదా! ఇంతకును ధనము ప్రజల నోళ్లకు కప్పతాళములు వేయించినది. కనుల మూయించినది! భర్తయన నేమియో యెరుగని పసిపాపను వితంతువుగజేసి వృద్ధుడు వివాహమాడుట యట! ఇదియేటి న్యాయము!

౫

"నాటిరాత్రి యంతయు కమలయు నేనును యెంతయో సేపు యేకాంతముగ మాటలాడుకొంటిమి. మే మిరువుర మొకటిగనుండిన యెంతయో శోభగనుండునని వెంకటరావు కొమరితయగు శారద- యేకపటమేమియులేక- యనెను. నాటి రాత్రియంతయు నే నేదియో పెద్దయుపరాధము చేయువానివలె నుంటిని. కమల యింకొకని భార్య యైనది. ఆమెతో నాకు సంబంధము తెగిపోయినదని యెన్నియోమారు లనుకొంటినిగాని ఆ తలంపులన్నియు నొకమూలకేగినవి. ఒకరి నొకరు విడచియుండుట మరణవేదన ననుభవించుటకన్న యెక్కుడని కమల యన్నది. 'ఇరువురమును వొకరినొకరు బట్టుకొని చాలవరకు విలపించితిమి. తుదకు నేనే ధైర్యము తెచ్చుకొని అక్కడనే చాలకాల ముండుమని యామె దుఃఖము నించుక తగ్గించితిని." ఇచ్చట కొన్ని పంక్తు లస్పష్టముగ నున్నవి.

౬

"దొంగతనముగ దినముల గడపుట మా కిష్టములేదు. శారద దొడ్డిలో మొక్కలకు నీళ్లు బోయుచున్నది. వెంకటరావు తన కార్యాలయమునుండి యింకను రాలేదు. ఇదే మంచి తరుణమని యెంచి ముందనుకొనినరీతిగ రైలునకై బయలుదేరితిమి."

"టికెట్టు కొంటిని. రైలు నాకు అరగంట ఆలస్యమాయెను. నా కాస్థానమున నుండుట నిముస మొక యుగముగ నుండెను. ఎంత శీఘ్రముగ బండి కెక్కిన అంత మంచిది అని యెంచుకొనుచుంటిని."

"దైవము మావైపున లేడాయెను. గృహము జేరుసరికి కమల కానరానందున ముసలిపులి పరుగు పరుగున రైలుకడకు వచ్చెను. ఇరువురమును నిర్విణ్ణులమైతిమి. కమల వంచిన శిరమును వంచిన యట్లే యుంచెను."

"వృద్ధుడు క్రుద్ధుడాయెను. బరబర చేయిబట్టుకొని నాకమల నీడ్చుకొని యొక బండియందు కాలుసేతులు బంధించి పడవైచెను. ఇంక తన మిత్రులచే నన్ను కదలనీయకుండ జేసెను."

"ఆక్రూరులు నన్ను బెట్టిన బాధల వ్రాయుటకే నా చేతులాడకున్నవి. ఐనను బహుప్రయత్నముపై వ్రాయుచున్నాను. సగముమీసం గొరిగించిరి. నాయందమగు క్రాపంతటిని దీయించి తల నున్నగ గొరిగించిరి. ఒకచెంపకు మసిబూసిరి. అంతటితో నూరకొంటిరా?—ఆరాక్షసు లూరకొనువారలా?—నన్ను గాడిదపై నెక్కించి నాపై నుమియుచు, కొట్టుచు, తిట్టుచు పురమంతయు త్రిప్పి, తుదకు శవమువలె గావించి యూరిబయట వదలిరి. దీనినంతటిని యెంతయో శాంతముగ నోర్చితిని. నాకమల యెన్ని యెన్నికష్టముల పాలగుచున్నదోగదా యను విచారమున నెక్కుడు వేదించుచుండెను. చేరువ నీ తాఘలో వ్యాసవన మందే—కమలసంగతి నెరుగగోరి మూడుదినములు దాగియుంటిని.

"కమల!—నాకమలపాట్లు యెక్కుడుగ వ్రాయజాలను. కమలను కొట్టుచు గృహమునకు దీసికొనిపోయి శిరోజముల నావృద్ధుడు కత్తిరించివైచెనట. "నీవేల యిట్టియవమర్యాదకు పాలుపడితివన "అతడే నా నాథుడ"ని కమల బదులుచెప్పెనట. వెంకటరావు కోపముజెంది కాలుసేతులు గట్టిగబంధించి గదియందు బడవైచి తలుపు తాళమువైచె

నట. కమల దీసినంతటిని యోర్చినదియట! ‹బాధ యెక్కువగనుంటచే కమల అర్ధరాత్రమూర్ఛెనట. రావుయొక్క వితంతుకోమరితయగు శారద కమలబాధనాలించలేక అర్ధరాత్రివేళ నెమ్మదిగ గదితలుపులుదీసి కమల కట్లను విప్పివైచి అందే పరుండవలసినదిగ గోరెనట. ఆమె అందులకంగీకరింప, మరల యథావిధి శారదగదిద్వారమును బంధించెను.

... ... ... ...

‹‹కమల సాహసించినది. ప్రేమించినయాతడు లేనిదే జీవనము గడపుట వ్యర్థమనియనుకొనినది. ఆ గదిలోనున్న స్పిరిటుసీసాయందలి స్పిరిటుతో వస్త్రముల తడుపుకొని అగ్గిపుల్ల వెలిగించుకొనినది. అంతటితో కమల యీలోకమును వీడినది ... ... ...

‹‹ఈసంగతి నా చెవులబడినది. ఇంక నేజీవింపవలసిన యగత్యము లేదని యనుకొంటిని. నే నెవ్వరిని కాపాడవలయునో ఆమె యీలోకమును వీడినది. నాభారముతగ్గినది. ఇంక నావలన భూదేవికిగలుగుచున్న భారమును, తగ్గించవలసినభారము నాయది. ఈకార్యము నాచరించుటకే ఆవిషాదస్థానమునుండి యింతదూరమునకు వచ్చితిని.” ... ...

ఇచ్చట మరల కొంతసరిగ కానుపించలేదు: ఆనిర్భాగ్యయువకుడా యుత్తరమును ‹‹అన్యోన్యప్రేమకును అనురాగమునకును యీప్రపంచమున తావులేదుకదా!” అని ముగించెను. మే మెంతయు విచారించితిమి. నాటిరేయి మాకు భోజనము సహించలేదు. యువకుడెట్టులనో ప్రాణత్యాగము చేసికొని యుండుననని శకుంతలయు నేనును విచారించితిమి.



# మనిషికెంత భూమికావాలి?

౧

,,శకుంతలా! నాజీవితమెంత మాత్రము నచ్చలేదు"

,,పోనిలే; మాకు కావలసినంతకూడు కట్టుకొనుటకు దగ్గవస్త్రం దొరుకుతూవుంది, అంతేచాలు."

,,అంతే చాలా? అలాగైతే నీవు బ్రతుకుతూవున్నావు. కాకి, కుక్క మొదలైన జంతువులూ బ్రతుకుతూవున్నాయి; యింక తేడా యేమి?" అన్నది శకుంతల అక్కైన కమల.

శకుంతల మాటలాడలేదు. అంతట్లో కమలచేతులు త్రిప్పుతూ ,,ఏమిటీజీవితం! హాయిగా పట్టణంలోపడివుంటే, ఆమేడలు, ఆమిద్దెలు, ఆ అందమైనదుస్తులు వేడుకలు యెన్నివుంటాయి; కన్నార చూడడానికి, మనసార ఆనందించడానికి! ఇంక డబ్బుగడించే విషయములో పట్నానికి వున్న సౌకర్యాలతో పోలికగా చెప్పడానికయినా ఒక్కటి కనబడదెన్ని పల్లెలువెతకినాను. కొంచెం పెట్టుబడితో చాకచక్యంగా వ్యాపారంచేయ డమారంభించేమంటే పదులనుండివందలు, వందలనుండి వేలు, వేలనుండి లక్షలుగడియించవచ్చును. అనేకవిధాలు, అనేకమార్గాలు వుంటాయి. ఇక్కడేముంది, భార్యాభర్తలిద్దరూ ఉదయమునుంచి సాయంకాలము వరకు కాయకష్టంచేస్తే ఆఖరికి పొట్టకూటికి సరిపడేఫలితంగలుగుతుంది" అంది.

శకుంతల యింక వూరుకొనలేకపోయింది. తనపట్నం వైభవాన్నంతావర్ణిస్తూ తన్నునిందిస్తూవున్న అక్కవైపు ముఖంత్రిప్పి ,,ఏమో సౌఖ్యాలు, సౌందర్యాలు పట్నంలో వున్నాయని అంటున్నావు కాని యెన్నిసౌఖ్యాలున్నాయో అన్ని వ్యసనాలు పట్నాల్లో వున్నాయన్న

మాట నీవు మరచిపోయేవు. పట్నపుజీవితమంటే ఏమిటి! తెల్లవారితే యెంతోమందికి సమాధానంచెప్పాలి; ఎన్నో దొంగదండాలు పెడుతూ వుండాలి: ఎంతమందికో భయపడుతు వినయవిధేయతలు చూపుతూ కాలంగడపాలి; ఇదేగదా సౌఖ్యము సౌరభ్యమున్ను! నాలుగుకోజులు వొంట్లో కొంచెంనుస్తీగావుందంటే నాడు డబ్బురాదు. నరేగదా యిది వరకు మాటయిచ్చినవారందరికి మర్నాడు సమాధానంచెప్పలేక సిగ్గుచే తలవంచుకోవాలి. ఇక మాసంగతంటావా!—ఉదయంలేచి యింత కలిగినదాన్నే దోశిని పొలానికివెళ్ళి నిర్మలమైన మనస్సుతో సంతోషంగా పదాలు పాడుకుంటూ పొలములోపనిచేసి, పంటదానితో తృప్తిపడి హాయిగా వుంటాము. ఇంతకంటె సౌఖ్యమేముంది?” అని బదులు చెప్పింది.

బయట పంచవెన్నెల్లో మంచముమీద పడుకొన్నవున్న శకుంతల భర్త రామం, యీమాటలన్నిటిని వింటూవున్నాడు.

కమల వూరుకోలేదు; “ఏది, నీవెప్పుడైన ఒకమంచి పట్టుచీర కట్టుకొన్నావూ? అంతవరకెందుకు, యేలావుంటుందో యెప్పుడైనా చూచేవా? ఏమో సరిపడ్డదంతవస్తుందంటావే, వ్యవసాయంచేసే ప్రతి వారిపొట్టా, వెన్నుకంటుకుపోయేవుంటుంది గాని నిండుగావున్నట్టు కనపడదు.” అంది.

“మాపొట్టలు వెన్నున కంటుకుపోయివున్నా మాకు మాత్రం తృప్తిఅనేదుంది. మీకాసల కంతులేదు.” అని శకుంతల బదులు చెప్పింది.

ఆసమయాన్ని రామం కుటీరంలోనికి వచ్చేడు. అక్కచెల్లెలిదువురి సంభాషణ అతనికి కొంచం సంతోషంగావుండడమే కాకుండా అసలు కూటా పుట్టించింది. అతగాడు వాళ్లిద్దరికి యెదురుగా ముక్కాలుపీట మీద కూచుని మాకుగుడిసెలోనున్నా సౌఖ్యంవుంది. కాని కొంచం

పెద్దభూమి వుంటేనా, యింకొకని లెక్కచెయ్యవలసిన అగత్యమే వుండదు. ఎప్పటికైనా కోరికతీర్చుకొని హాయిగా జీవితంగడపాలి" అన్నాడు.

౨

రామానికి యేలాగైనా ముప్పైయకరాల పొలం సంపాదించాలనే బుద్ధి పుట్టింది.

ఆ గ్రామంలో ఒక ముసలమ్మ వుంది. ఆమెకు నాలుగువందల యకరాల భూమివుంది. ముసలమ్మ స్వయంగా వ్యవహారాలన్ని చక్కబెట్టడానికి శక్తిలేసందువల్ల ఆమె ఒక పించను తీసికొంటూ వున్న సిపాయిని వేతనమిచ్చేమీద తీసుకవచ్చింది. ఈసిపాయివచ్చిన దగ్గరుండి ఆముసలమ్మ పొలంలోనికి గుర్రము వచ్చినా, కుక్క వచ్చినా, ఆవు వచ్చినా, వాటి వాటి యజమానులకు జుల్మానా వేయడము ఆరంభించేడు. రామం మాత్రం దీనిని కనిపెట్టి తనయెద్దులను చాలజాగ్రతగా వుంచేవాడు.

ఇలావుండగా ప్రక్కపట్నంనుంచి ఒక వర్తకుడు వచ్చి ముసలమ్మ స్థిరాస్థినంతా కొనడానికి బేరముపెట్టేడు. ఈవిషయం విని ఆగ్రామంలో వున్నవాళ్లంతా భజనమందిరంలో పోగయి యెంతడబ్బైనా సరే యిచ్చి ఆభూమితామే వుమ్మడిగా కొనాలని నిశ్చయించి గ్రామంలోని పెద్దలందరు కలిసి ముసలమ్మ దగ్గిరకువెళ్లి తమకే భూమి నమ్మవలసినదని అన్నారు. పాపం ముసలమ్మ అందుకు ఒప్పుకొంది. మళ్లీ పెద్దలంతా భజనమందిరముదగ్గర జేరి యెవరి కెంతెంతభూమి కావాలో అని ఆలోచించమొదలెట్టేరు. ఒకరు నూరు యకరాలడిగేరు; యింకొకరు యేబది అన్నారు; మరొకరు డబ్బైఅన్నారు. ఆఖరుకు ఉన్నభూమి యెవ్వరికీ సరిపోనట్లు తోచింది. రామం అక్కడవుండి యిదంతా చూస్తూనే వున్నాడు. కాని, పాపం అతనిదగ్గర పదిరూపాయలకన్న యెక్కువలేదు. అతనికి యేమిచేయడానికి తోచుటలేదు.

ఆఖరికి యెవరిశక్తికొలది వారు వేరువేరుగా భూమి కొనుక్కోవలసిందని గడ్డాల తాతలన్నారు.

3

ఎవరియిష్టంవచ్చినట్లు వారు భూమి కొనక్కోవడము మొదలు బెట్టేరు. రామానికి యెంత ఆలోచించినా యేమీతోచలేదు. అతనికి పిచ్చిపట్టిందనవచ్చు. ఇందుకుతోడు పొరుగింటితడు ముప్పయి యకరాలు కొన్నాడు. తనదగ్గరవున్నది పదిరూపాయలైనా అరవై యకరాలుకొని అతని కన్నా హాయిగా జీవించాలని రామం నిశ్చయించుకొని వున్నాడు పాపం యేంచేస్తాడు భార్యను తనచిన్ని కొడుకును సాధనం సాధనం అని అడగడానికి మొదలుబెట్టేడు.

ఎలాగైతేమి, తనయిల్లు, వున్నయిల్లు, రెండుకాళ్లయెద్లు రెండు లేగదూడలు- వీటన్నింటిని అమ్మేసేడు. మొత్తం మూడువందలు సిద్ధం జేసేడు. తొందరతొందరగా ముసలమ్మవద్దకు పరుగెత్తేడు. కాని యేమివుంది కొనడానికి! అంతభూమి అమ్ముడైపోయింది.

రామంకళ్లొక్కమారుగా కన్నీళ్లతో నిండిపోయినవి. హృదయ భారంతో పాపం, అతడు యిల్లుజేరి యీసంగతి భార్యతో చెప్పేడు. భార్య ఆతడినోదార్చింది. ఇంకొక్క నిముషమన్నా ఆగ్రామంలో వుండ లేనన్నాడు. వెంటనే ఆసాయంకాలం భార్యను, బిడ్డను వెంటపెట్టుకొని పొరుగూరికి ప్రయాణమైనాడు.

ముగ్గురూ క్రొత్తగా నిర్మింపబడిన ఒకపల్లె జేరేరు. ముప్పై యకరాల పొలం కొన్నాడు. వర్షాకాలం వస్తుందనగా పొలాన్ని కాటు కలాగు దున్ని విత్తనాలు చల్లేడు. పంట ముమ్మరంగా పండింది కోత లైన వెనుక తనకు కావలసినంత వుంచుకొని మిగతపంట నమ్మివేసి డబ్బు పోగుచేసుకున్నాడు.

4

ఇలాగు మూడేళ్లు గడిచేయి. ఈ మూడుసంవత్సరాలలో చాల మంది పొరుగుగ్రామములనుండివచ్చి చుట్టుప్రక్క భూములు అన్నింటిని

ఆక్రమించేరు. కొంతమంది ధనికులు కూడా వచ్చి పది పండ్రెండు యకరములవంతున భూములు గలిగివున్న వాళ్లకు యెక్కువ డబ్బుయిచ్చి వందలకొలది యకరాల కొనివేసి చాల ధనవంతులయ్యారు.

ఇప్పటికి రామం యేబయియకరాల పొలము, పదిగాళ్ల యెడ్లు సంపాదించాడు. ఐనా ఆతగాడికి సంతుష్టిలేదు. డబ్బున్నది కాని ఆతనికి భూమి అమ్మేవాళ్ళు మాత్రం యెవ్వరూ కనబడలేదు. దానితో అతనికా వూరిమీద అసహ్యంపుట్టింది.

తన యిల్లుతప్ప మిగత ఆస్తినంతా అమ్మేశాడు. భార్య యెంతచెప్పినా విన్నాడుకాడు. ఒక నెలదినాల్లో తిరిగి వస్తానని భార్యతో చెప్పి బయలుదేరేడు.

నెల దినాలు విసుగు విరామం లేకుండా ప్రయాణం సాగించేడు. ప్రతి గ్రామంలోను వాకబుచేసేడు. ఎక్కడా తనకు చౌకగా భూమిని అమ్మేవాళ్ళు కనబడలేదు.

ఆఖరుకి విసిగి యింక యేమిచేయడమని అనుకుంటూ, ఒక పంతెనవద్ద చతికిలబడ్డాడు. ఆ సమయాన్ని దారినిపోతూవున్న పెద్దమనిషి ఆగి ఊరుపేరుల చెప్పమని రామాన్నడిగేడు. రామం విపరాలు చెప్పేడు. తిరిగి ఆపెద్దమనిషినిగురించి రామం కొన్నివిషయాలడిగేడు.

అందుమీద ఆతగాడు "నాకు నాలుగువందల యకరాల పొలముంది. ఇది స్వార్జితం" అన్నాడు. "స్వార్జితమా? ఎలా సంపాదించేరు; ఎంతఖరీదుకు కొన్నారు" అని ఆశ్చర్యంతో అతన్నడిగేడు రామం.

"ఈ తూర్పు దిక్కుగాపోతే నొకచిన్న రాష్ట్రం వుంది. అది భూమికాదు, నల్లబంగారమె. ఆరాజ్యం వాళ్ళుహాయిగా కాలంగడుపుతారు. వాళ్ళు నీళ్లేవో పాలేవో కూడా చెప్పలేరు. వాళ్ళకి కొన్నివస్తువులు మేహార్బానీగా తీసుకువెళ్లి సంతోషంగా కబుర్లు చెప్పి తరువాత మనకోరిక చెప్పితే సరేఅని మనంకోరిన భూమి యిస్తారు'! అన్నాడు.

ఆ సమయాన్ని ఆతని హృదయంలో యెన్నో భావాలు బయల్దే

రేయి. ఏమవంచల యాకరాలకు నాథుడవడానికి నిశ్చయించుకొన్నాడు రామం.

ఇంక ఆలస్యం చెయ్యలేదు. ఏమేమి వస్తువులు తీసుకువెళ్లాలో ఆ పెద్దమనిషి నడిగి తెలుసుకొని అతను చెప్పినప్రకారం మంచి మిఠాయి, రెండు మేకలు, పట్టుబట్టలు, నిప్పకోడి మృదువైన వెంట్రుకలు, కస్తూరి, మొదలైన వాటి నన్నింటినీకొని బయల్దేరేడు.

ఒక వారంరోజులు ప్రయాణంచేసి ఆరాష్ట్రం జేరేడు. ప్రపంచ మంతా పచ్చగా కనుల వైకుంఠంగావుంది. ఆసమయాన్ని రామం హృదయం బద్దలై పోతుందేమో అన్నంత తీవ్రంగా ఊహాతరంగాలు విజృంభించ నారంభించేయి, పెద్దమైదానం మధ్యకొన్ని కుటీరాలున్నాయి. కుటీరాల కొకి ప్రక్క మంచి నీడ నిచ్చేచెట్లున్నాయి. చెట్లకింద చాల మంది కూచోని హాయిగా పాటలుపాడుతూ వున్నారు. రామం వేగంగా వెళ్లేడు. అక్కడవున్న గుంపులో పెద్దవలె కనబడ్డ అతనికి రామం నమస్కరించేడు. వారు ఒకచిన్న మెత్తనిచర్మముమీద కూచోమన్నారు. రామం కూచున్నాడు. వాళ్లేదో భాషలో మాటాడుకున్నారు. తన్నుగురించే అని రామం అనుకున్నాడు. తరువాత రామం తెచ్చిన కానుకలు వారికి సమర్పించేడు. వాళ్లు సంతోషించారు.

ఇంతలో రామంభాష మాటలాడగల ఆయనొకడు వచ్చేడు. ఆతగాడు రామాన్ని కుశలప్రశ్న లడిగేడు. ఏమేమో వింత సంగతులున్నవి రెండు, లేనివి నాలుగు కలిపి చెప్పేడు. అతగాడు రామం మాటల మళ్లీ తర్జుమా జేసి అక్కడవున్నవాళ్లకు చెప్పితే వాళ్లంతా చాల సంతోషించేరు. తరువాత ఒక పెద్దవిందు జరిగింది. రామం తీసుకువెళ్లిన వస్తువులను వాళ్లుపయోగించారు. విందాకరైన తరువాత వాళ్లపెద్ద, రామం వచ్చినకారణం చెప్పమన్నాడు. రామం తనకు యీదేశంలో వుండాలని వుద్దేశంవుందని తెలిపేడు. అందుకు సంతోషంఅని నాయకుడు బదులుచెప్పేడు.

"ఐతే నాకోసం కొంతభూమి వేరుపరచి పత్రముమూలంగా యి వ్వాలి" అని రాము అన్నాడు.

"అలాగైతే వెయ్యి రూపాయలివ్వు, నీయిష్టంవచ్చిన దిక్కులో నీవు ఒక్కదినంలో చుట్టగల భూమంతా నీవశంచేస్తాము" అని నాయ కుడన్నాడు.

"సరే" అని సంతోషంతో రాము ఒప్పుకొన్నాడు.

రాత్రి యెంత ప్రయత్నించినప్పటికి రామునికి, నిద్రరాలేదు. అతనిహృదయంలో కోరిక లెన్ని యున్ని అని చెప్పడానికి యెవరి శక్యం గాదు. కొక్కొరోకో అని తొలికోడి కూసిన వెంటనే లేచి స్నానంచేసి కొన్ని పాలుదాగి పార భుజముమీద వేసికొని బయలుదేరేడు.

సూర్యుడు వచ్చేసమయానికి నాయకుడు రాముని ఒక కొండ దగ్గరకు తీసుకవెళ్ళి మంచిభూమిని చూపించి "ఇదిగో! యీ కనపడే భూమిలో యెక్కడనైనా ఒకస్థలం యెంచుకోవచ్చు. నీవు సాయంత్రి మయ్యేసరికి—అంటే సూర్యుడు మాయమయ్యేసరికి యీకొండదగ్గరకు రావాలి; లేకపోతే నీకు ఒక్క అడుగుభూమైనా దక్కదు" అన్నాడు.

సరే అని చెప్పి రాము పార భుజాన్న వేసుకొని బయలుదేరేడు. ఎదుటనున్నా భూమిని చూచేసరికే అతగాడికడుపు నిండిపోయిందనవచ్చు; కళ్ళు చెదిరేయి. సాధ్యమైనంత వేగముగా నడవడము ఆరంభించాడు. సుమారు ఫర్లాంగు ఫర్లాంగునకును ఒక్కొక్క ఆనవాలు పారతో పెడు తూ వెళ్లేడు.

నడినెత్తిని సూర్యుడు నిలచేవరకు తిన్నగా మలుపైన తిరుగకుండ వెళ్లేడు. అప్పుడు సూర్యుణ్ణి చూచేడు. ఇంక సగముదిన ముందనుకు న్నాడు. ఎదుటవున్న భూమి బంగారంవలె కనబడుతూవుంది; ఏలాగైతే నేమి బహుకష్టముమీద రెండవవైపు తిరిగి నడవడాని కారంభించేడు. మళ్లీ ఒకమారు ఆసూర్యుణ్ణి చూచాడు. ఇంక రెండున్నర గంటలలో అతడు మాయమవుతాడని తెలుసుకున్నాడు.

ఇంకా రెండు ప్రిక్కులు నడవాలి. వర్షబిందువుల్లా చెమట దేహంనుండి స్రవిస్తూవుంది. కాళ్ళు ముందుకు పోనీయడములేదు. ఏలాగు ఏలాగు అని అతగా డాతురపడ్డాడు. మళ్ళీ ధైర్యం తెచ్చుకొన్నాడు. నిలబడి ముందున్న కొండ చూచి, ముందుకు నాలుగడుగులు వేసేడు. కాళ్ళు పట్టుతప్పి మళ్ళీ నేలపడ్డాడు; ఒక్కనిముషం అలాపడివుండి తాను పశ్చిమం బయలుదేరిన కొండనుచూచాడు. అది దగ్గరగా వున్నట్టు కనబడ్డది. కాని నడవడానికి ఏంతమాత్రం సత్తువలేదు. ఆసమయాన్ని ఆతనిభార్యా, బిడ్డ కనుపించేరు. ఈ రెండు జీవాలకోసమైన తుది ప్రయత్నం చెయ్యాలనుకున్నాడు. ఆతలంపుతో నూతనశక్తి దేహంలో ప్రవేశించినట్టయింది. రెండుప్రిక్కులు నడవడము తేలిక్కాదని మూడవ ప్రిక్క అష్టంగా త్రొక్కి కొండజేరి ముక్కోణాకారంగావున్న పొలంతో సంతుష్టినొందుదామనుకున్నాడు. అక్కడొకపార నాటువేసి మళ్ళీ నడవడాని కారంభించేడు.

అతగాని దృష్టంతా కొండమీదనేవుంది. ఆకిందభాగాన్ని నాయకుడు కొంతమంది అనుచరులువుండి చప్పట్లు కొడుతు పాటలు పాడుతు త్వరగ రావాలని హెచ్చరిస్తూవుండడము అతడు చూచేడు. ఒక కర్రకు తగిలించిన తన పై అంగీ, దానిప్రక్కనుంచిన రూపాయలసంచి, తలపాగ కనపడ్డాయి. ఇంక యెటుచూచినా వున్నది వొకగంట సమయం. ఒక్కక్షణమైనా ఆలస్యం చెయ్యరా దనుకున్నాడు. ఆలస్యంచేస్తే ఆవొక్కగంట కాలంలో- సూర్యుడు మాయమయేముందు- ఆకనబడే కొండ జేరలేకపోతే రూపాయలన్నీ- అన్యాయంగా- నిష్ప్రయోజనంగా పరులకు దక్కిపోతా యనుకున్నాడు. మళ్ళీ భార్యా, బిడ్డ, కళ్లకి కనబడ్డారు. కళ్లెర్రబడ్డాయి. ఉన్నకాలం చాలతక్కువ. కొండదగ్గర వాళ్లు „రా! రా!" అని కేక లెక్కువ వేయడం ఆరంభించారు.

రాముం రెండుమార్లు పడ్డాడు; రెండుమార్లు లేచేడు. సూర్యు

కొండ వెనుక మాయ మయ్యాడు. కడపటికళ, వచ్చేకటికచీకటిలో మి శ్రమమైంది. రామం భుజము మీదపార పర్వతముయొక్క క్రిందిభాగాన్ని నాయకుని పాదాలికెదురుగా దబ్బునిపడి చిన్ననాటువేసింది. దాని తో “నే దేశం, యింతా నాభూమి” అని అంటూ రామం క్రింద బడ్డాడు

అక్కడవున్న ఆడాళ్లంతా ఆతనిస్థితిచూచి చాలజాలిపడి శైత్యోపచారాలు చేయుడ మారంభించేరు. కొంతమంది పాలు, రొట్టెలు పట్టుకు వచ్చేరు.

ఐదునిముషాలకు రామం కళ్లు తెరిచేడు. ఎదట నాయకుణ్ణి తదేకదృష్టితో చూచేడు. నాయకుడికి రామంమీద జాలిగలిగింది. ఆతగాడి కండ్లవెంట నీళ్లురాలేయి. రామంపక్కను మోకరించి “కొంచంసేపు పడుకో” అని అన్నాడు నాయకుడు.

రామం ఒక్కనిముషమైన వెనుక నాయకునితో “నాభూమిని పత్రిం వ్రాసిస్తారా!” అన్నాడు.

వెంటనే నాయకుడు యిదివరకే ఆతని పేర వ్రాసివుంచిన పత్రాన్ని రామం హస్తాల్లో వుంచేడు. దాన్ని చూచిన రామం “అమ్మయ్య! ఇదంతానాది” అన్నాడు. తరువాత కళ్లు మూతలుబడ్డాయి. ఇంక రామం కదల్లేదు. అక్కడవున్న ఆబాలగోపాలం బోరని యేడ్చింది. నాయకుడు ఆఖరున యేడడుగులభూమిని త్రవ్వించి అందులో రామాన్ని పూడ్పించాడు.

(కర్త: టాల్‌స్టాయ్ కథానువాదము)

# కోరిన చీర.



౧

సదాశివరావేమిచేయును? చిన్ననాటి స్నేహితుడు. నాలుగేండ్ల కు రంగూనునుండి వచ్చెను. అతనిని వదలి యుండగలడా? వారము దిన ములనుండి కార్యాలయమునకు కూడ ఆలస్యముగ బోవుచున్నాడు. ఇం కయింటికి రాత్రి తొమ్మిదిగంటలకు వచ్చుచున్నాడు.

నిజముగ కమలకు చాలకష్టముగ నున్నది. ఇరుగుపొరుగువారితో అనవసర సంభాషణచేయుట యన కమలకెంత మాత్రమును యిష్టము లేదు. ఇంక ఆమె దినముల నెట్లుగడుపుచున్నదను సందేహము కలుగ వచ్చును. కమల ఉదయముననే లేచి యింటిపనుల నన్నింటిని స్వయ ముగ జూచుకొని భర్తకు తేనీరొసగి తొమ్మిది గంటలకు వంటను సిద్ధ ముచేసియుంచును. భర్తభోజనముచేసి కార్యాలయమున కేగినమీద ఒక గంటవరకు మూడేండ్ల బాలికయగు సుశీలకు అక్షరముల జెప్పును. తరువాత నవలలనో పత్రికలనో చదువుచు ఐదుగంట లెప్పుడగునా యని వేచియుండును. భర్తరాగనే మరల తేనీరుతో అల్పాహారముల నొసగి సంతోషముగ సంభాషించుచు కాలము గడపును.

ప్రస్తుతము వారము దినములనుండి యిట్టిదేమియును జరుగుట లేదు. ఆమెకెంతయో కష్టముగనున్నది.

నాటి దినమంతయు సుశీలకు తలనొప్పివచ్చెను. భర్తయెడగల కోపమువలన కమల సదాశివునకీ సంగతి యెరుకపరుపలేదు.

తొమ్మిది కొట్టినది. సదాశివరావు పాదప్రక్షాళన మొనర్చి పీట పై కూర్చుండెను. కమల వడ్డనగావించి భర్త్రకేమి యేసి కావలసిన మరల వడ్డించునుద్దేశముతో వంటయింటి తలుపు వెనుకనిలచియుండెను. వడ్డన

గావించిన యనంతరమామె భర్తయెదుట కూర్చుండుట యలవాటు. అట్టిది జరుగనందువలన కమలకు తనపై కోపమువచ్చినదని సదాశివ రావు గ్రహింపగలిగెను. కాని అతడేమియు పలుకరింపలేదు.

ఉదయముననే లేచి సదాశివుడు మరల మిత్రుని గృహమునకేగె ను. సరిగ పదిగంటలకు తిరిగివచ్చి వేవేగ భార్యయిడిన భోజనమును కొద్దిగ నారగించి కార్యాలయమున కేగ సిద్ధముగనుండెను. ఇంతలో అతనికి చిట్టిపదముల సవ్వడివినబడెను. తరువాత "నాన్నా! తేరూ?" అను మాటలు విననయ్యెను.

ఆ పిలచినది సుశీల. సుశీలయెదుటబడెను, "ఏమి తేను తల్లీ!" అని సదాశివరావు కొమరితను ప్రశ్నించెను.

"పోనీలెండి" అని కోపగించి యెదుటనుండి వెడలి పోవుచుండెను. సదాశివరావు మరుగున వెళ్ళి సుశీలను యెత్తుకొని ముద్దులాడుచు "తల్లీ కోపమా! చెప్పమ్మా!" అనెను.

"గాను" అని సుశీల నెమ్మదిగ యూరకొనెను.

"తల్లీ! పొరపాటువచ్చింది; తప్పక తెస్తాను" అని మరల ముద్దు లాడి తాను వేళయైనదని కార్యాలయమునకు బయలుదేరెను.

౨

రావు పనిచేయుచున్న క్రంపెనీయధికారి చాలకోపిష్టి. అదియును గాక బ్రహ్మచారి. సంసారకష్టము లాతనికేమియును తెలియవు. గుమా స్తాలించుక యాలస్యముగ వచ్చినయెడల పులివలె మీదపడును.

వారముదినములనుండి సదాశివుడాలస్యముగ వచ్చుచున్నాడని యెరిగిన యధికారి మూడుదినముల క్రిందనే పిలచి యెన్నియో చీవాట్లు బెట్టెను. వాటినన్నిటిని జ్ఞప్తికి దెచ్చుకొనుచు తప్పక నేడు మరల యధి కారి యాగ్రహమునకు పాలుగావలసియున్నదని నిశ్చయించుకొని వేగ ముగ కార్యాలయము చేరెను.

గుమాస్తాలందరును యెవరి తావులకడవారు లేరు. అందరును మే నేజరు బల్లకడమూగియుండి గట్టిగ మాటలాడుచుండిరి. బంట్రోతులు డవాలీల దీసివైచి హాయిగ పరుగులిడుచుండిరి. దీనినంతటిని గాంచిన సదాశివునకు వీరి వింతప్రవర్తన కేమియు అర్థముతోచలేదు. బిరబిర నాతడా గుంపుకడ కేగి అందొకని నుద్దేశించి "ఏమిరా! ఇల్లాగల్లరి చేస్తు న్నారేమిటి? మీరా కందరికీ మతులు పోయినట్లుంది. ఏమిటిది !" అని యనెను.

"ఏమిటా? కోమటి, మన పులిరాలేదు; వొచ్చివుంటే మళ్లీ గాక ముక్కలు తగిలేవే" అని యొక యుద్యోగి బదులుచెప్పెను"

"నీ వేళాకోళాలు కట్టిపెట్టు; నిజం చెప్పరా!"

"ఇందులో అబద్ధమే ముంది? దొరకు దెబ్బతగిలింది; వారం పది రోజులవరకు ఆసుపత్రిలో వుండాలి; అదివొఖ శుభవార్త. తరువాత మనకు యివ్వాళజీతంతోబాటు బోనసుకూడా దొరుకుతుంది."

"ఆ? ఇదే మిటోయ్?" అని రావు ఆశ్చర్యమున బలికెను.

"వొచ్చేది పండగగదామరి!"

దొర రాకుండుట యొకటి, పండగ బట్టలకు ధనసహాయము గలు గుట రెండవది; చీవాట్లు తప్పవనుకొనుచువచ్చిన యాతనికీ శుభవార్త లు తెలియుటవలన కలిగిన సంతోష మింతింత యని చెప్పనలవిగాదు.

3

నాడు కార్యాలయము నాలుగు గంటలకే మూసివేయబడినది. జీతములనందుకొనిన గుమాస్తాలు తాము నెలపొడుగునను చేసిన చేబదు ళ్లను తీర్చుటకై వెళ్లవలసిన స్థలములకు వెళ్ళిరి.

సదాశివుడు తిన్నగా తనమిత్రుని గృహమున కేగెను. మర్యాద కేనియు ఒక్కమారు కాఫిహోటలున కాతడు మిత్రుని తీసికొని వెళ్ళి యుండలేదు. కారణము? డబ్బుకొరతకన్న వేరేమియున్నది.

నాడుమిత్రునితో కాఫీహోటలున కేగి అటనుండి బట్టలదుకాణ ముల కిరువురును వెళ్లిరి. సుశీలకై యొకఖరీదైన చిన్న పట్టుగౌను నాతడు కొనెను. తరువాత తన భార్యయగు కమలకేదియేని కొనవలదా? ఆమెకు ప్రస్తుతము కోపముగనున్నది గదా? మంచిచీర నొకదానిని తీసికొనివెళ్ళిన కోపమంతయు నొకసారిపోయి చిరునవ్వువెన్నెలలు మోమున తాండవమాడును. ఇటు లనుకొనిన సదాశివుడు తనలో తాను నవ్వుకొనెను. దీనిగాంచిన సదాశివుని మిత్రుడు "ఏమిరా ? నవ్వుతున్నావు ?" అని యనెను.

ఏమియు లేదనిచెప్పి రావు మిత్రునితో "ఒక చీరకొనె దమురా" అనెను.

మిత్రుడు చేగడియారము చూచి తనకు పనియున్నదని మరలకలసి కొనెదననియు చెప్పి వెడలిపోయెను.

రావుదుకాణమందు వ్రేలాడుచున్న చీరలన్నిటిని చూచెను. ఆతనికంటి కవియన్నియు యింపుగ కానబడలేదు. ఎట్టిదైన కమలకు బాగుగ నుండునుః అని తనలో తాను వితర్కించుకొని తానొక పేద గుమాస్తా యగుటవలన విలువయగు వస్త్రముల న్వాయముగ నిదివర కెన్నడును కొనియుండనివాడౌటచేత నొకకుర్రవాని కడకేగి "నెమలి మెడ దగ్గరవుంటుంది రంగుచూశావూ! అటువంటి చీరయేదైనావుందా" అని యడిగెను. ఒకగుట్ట పట్టుచీరల నాతడు సదాశివు నెదుటబడవైచెను చాలసేపు వాటిని పరిశీలించి తుదకుతాను కోరినవర్ణముగల చీరనుదీసి వెలయెంతయని యడిగెను.

"నూటయిరవై రూపాయలు"

నూటయిరువది రూపాయలు! నలువదియైదు రూపాయలగు మాస్తా యింత విలువగల చీరను కొనుట యెట్లు! అది అసంభవముకానియాతని దృష్టియంతయు నాచీరమీదనే యున్నది.

కొంతసేపై నమీద నాతఁడు "ఈరంగులో తక్కువ వెలగలవి కలవా?" యని యడిగెను. లేవని కుఱ్ఱవాఁడు చెప్ప విచారముతో సదా శివరావు బయటికి బోవుచుండెను.

దుకాణదారుఁడేలనో మరల రావును వెనుకకు బిలచెను. రావు కుర్చీమీద కూర్చుండెను. పెట్టెలోనుండి యొకచీర నాతఁడుతీసి రావుహస్త ములఁ బెట్టెను. దానినాతఁడు పట్టిచూచెను. అది తాను కొనదలచుకొనిన చీరవంటిదే; కాని మడతలు మాత్రము సరిగలేవు.

"ఇంత ఖరీదుగల చీరనేను కొనలేను" అని రావు దుకాణదారుని తో ననెను.

"ఈ చీరనొక పెద్దమనిషి నాలుగు దినములక్రిందనే మాదగ్గర నుంచి కొన్నాడు. నిన్న మళ్లీపట్టుకొనివచ్చి తనకు డబ్బు అవసరంగా వుందని చెపుతూ, సంగంవెలకిమ్మి వెయ్యాలిసిందిగా చెప్పి దీన్ని విడిచి పెట్టి వెళ్లేడు; మడతలు విప్పేరుగాని ఒక్కమారయినా కట్టుకోలేదు. సరి కొత్తది. తీసుకుంటారా!" అనియెను.

నూటయిరువది రూపాయల చీర యేబదిరూపాయలు! సదాశివ రావు వెంటనే ధనముచెల్లించి చీరనుతీసికొని గృహాభిముఖుఁడాయెను.

౪

సదాసివరావు తనలో తానానందించుచు గృహము జేరి తలుపు తట్టెను. ద్వారము తెరువబడెను. ఎదుట సుశీలనెత్తుకొనియున్న కమల కానుపించెను. ఆమెకనులనుండి కన్నీరు కారుచుండెను.

భర్తనుగాంచిన యామె వెనుకొక్కమారుగ తిరిగి చీరచెరగున కనులతుడుచుకొనుచుండెను. రావునకు కాలుసేతులాడలేదు. కమలకన్ని టికి కారణము తెలియదు. ఆతురమున "ఏమి! ఏమి!" అని ఆమె ముందు నకాతఁడేగెను.

"సుశీలకు జ్వరంవచ్చింది. వొళ్ళుకాలిపోతుంది" అని వెక్కి వెక్కి

యేడ్వనారంభించెను. రావు నిశ్చేష్టుడాయెను. చేతనున్న వస్తువులు నేల వ్రాలెను.

కమల బిడ్డను చాపపై పరుండబెట్టి జోకొట్టుచు పొంగివచ్చు కన్నీటిని తుడుచుకొనుచు "విదుడు యిూ రోజుల్లోనే సుందరంపూయ మైనాడు" అనెను.

ఇరువురి దుఃఖమును మరింత యెక్కువాయెను. భార్యను భర్తయు, భర్తను భార్యయు దప్పవారి నావినాగస్థితియం దోదార్చు వారెవరు! రావు, దుఃఖమును దిగమ్రింగి కమల నోదార్చుచుండెను.

ఇంతలో సుశీల యించుక లేచి "నాన్నా! గౌనేదీ?" అనెను. దంపతులిరువురకును పంచప్రాణములు లేచివచ్చినవి. "ఇదిగో చిట్టితల్లీ" యనుచు ప్రక్కనే పడియున్న గౌనును తీసి కొమరితకు రావు అందిచ్చెను.

సుశీల "నాగౌను, నాగౌను" అని ఆడనారంభించెను. కమల కుమార్తె, నెత్తుకొని ముద్దులాడెను.

తరువాత నాతడు చీరను దీసికొనివచ్చి "ఇది సుశీల అమ్మకు" అని యెదుటబెట్టెను.

కమలదాని జూచి సంతసించినది. "ఎంతకు కొన్నారు?" అని యడుగ "చాలా గాథవుంది, తరవాత చెపుతా" అని రావనెను. సుశీల నిదురవోయెను. భోజనము చేయుచు చీర వృత్తాంత మంతయు నాతడు కమలకడ చెప్పెను. "అలాంటి దెందుకు కొన్నారు? ఆవిడ యెంత కోప పడుతుందోగదా! ఏదో చవకదైనా బాగానేవుండేది, యిదెందుకొన్నారు" అని చీర వృత్తాంతి మంతటిని వినిన కమలయనెను.

౫

సుశీలకు జ్వరమువచ్చి మూడు దినములైనది. దినదినమునకును జ్వరముయెక్కుడే యగుచుండెనుగాని తగ్గుటలేదు. సదా శివరావు సెలవు బెట్టి యింటనేయుండెను. ఇరువురకును యేమియు తోచుటలేదు.

ఒంటిగంట వేళయైనది. కొంచము హార్లిక్సుపట్టి సకీలను పరుండబెట్టి భార్యా భర్తలిరువురును ప్రక్కనే కూర్చుండిరి.

ఎవ్వరో తలుపుతట్టిరి. రావులేచి తలుపు తెరచెను; ఆ వచ్చినది యొక పురుషుడు. ఆతని కనులు లోతుగ పోయి చింత నిప్పులవలె యెఱ్ఱనై యుండెను. అతడు లోనికివచ్చి రావుకు నమస్కరించెను. రావాతని నొక కుర్చీపై కూర్చుండ జేసెను.

అతడంత "అయ్యా! నేనిక్కడెక్కడు కాలముండ దానికి ఫీలులేదు మొన్న మీరు నాచీరకొన్నారట. దయచేసి దానిని నాకిచ్చెయ్యాలి." సదాశివున కావచ్చిన యాతని మాటలు యేం అర్థము కాలేదు.

"ఏమిటయ్యా అంటారు? కావలసివుంటే, యెందుకమ్మినేవు?"

"అయ్యా! సంగతిది. దాన్ని నా భార్యకోసం బహు కష్టపడి కొన్నాను. నేను బీదవాణ్ణి. వచ్చేదికొద్ది. ఇంతట్లో ఆమెకు పెద్ద కాయిలా జేసింది. చేతిలో కాసైనాలేదు. అంచేత దీన్ని అమ్మేసేను. నా భార్య యిప్పుడు అవస్తలో వుండికూడా చీరచూపించమని పట్టుబడుతుంది. ఎన్నిమర్లాలు పెట్టిచెప్పినా వినదు. మీరు దయచేసి యిచ్చేరంటే దాన్ని ఆమెకిజూపించి మళ్లి తీసుకొచ్చి యిచ్చేస్తాను; లేకుంటేరా నెమ్మదిమీద మీకు డబ్బే యిస్తాను." అని యా వచ్చిన యాతడనెను. "మావాళ్ళిది వద్దంటున్నారు; రూపాయలిచ్చి తీసుకెళ్లండి" అని రావనెను.

"అయ్యా! ఇప్పుడివ్వలేను. అంతెందుకు, రెండురోజులిచ్చేరంటే యిప్పుడో అప్పుడో చనిపోయే నాభార్య కళ్లయెదట దీన్నుంచి మళ్లీ మీకు ముట్టచెప్పుతాను. నన్ను నమ్మండి. ఇది నాభార్య కడసారి కోరిక. దీన్ని తీర్చలేకపోతే నాబ్రతుకెందుకు!"

ఈసంభాషణ నంతటిని తలుపు వెనుకనుండి కమల వినుచునే

యున్నది. ఆమెకాతనిపై జాలిగలిగెను. "ఇయ్యాండి కష్టంలోవున్నారు" అని యెంతరమోచెప్పెను.

ఎంతయోకష్టపడి గడించిన ధనము పోగొట్టుకొనవలసినదేనా? అతలంపు సదాశివునకు కలిగెను. తరువాత తన యెదుటవున్న పురుషుని స్థితిగురించి చింతించెను. తుదకాతనికా చీరను రావొసగెను.

వేయినమస్కారములని యామెతో చీరను మూడురోజులలో తెత్తునని చెప్పి వెళ్ళిపోయెను. సదాశివుని సెలవంతయు ఆఖరాయెను. సుశీల కింకను నెమ్మదిని తాకపోయినను ఆతనియుద్యోగమునకు వెళ్లక తప్పినది కాదు. కమల మంచముపై పరుండియున్న కుమార్తెను జూచుకొనే దినములు గడపుచుండెను.

ఆపురుషుడు చీరను బట్టుకొని వెళ్ళి నాలుగుదినములైనను ఆతని భార్యకెట్లున్నదియో కమలకు తెలియులేదు. ప్రతిదినమును ఆమెభర్తని విషయమును గూర్చి ప్రశ్నించుచునేయుండెను కాని యేమియు తెలియులేదు.

మిట్టమధ్యాహ్న సమయము [illegible] తీవ్రతవహించెను. సదాశివరావు కార్యాలయమున కేగెను. కమల కంట నీరు పెట్టుకొనుచు కొమరితనెన్నియోమారులు యెన్నియో విధముల పల్కరించుచు, కౌగలించుకొనుచుండెను.

ఇంతలో ద్వారముకడ నెవ్వరో పిలచినట్లయ్యెను. కమలలేచి గవాక్షము కడకేగి బయటికి జూచెను. ఆనాడు చీరను బట్టుకొనివెళ్ళిన పురుషుడటనుండెను.

"మగవారులేరని" కమల యనెను. "అమ్మా!" యని యాతడు దుఃఖపూరిత కంఠముతోననెను.

కమల శరీరము జలదరిల్లెను. వెంటనే యామె ద్వారము తెరచి "అయ్యా! మాఅక్క సుఖమేనా?" అని చుట్టరికము కల్పించుకొనియెను.

"అమ్మా! అంతా ఆఖరైంది. చీరచూచింది. దాన్నే ప్రక్కలో బెట్టుకొని ప్రాణముల విడచేవరకూ, చూస్తూవుంది. ప్రాణాల విడ

చేటప్పుడు "ఆచీర నాకు చుట్టి స్మశానవాటికకు తీసికెళ్ళండి" అని చె ప్పింది. ఆచీరధర మీకు నెమ్మదిగా యిస్తానని చెప్పడానికొచ్చేను. క్షమించాలి" అని యాతడు కంట దడివెట్టుకొనుచు పలికెను.

కమల దుఃఖము నాపుకొనలేక పోయెను. "అయ్యో ! మీరివ్వ నక్కరలేదు. అది నాకు మా వారు బహుమతీగా యిచ్చేరు. దాన్ని నేను మా అక్కకిచ్చేను. మీరు మళ్లీ యేమీ యివ్వనక్కరలేదు. వెళ్లండి." అని యనెను. ఆ పురుషుడిట్లు తనకు సహాయపడువారుందు రని యనుకొనియుండలేదు. "అమ్మా! మీ ఋణము తీర్పలేను. మీకు శుభంకలగాలి" అని వెళ్ళిపోయెను.

"అయ్యో" అని నిట్టూర్పువిడచుచు కమలబిడ్డ కడకేగెను. బిడ్డ మంచముపైన లేదు. సుశీలలేచి క్రింద యాటలాడుకొనుచుండెను. ఆమె జ్వరమంతయు తగ్గెను.

నాలుగు గంటలకు సదాశివరావు కోపముతో యింటికివచ్చి "కమలా! చూశావా! ఎలాజేసేదో ! ఆ చీరని శవంపై కప్పేసు ! మన లని—" అని యింకను యేమియో యనుచుండ కమల యడ్డువచ్చి "అలాకోపపడవద్దు. ఆయన యిక్కడకువచ్చి అడిగేరు. మీరు దాన్ని నాకిచ్చేరని, దాన్ని నేనామె కిచ్చేశానని చెప్పిపంపించేను. మీరేమీ అనుకోవద్దు. దానికి తగ్గ ప్రతిఫలం మనకి అప్పుడే కలిగింది." అని కమలయనెను.

"ఏమది!" ఇంతలో "నాన్నా !" అను సంతోషకంఠము ఆతనికి వినబడెను.

"అదుగో విన్నారా! సుశీలని ఆ చనిపోయిన పతివ్రత కాపా డింది. మన అమ్మాయిని ఆమె దీవించింది." అని కమల యనెను.

ఇంతలో బాజాలధ్వనులు వినవచ్చెను. పరుగునబోయి రావు సుశీల నెత్తుకొని ముద్దులాడుచు కమలతో బయటకు వచ్చెను. ఉత్సవ ముతో నా పతివ్రతను స్మశానమునకు తీసికొని వెళ్లుచుండిరి.

"అదిగో చీర్ప! పెద్దమ్మ! దండం పెట్టు!" అని సదాశివరావు సుశీలచే నా పతివ్రితా కళేబరమునకు నమస్కారము చేయించెను.

కమల శిరమువంచి "అక్కా! నమస్కార" మనెను.



# కారణమేది?—ప్రేమయా? దేశభక్తియా?



౧

"శకుంతలా!" కంఠమున హారము, చెవులకు కమ్మలు, చేతులకు గాజులు తప్ప వేరే భూషణము లాభరణములుగాని పిలుపునకు తలుపు తెరచిన—శకుంతల ధరించియుండలేదు.

మాధవరావు లోన బ్రవేశించెను. శకుంతల ద్వారముల బంధించి వాకిటనున్న తులసికోట కడకేగి దీపమును వెలిగించి నిశ్చలభక్తితో తులసిని పూజించెను. మాధవరావు ఒకింతదూర మారమునున్న తిన్నెపై విషణ్ణవదనముతో దీర్ఘాలోచనచేయుచు కూరుచుండెను.

శకుంతల అటుల తులసికడ పదునైదు నిముసములు కూరుచుండి పూజనలిపి ప్రదక్షిణ మొనరించి వంటయింటి కేగెను. మూడేండ్ల బాలుడగు గంగాధరుడు మాధవుని ప్రక్కకూరుచుండి ముద్దుపలుకుల పల్కుచుండెను. మాధవుని దృష్టి వికసిత పుష్పమువలె కలకల లాడుచున్న ఆచిన్నిపాపని సుందరవదనముపై నుండెను. అట్లు చూచుచుండిన ఆతని కనులేలనో జొటజొట అశ్రువులరాల్చెను.

౨

పసిపాప! "అమ్మా!" యని యేడువదొడంగెను. వంటయింట నున్న శకుంతల "నాయనా! మామ దగ్గరకువెళ్లు; పనికాగానే వస్తా" అని యనెను. కన్నీటని తుడుచుకొని కుర్రని యొడిలో తీసికొని మాధ

వరావు గాలిలో నెగురుచున్న పక్షులజూపుచు బుజ్జగింప నారంభించెను. దీనినిబట్టి శకుంతల మాధవుని చెల్లెలనియు పసిబిడ్డడు ఆమె పుత్రుడని యు చదువరులు గ్రహించెదరుగాక.

అప్పటికే యెనిమిది దాటినది. శకుంతల పాదప్రక్షాళనకై నీళ్లుంచి భోజనమునకు లేవవలసినదని అన్నను రెండుమారులు పిలచినది. మాధవరావు మాత్రము భోజనమునకు లేవలేదు. శకుంతల వెండిగిన్నె లో కొంచెమన్న మిడికొని మామ చెంతనున్న కొమరునకు తినిపింప వచ్చెను. బిడ్డను చంకనిడుకొని ఆతడాడు ముద్దుమాటల కన్నిటికిని సరి యగు సమాధానముల నొసగుచు యెటులో యొకలాగున అన్నము తిని పించుచుండెను. అసమయమున శకుంతల అన్నవైపు చూపుచు "నాయ నా! పరే, మామ నీకు మంచి చొక్కా, లాగు, కుట్టిస్తాడు; నాన్నగా రొచ్చాక అవితొడుక్కొని డబ్బులు యిమ్మని అడుగు" అని కొమరు నితో ననెను.

చంకనున్న బిడ్డడు ఒక చేతితో తల గోకికొనుచు రెండవచేతిని చాచి మాధవరావును చూపించుచు "అమ్మా! మామ యేలుత్తున్నాలే" అనెను. శకుంతల అన్నవైపు తిరిగెను. మాధవునికంటినుండి రెండు మూడు కన్నీటి బిందువులు రాలుటను యెదుటనున్న దీపకాంతిలో నామె గుర్తించెను. "ఏమి అన్నయ్యా!" అని శకుంతల బ్రశ్నించెను.

మాధవరావు చేతనున్న వార్తాపత్రికను మడచుచు కనుల తుడు చుకొని చిరునవ్వు తెచ్చుకొని "ఏమి లేదమ్మా" అనుచు తిన్నెనుండి లేచి తన కన్నీటిని గమనించి తల్లితో ఫిర్యాదు చేసిన చిన్నిపాపని పాల బుగ్గల ముద్దాడి శిరము మూర్కొని భోజనమునకు సిద్ధమౌటకు లోని కేగెను.

3

అది మండు వేసవి. శకుంతల కొబ్బరి బొండము నీళ్ళను కొమరు ని దేహమునకు వ్రాయుచుండెను. వార్తాపత్రికను చదువుచు పడక

కుర్చీయందే మాధవరావు నిద్రించుచుండెను. ఇంతలో తలుపు నెవ్వరో తట్టినట్లాయెను.

శకుంతల "అన్నయ్యా! అన్నయ్యా!" అని రెండు మారులు బిలచెను. మాధవరావు నిద్దుర మేల్కొని ద్వారమును తెరచెను. సర్కిలు యిన్స్పెక్టరు పాచ్చాసాహెబు యిరువురు పోలీసుభటులతో గృహములోనికి వచ్చెను. పరాయివారు వచ్చుటనుజూచిన శకుంతల ప్రక్క గదిలోని కేగెను.

ఆ వచ్చినవారలకు మాధవరావు ఉచితాసనముల నొసగి పాచ్చాసాహెబును వచ్చినపని యేమియో చెప్పవలసినదిగ యడిగెను.

ఇనిస్పెక్టరు వెంటనే ప్రత్యుత్తరమీయలేదు. పిల్లిగడ్డమును సవరించుకొనుచు యిలునలు వంకలకును దృష్టిని పోనిచ్చి కొంతసేపైన యనంతరము "మీరు చాలాపెద్ద మనుష్యులు. ఒక్క కేసు సందర్భమున మీవద్దకు వచ్చి యున్నాను." అని బలికెను.

"కేసా? ఏమది?" అని ఆశ్చర్యమును జూపుచు మాధవరావు బలికెను. అంతవరకును పరధ్యాహ్నముగనున్న శకుంతలకూడ కేసనుమాట చెవిని బడగనే యుంచుక శ్రద్ధగ ఆగదినుండియే వినజొచ్చెను.

"ఈమధ్యజరిగిన మెయిలు పెట్టెదోపిడి గురించి మీరు పత్రికల మూలమున నెరింగియే యుందురనుకొనియెదను" అని యినస్పెక్టరారంభించెను.

"ఎరుగుదు"ననిమాధవరావు ప్రత్యుత్తరమొసగెను. "అటుతరువాత పిఠాపురమునందు మిషనరీ యింట జరిగిన దొంగతనము విషయము?——" "ఆవిషయముకూడ వార్తాపత్రికలయందు నేను చదివితిని" అని రావు బదులుచెప్పెను.

"ఇంక మొన్నటిదినమున మెమిలీదొరసాని ఉంగరము దొంగిలింపబడుటను గురించి మీరెరుగుదురా?" అని పాచ్చాసాహెబు ప్రశ్నించెను.

«దానినిగురించికూడను నేను పత్రికలలోననే చదివియుంటిని» అని మాధవరావు బలికెను.

తరువాత పాచ్చాసాహెబు తన తెలివితేటల నుపయోగించుచు మాటలాడ మొదలుపెట్టెను.

«మాధవరావుగారు! మీరు చాల పెద్దమనుష్యులు, గౌరవకుటుంబములో జన్మించినవారు. అప్పటికి మీరు చిన్నవారు కాని, మీనాయనగారికిని నాకును యెంతయో మిత్రత్వముండెడిది.» అని యినస్పెక్టరు మాటలు కొంతసేపు మానివేసి. «మైగురంతము» నాచరించుచున్నది బందిపోటుదొంగలు కాదని రూఢియైనది. అదియొక విప్లవకారుల సంఘమనికూడ నేను కూపీతీసియుంటిని. ఆసంఘముపేరు «భారతమేళ» ఈ సంఘమువారినందరిని మేము నిన్నటిదినముననే అరెస్టు చేసియుంటిమి. నేటి సాయంకాలముననో లేక రేపటికో ఖైదీలందరును యీ నగరముకు తీసికొని రాబడుదురు. ఈ సంఘమునందు మీబావమరది శివరావుగారుకూడ సభ్యులు. వీరినికూడ అరెస్టు చేసియున్నాము.»

«ఏమి!—మా బావను కూడా అరెస్టు చేశారా!» అని తొందరగా ముమ్మారు మాధవుడు బలికెను.

ఐదు నిముసముల వరకును అతని నోట మాటరాలేదు. మాధవరావు ఆశ్చర్య దృక్కుల రెప్పయైన వేయకుండ ఐదు నిముసములు బరపెను. మరల పోలీసు అధికారి ఆరంభించెను.

«అంతటితోనే గాదు, మీ బావయే యీ విప్లవకారసంఘమునకు నాయకుడని కూడ తెలియుచున్నది. మొదటి రెండు దురంతరములు వీరే గావించి యుండిరని కూడ యీ యెమిలీఉంగరము దొంగతనము బట్టి తెలియుచున్నది.

ఈ సందర్భమున మీరు చాల శ్రద్ధగ పనిచేయ వలయును. మీకు తెలిసిన విషయముల నన్నింటిని మాకెరింగింపవలయును. దీనివలన ఆయనకు శిక్ష విధింపబడునని తలంతురు కాబోలు! శిక్ష పడుట

మాత్రము తప్పదు; మీరు వివరములను తెలిపిన యెడల మాత్రము అంత కఠినముగ శిక్ష వేయరు. అట్లుగాక అంతటిని మరుగు పరచితిరా యింక నేమియు లాభముండదు. ఏ ద్వీపాంతర వాసమో పాపము ఆ యనకు సిద్ధించును. ఇది మీరు బాగుగ ఆలోచింపుడు! మీ బావను రక్షించుకొను భారము మీ మీద నున్నది. ఇక్కడ యెక్కువసేపు ఉండుటకు వీలులేదు. మరల రేపటి యుదయము వచ్చి కలసికొనెదను" అని యనుచు పాచ్ఛా సాహెబు బయలుదేరి వెళ్లెను.

ఈ సంభాషణనంతటిని నాలించిన శకుంతల ప్రతిమవలె నాయెను. లేచి లోనికేగుటకేనియు మాధవుని గాళ్ళాడలేదు.

౪

విప్లవకార సంఘనాయకుడగు శివరావుగురించి కొంచము యిక్కడ చెప్పవలసియున్నది.

శివరావు నిరుపేద. అందులకుతోడు ఆతనికి తల్లిదండ్రులుగాని నా యనుచుట్టములుగాని లేరు. నీడలేని యీబాలుని మాధవరావు,తన తండ్రి మరణానంతరము గృహమున నుంచుకొని పాఠశాలకంప నారంభించెను. శివరావు అందమునను తెలివితేటలయందునను తనతోడి విద్యార్థులయందు పేరుగాంచియుండెను. ఆతడు సరిగ ప్రతివత్సరము ఒక్కొక తరగతియందునను కృతార్థుడగుచు బియ్యే తరగతికి వచ్చెను.

శివరావుయొక్క సుందరమూర్తిని నిరతమును గాంచుచువచ్చిన శకుంతల తన హృదయమున అనురాగవల్లికల బెంచినది. చెల్లెలిసౌఖ్యమే తనసౌఖ్యముగ భావించు బ్రహ్మచారియగు మాధవరావు దీనినిగాంచి శకుంతలను శివరావునకిచ్చి వివాహము గావించెను. వీరిరువురి బిడ్డయే ముద్దుల గంగాధరుడు.

మాధవరావు నెంతయో మంది వివాహమాడవలసినదని ప్రోద్బలము జేసియుండిరి. కాని సాధువర్తనుడగు మాధవుడు «నాకేమికొదువ చెప్పండి? ఇంట సౌఖ్యంగా కాలంగడుపుతూవున్న చెల్లెలు, బావ,

వున్నారు. ఇంక బిడ్డల ముచ్చటంటారా. మాచిన్ని గంగాధరం ఉండనే వున్నాడు కావలసినంత అల్లరిచేస్తూ మమ్మల్ని ఆడించడానికి" అని యనుచుండెడివాడు.

ఇంక శివరావుసంగతి—శివరావు బియ్యే తరగతి చదువుచున్న సమయమున దేశమున రాజకీయాందోళన ఉదయించెను. వైద్యులు, న్యాయవాదులు, గుమస్తాలు, వర్తకులు- అందరును రాజకీయాందోళన గావింప నారంభించిరి. దీనితో అనేక రాజకీయపక్షములు బయలుదేరినవి. కొంతమంది ప్రభుత్వమువారి యండజేరి వారలకడనుండియే వెష్టవాలయ ప్రసాదములవలె కొద్దికొద్దిగ సంగ్రహించుచు మన్నుదిను పాముచురుకుతో పోవుదమని నిశ్చయించుకొనిరి. మరికొంతమంది ప్రభుత్వముతో సఖ్యతవహించుటవలన లాభములేదు, యీ నూటయేబదివత్సరములు అనుభవమే యిందులకు తార్కాణము, మొదరాడి ప్రతిఘటనల గావింపుచు దేశమును మనవైపునకు త్రిప్పుకొనవలె ననిరి. సలసల గాగుచున్న ఉష్ణరక్తముగలవారు ప్రక్కలో బల్లెమైయున్న ఐర్లాండు యెంతయో కాలమునుండి మాకు స్వపరిపాలన నొసగుడని మొఱ్ఱబెట్ట, వీరు ఱుంచుకేనియు ప్రసాదించి యుండలేదు, అందువలన యీ మూతిముడుచుటతోగాని, వారి యండజేరి పలుకు చిలుకపలుకులతోగాని యేమియు లాభముండదు కనుక స్వయముగ మనమందరము కత్తికటారుల సిద్ధముచేసికొని తిరుగబడవలయును, అని యనుకొనిరి.

రాజకీయ సంబంధములగు తుపానులు ఆదినములలో ఘోరమగు పెనుశబ్దములతో వీవనారంభించెను. ముందు వెనుక లారయజాలని యువకులు మొండిధైర్యముతో కసరత్తులచేయ నారంభించిరి. విద్యార్థుల క్లబ్బులయందు కత్తిసాములు, గరిడీవిద్యలు ప్రారంభమైనవి. ప్రత్యేక క్రీడాసంఘములైన యీక్లబ్బులయందలి విద్యార్థులను పోలీసువారు బెదరింపలేక యుండిరి.

ఒక వత్సరపు ప్రయత్నముల ఫలితముగ కొంతమంది యువకులు ఆరితేరిరి. ఒక్కొక్కడును కరప్రిట్టుకొనిన తొంబదిమందినైనను నిలువబెట్టగల శక్తుల నార్జించియుండిరి.

ఈ యువకుల కందరికిని సలహాల నొసగునది శివరావు. శివరావు యీ రహస్య ప్రధానవిప్లవ సంఘముయొక్క అధ్యక్షుఁడు. సంఘము పేరు “భారత మేళ.” శివరావుయొక్క మారుపేరు మహాంతు. అక్కడక్కడ పదునాల్గు శాఖాసంఘములు ఆ జిల్లాయందు స్థాపింపఁబడినవి. పదునాల్గు సంఘముల నాయకులును మారుపేరు పెట్టుకొనిరి. ఒక్కొక సభ్యునకును ఇరువురకన్న నెక్కువమంది తెలియకుండునలాగున శివరావు కడుచమత్కారముగ కొన్ని కట్టుదిట్టముల గావించెను. ఇంక అక్కడక్కడ పాడుపడియున్న గృహములు వీరి రహస్యసమావేశ స్థానములైనవి.

అంతయును సిద్ధమైనది. ఇంక అన్యదేశములనుండి రహస్యముగ తుపాకుల దెప్పించుటకు ధనము కావలసియుండెను. రూపాయవస్తువు నాల్గురూపాయలగునని శివరా వెరుగును. జర్మనీయం దెంతయోకాలమునుండి కమ్యూనిస్టుపత్రిక నొకదానిని నడపుచుండిన వంగదేశీయులగు సచీంద్ర చంద్రరాయికి వ్రాసి అంతయు శివరావు సిద్ధముగావించెను. ఇంక యెటుచూచినను ధనలోప మొక్కటి యున్నది.

శివరావు శాఖాసంఘనాయకుల నందరను ఒకనాటిరేయి సమావేశముగావించి ప్రస్తుతము తన కార్యక్రమమును నెరవేర్చుటకుగల ధనలోపమునుగూర్చి చెప్పుచు దేశసేవ మొనరించుటకై దొంగతనము చేయవచ్చుననియు, అందులకు తామందరును పూరుకొనవలెననియు తీవ్రకంఠముతో నొక్కినొక్కి చెప్పెను.

సహచరులందరును ఆతని సలహా నంగీకరించిరి. సంఘమువారు ఒక నెలదినములలో పదునైదు దొంగతనములు గావించిరి. ఈ జాపితాలోచేరినదే యీయెమిలీ దొరసాని ఉంగరపు దొంగతనము; ఆసందర్భముననే పదునలువురు పట్టుపడిరి.

౫

దినదినమును కోర్టు కిటకిట లాడుచుండెను. గ్రామ గ్రామముల నుండియు ప్రజలు విప్లవకారకుల గాంచుటకు యెక్కువయెక్కువగ వచ్చుచుండిరి. సంకెళ్లను ధరించి యుండిన ఆయువకు లేమిచేయుదురో యనుభయమున కాబోలు న్యాయాధికారి గజము గజమునకు ఒక్కపోలిసుభటుని నిలువబెంచెను.

మాధవరావు సాయంకాలము యథావిధిగ గృహముచేరెను. మామూలుగ ఆగృహమున నుండెడి యానందము యిప్పుడులేదు. శకుంతల దినదినమునకును శుష్కించుచుండెను. మాధవుడు, ముద్దుమేనల్లునితో యిప్పుడు ఆడుట మానెను. అతడు చెల్లెలగు శకుంతల మోముగాంచి అశ్రువుల రాల్పని దినముగాని గడియగానిలేదు.

మనసార ప్రేమించిన శకుంతల భర్తయగు శివరావు లేకుండ జీవింపలేదు. తనకంఠమున ప్రాణమున్నంతవరకును శకుంతల దుఃఖించుట యన మాధవరా వెంతమాత్రము నొల్లడు. తాను జీవములతో నుండుట కాదు. తాను పుట్టుటయే శకుంతల సౌఖ్యవంతముగ జేయుటకని ఆతడు నిరతమును తలచుచుండును.

మాధవుడు కుర్చీయందు అవనత వదనముతో కూరుచుండెను. శకుంతల వచ్చి ప్రక్కనే కూరుచుండి "అన్నయ్యా! నువ్వు యేవిషయమూ చెప్పకుండా వున్నావు! నాకు దుఃఖము గలుగుచున్నది. మీ బావతోపాటు వాళ్ల నందరిని వదిలేశారట. నేరమంతా ఆయనమీదనే పడ్డదట! నిజమేనా?" అని కన్నీటి ధారల నడుమ గద్గదకంఠముతో బలికెను.

మాధవరావు యింతకాలమును ఓరిమితో నుండెను గాని యీ సమయమునమాత్రము మాత దూరకొనజాలడాయెను. స్త్రీవలె నాతడును పై కేడ్చుచు చెల్లెను దరికిదీసికొని "అమ్మా! నేను పాపాత్ముడను.

ఏమి చెయ్యడానికీ కాళ్ళురావు. దారికనబడదు. నీవు దుఃఖిస్తావని, నిజా న్ని యింతవరకూ దాచి అట్టేపెట్టెను.” అని పలికెను.

“భారతమేళమునకు నాయకుడైన శివరావుమీద అంతభార మూ పడ్డది. మిగతవాళ్ళని జరిమానాతో వొదిలేశారు. బావకి—” అని యింకను యేమియో చెప్ప నుంకించెను కాని ఆతని కంఠమునుండి మాటరాదాయెను. చెల్లెలి శిరమంతయు ఆతని యుష్ణాశ్రులుతడిపివై చినవి.

శకుంతల హృదయమున ఆతురత యెక్కుడాయెను. “బావ కేమి ఔతుంది? బావకేమౌతుంది? అన్నయ్యా! చెప్పవు?” అని మాధవు నామెతొందరచేసెను.

మాధవుడు పదినిముసములు ప్రయత్నించిన యనంతరము మా టలాడ గలిగెను.

“అమ్మా! రేపు తీర్పు చెపుతారు. ఎలావుందో నాకేమి తోచ డములేదు.” అని యనెను.

“ఇంక నాదీప మారిపోవడమేనా? అన్నయ్యా! దారియేదీ లేదా! దారియేదీ లేదా!” అనుచు పాపము శకుంతల అన్నయొడిలో సొమ్మసి ల్లి తుత్రించివైచిన లేగులాబివలె వాలెను.

౬

ఉదయముపదిగంటలైనది. మాధవుడు యేదియో ఆలోచించుచు ఒక అరగంటకాలము తన గదియందుపచారుచేసెను. అతని మోమును దిలకించినవారు హృదయ మెంతగనో పనిచేయుచున్నదని గుర్తింప గల రు. అటుల తిరుగుచు తుదకాతడు తనలో తాను నవ్వుకొనుచు “అమ్మా! శకుంతలా” అని పిలచెను. సంతత ధారగా కన్నీటిని గురి యించుచున్న శకుంతల శోకరసాధి దేవతవలె ప్రత్యక్షమయ్యెను. ఆమె దుఃఖవదనమును గాంచిన మాధవుని హృదయము గొడ్డలివేటు తినిన మొండు మోడువలె తునియలయ్యెను. మరల నాతడు హృదయము

చిక్కబట్టెను. శకుంతల చంకనున్న గంగాధరుని చేతులలోనికి దీసికొని చెక్కిళ్ళుముద్దులతో గప్పుచు వెర్రిసంతోషమును ప్రదర్శించు గంతులు వేయుచు "నాన్న వస్తే, గంగా? నువ్వే రాజాలాగు చంకయెక్కి దిగకే" అనుచు చేరువ బీరువాకడకేగి "బాబా! అమ్మకిచ్చి మిఠాయికొని పెట్టుమను" అనుచు ఒక చిన్న సంచితో రూపాయలనా బాలునికొసగి మరల తా నాబిడ్డను మనసార ముద్దిడి శకుంతలకొసగెను.

శకుంతల, కురరీడువేయు ప్రశ్నలకు సమాధానము చెప్పుటలేదు ఆతడు యెడమచేతితో మోముపై గొట్టుచుండినను ఒక్కమారేనియు మందలించుటలేదు. చంద్రికాంత శిలాప్రతిమవలె శకుంతల కన్నీళ్లు రాల్చుచుండెను.

ఇంక ఆలసించుటకు వీలులేదని మాధవుడు తనలో తానసుకొని యెను. తోబుట్టిన శకుంతలను చేతులలోనికి తీసికొని "నీకువచ్చిన భయమేమీలేదమ్మా! ఎందులకేడుస్తావు? బావ తిరిగివచ్చే భారంనాది. మూడుగంటల కిక్కడుండేలాగు చేస్తా" ననుచు ఆమె శిరమున ముద్దిడి కడివెడు కన్నీళ్ళ నామె శిరమున గురిపించి ధైర్యముచెప్పి న్యాయస్థానమునకు బయలుదేరెను.

౭

న్యాయస్థానముకడ నొక తీర్థమున్నట్లున్నది. లోని తావంతయు నిండిపోవుటవలన కోర్టు ఆవరణయంతయుకూడ జనులతో కిటకిటలాడుచున్నది. విద్యార్థులు పాఠశాల కేగ మాని కోటగోడలపై నెక్కి గుసగుసలాడుచుండిరి.

మాధవరావు కోటలోని కేగుచుండెను. ఆతని జూచినవారు శివరావుబావ యని గుస గుస లాడుకొనిరి. శివరావు న్యాయస్థానమును బ్రవేశించెను. ఆతని దృష్టి బోనులో అవనత వదనముతో నిలచియుండిన శివరావుపై బడెను.

శివరావు ఒక్కమారు దృష్టిని బావపై బోనిచ్చి కనుల నీళ్ళు నింపుకొని మరల శిరమును వంచుకొనియెను. ఆసమయమున నాతనిగాంచిన ప్రతిమానవుని హృదయము మంచువలె కరిగిపోయినది. కాని న్యాయాధికారిమాత్రము గాంభీర్యదృక్కుల ధరించియుండెను.

న్యాయాధికారి "శివరావు ! నిన్ను ఎమిలీదొరసాని ఉంగరము దొంగిలింపబడు సందర్భమున విచారించితిమి. నీవు నేరమును గాంచితివ నుటకు నీఉంగరము నమ్మునటకు తీసికొనిపోవుటయే సాక్ష్యమిచ్చుచున్న ది" అని యనుచుండెను.

ఇంతలో మాధవరావు ముందునకువచ్చెను. ప్రేక్షకులందరును యేమిజరుగునో యని చూచుచుండిరి. పోలీసుశ్యాషను యిన్ స్పెక్టరు భయమున రివాల్వరుమీదకు చేతిని పోనిచ్చెను. పోలీసుభటులు తుపాకులనించుక కదలించిరి.

దీని నంతటిని గాంచిన మాధవరావు చిరునవ్వు నొకదానిని వెలిబుచ్చి "నేను యీసమయమున చెప్పవలసినది కలదు. లేకున్న న్యాయాధికారి న్యాయము నొసగజాలని వాడని ప్రజలు యికముందు చెప్పుకొనుటకు కారణమగును" అని న్యాయాధికారితో పలికెను.

న్యాయాధికారి మోమెర్రవారెను. "ఏమది ? చెప్పుము?" అని యాతడురిమెను.

మాధవరావుబోనులోనికేగి బావయగు శివరావు ప్రక్కనిలచెను అక్కడ సమావేశమైనవారందరును నిశ్శబ్దముగ నుండిరి. శివరావున కేమియు తోచుటలేదు. మాధవరావుమాటలాడుట కారంభించెను—

"దొంగ యెన్నడును తాను దొంగిలించిన వస్తువును తానే కొనిపోయి అమ్మడు. ఆ ఉంగరమును దొంగిలించినది నేను, నాబావయగు శివరావునకు దీని నిచ్చి అమ్మవలసినదని నేనేపంపితిని. ఆతనిని మీరే దొంగగపట్టుకొంటిరి."

ఈ మాటల వినిన వారందరును నిద్దురనుపోగొట్టుకొనువారివలె తలల నూపి కనులు విప్పిచూడ నారంభించిరి. ఇంతవరకును పదునాల్గురిలో యెవ్వ రాయుంగరమును తన వ్రేలినుండి తీసిరో చెప్పలజాలక యుండినఎమిలీదొరసాని గానుసర్దుకొనుచు ముందునకువచ్చి " ఆ ! ఇప్పుడు

గుర్తు పట్టగలుగుచున్నాను. ఇతడేదొంగ” అనిమాధవుని వైపు చూచెను.

అక్కడనున్న బుద్ధిమంతు లందరును మేలనో నవ్విరి.

* * * * *

సదాశివము కొయ్యబారెను. వంచినశిరమువంచినట్లెయుండెను ఆతనిచేతి సంకెళ్ళు తీసి బావయగు మాధవునకు తగిలింపబడిన వనుసంగతి అతడు గుర్తించలేదు. పోలీసు భటుడు బోనునుండి ఆతనిని నడపించి ప్రక్కకుర్చీలో కూర్చుండబెట్టెను.

* * * * *

న్యాయాధికారి మాధవరావునకు పదునైదు వత్సరముల ద్వీపాంతర వాసశిక్ష విధించెను. ప్రజలందరును కంట తడిబెట్టిరి.

* * * * *

మాధవరావును పోలీసుభటులు బయటకు తీసికొని వెళ్లుచుండిరి. ఆతని సంకెళ్లధ్వని వినిన శివరావునకు స్పృహవచ్చెను. ఖైదీగా కొనిపోబడుచున్న మాధవు నాతడు గాంచెను. పెదవులు కదలలేదు. కనులు రెప్పల నాడించలేదు. పదములు మాత్రము శివరావును మాధవునికడకు గొనిపోయెను.

మాధవుని మోమును దిలకించిన ఆతనిగుండియలు వ్రక్కలయ్యెను. దుఃఖము నాపుకొనజాలక “బావా! ఇదియేమి! నిర్దోషివి! నీవేల యిట్లు మధ్యనువచ్చి నేరమును నీపై వేసికొంటివి. ఈపాపము నాది కదా!” అని యనుచు పాదములపైబడి విలపించెను.

మాధవునిహృదయమః చెదురలేదు. వదనము నిండుకళల వెలిగ్రక్కుచుండెను. శివరావును లేవనెత్తుచు నెమ్మదిగ “తెలివితక్కువగ సంచరింపకుము. నీవు తిన్నగ యింటికేగుము. నాచెల్లెలిని బాగుగాచూడుము.” అని యనుచు పోలీసుభటులతో రైలునెక్కెను. శివరావు హృదయభారముతో గృహాభిముఖుడాయెను.

శకుంతల ద్వారము తెరచుకొని కూరుచుండెను. మూడు గంటలసరమైనది. అన్న చెప్పిన మూడుగంటల గడువు దాటినది. భర్త వచ్చు జాడలు కనబడుటలేదు. ఆమెహృదయమున నేదియో పెద్ద సమ్మెట దెబ్బ పడినట్లాయెను. నిముసనిముసమునకును ఆసలు నిరాసలగుచుండెను. కాని ఆమెకు అన్నమాటయెడ నమ్మకమున్నది. కొమరుని గంగాధరుని యెత్తుకొని "నాయనా! మీనాన్నగారు వస్తారా చెప్పు?" అని అడుగ నారంభించెను.

బాలుడు చేతులనాడించుచు "నాన్నవస్తారు, మిఠాయి తెస్తారు" అని యనెను.

శకుంతల కొకించుక ఆస జనించెను. కొమరుని గాఢాలింగనము గావించుకొనెను.

ఇంతలో మరల బాలుడు "నాన్నా!" అని కేకవేసెను. శకుంతల తిరిగిచూచెను. శివరావు అవనతవదనముతో వచ్చుటను గాంచెను.

శకుంతల సంతోషము కొండ యందుకొనెను. పరుగున బోయి భర్తను జేరి లోనికి గొనివచ్చి ఆనంద బాష్పముల గురియించెను.

శివరావు మాత్రము మౌనమునే వహించెను. నీరసమువలన మాటలాడ లేకుండెనని శకుంతల వేవేగ వంటచేయ నారంభించెను.

* * * * *

రాత్రి యెనిమిదిగంట లాయెను. ఎన్నిమారులు లేవమనినను భర్త భోజనమునకు లేవడాయెను. మంచముపై నాతడు పరుండెను. శకుంతల తండ్రిని లేవవలసినదని చిన్నికొమరు నంపెను.

తప్పటడుగులు వైచుచు బాలుడు మంచము కడకేగి కొంచెము సే పాగెను. అతడు తరువాత "అమ్మా!" నాన్న యేలుత్తున్నారే! బువ్వ బెత్తు!" అని కేకవేసెను.

దానితో శివరావు బోరున యేడువ దొడగెను. గుండె చేతబట్టుకొని శకుంతల భర్తకడకు వచ్చి "యేమి! యేమి!" యని ప్రశ్నించెను.

చెప్పక తప్పదని తుదకు శివరావు బోరున యేడ్చుచు "బావ-నాకొరకును- నీకొరకును- భారమును తనపై వేసికొన్నాడు. ద్వీపాంతరము——" అని గద్గద కంఠముతో నాతడాగెను.

"ఆ! అన్నయే!" అని రెండుమారులు కనులవిప్పి చూచి-, పలికి-, ఒడలు తెలియకుండ శకుంతల నేల వ్రాలెను.



# "ఈతడు నా భర్తయా?"



నా విషాద చరిత్ర నిటవ్రాసి పాఠకమహాశయుల హృదయముల విచారసాగరమునకీడ్వ నాకెంతమాత్రమును యిష్టములేదు. కాని మిత్రులలో చాలమంది నాగతజీవితమునుగూర్చి తెలుపవలసినదని యెన్నియో మారులడుగుటవలన యింక చెప్పకయుండుట మర్యాదగాదని యిట వ్రాయుట కారంభించితిని.

నా గురించి నేను యిపుడు పరలోకముననున్న నాతల్లి శైశవము తెలిపిన చరిత్రయందలి సారాంశమును మీ కెరింగించుట కొంచము మంచిదని తలంచి దాని నిచ్చట పొందుపరచుచున్నాను.

మానాయనగారు యిరువదియైదురూపాయల జీతముపై యుద్యోగము చేయుచుండెడివారు. పట్టణముననున్న మాంకా కొలది వేతనము సరిపోయెడిదికాదు. నాపెద్దతండ్రి మాకుండినకొలది భూమినియమ్మి ఆ ధనముతోడను - తమ్ముడైనను - మానాయనగారి సహాయముతోడను చదువు పూర్తిగావించి పెద్దయుద్యోగములోన బ్రవేశించిరి.........

మానాయనగారకస్మాత్తుగా శయ్యాగతులైరి. రెండునెలలట్లులే మంచముపై పడియుండిరి. వైద్యులతృష్ణను దీర్చుటకై మాయమ్మకడను, నాకడను గల కొలదినగలును అమ్మబడినవి. ఇంక ఒకదినమేనియు గడపుటకు వీలులేకయుండెను. మానాయనగారు పొరుగుననున్న యువకుని నొకనినిరప్పించి, మాయమ్మవలదని యెంతచెప్పినను వినకుండ అన్నగారికి, తనకు ధనసహాయము చేయవలసినదిగ రెండుత్తరములవ్రాయించి చాల కష్టముపై వణకుతో సంతకములుచేసి పంపిరి. మొదటియుత్తరమున కెట్టిజవాబునురాలేదు. ఇందులకు మాయమ్మ చాలకష్టపడెను. ఎంతయో యవమానింపబడిన యట్లామె నొచ్చుకొనెను. రెండవయుత్తరమునకుబదులుగ మాపెదనాయనకడనుండి తనకువచ్చు రాబడి తన ఖర్చులకే యేమాత్రమును సరిపోవుటలేదనియు, అదియుగాక అనవసరమగు ఖర్చులెన్నియో ఆమాసమున తనకుగలుగుటవలన నాతడైదు రూపాయలకన్న నెక్కుడంపజాలననియువ్రాయుచు నొక మనియార్డరు పంపెను. మాయమ్మ కోపమింతింతగాదు. వెంటనే దానిని త్రిప్పివేయవలసినదిగ యెంతయోపట్టుపట్టెను. కాని మంచియొనరించినను చెడ్డయొనరించినను అన్న నెన్నియోవిధముల పొగడుచుండు మా నాయన అమ్మను మందలించి మరల మాపొరుగుయింటి విద్యార్థినిరప్పించి అన్న అంపిన మనియార్డరు చేరినదనియు, అందులకు తానెంతయు ముదితుడైనట్లును దీనికి పదిరెట్లు తానిచ్చినప్పటికిని ఋణము తీరదనియు నెన్నియో గౌరవవాక్యములతో నొక జాబును వెంటనే వ్రాయించిరి. మానాయనగారికి బ్రతుకుపై అధైర్యముగలిగెను. ఇంకెంతయో కాలము తాను జీవింపజాలనని యనుచుండెడివారు, డాక్టరుగారికి వైద్యమొనరించినందులకు నూటయిరువదిరూపాయ లియ్యవలసియుండెను. మా యమ్మకడ నొక కానీనియులేదు, కడకు మాకీ ప్రపంచమున నీడ నొసగుటకై యున్న గృహము తప్ప వేరేమియు మిగులలేదు. మాయయ్య

యెంత వలదని చెప్పినను అమ్మ వినలేదు. ఆమె దుఃఖ మెక్కుడాయెను. రెండు దినములు ప్రయత్నించి మూడవ దినమున మా చిన్నిగృహము నైదువందల రూపాయల కమ్మివైచెను.................ఎంతటి శ్రమలబడినను, యెన్ని దైవములకు మ్రొక్కులిడినను, యెన్నిమారు లు—అనేక సుగుణములున్న యట్లుగ పెక్కు పేర్లబిలువబడుటకు దగ్గ సుగుణములుగల్గి, మానవకష్ట పరంపరల నొత్తిగించుటకు దగ్గ శక్తిగల్గి, సతతము తనచే సృష్టింపబడిన జీవములకు సౌఖ్యము లొనగూర్పగల య ధికారముగల్గి—మానవుల మంచిచెడ్డల గమనించగల మహత్తరశక్తి యు విజ్ఞానమును గల్గియున్న యొక వ్యక్తి లేని సమయమున—‘భగవం తుడా! ఆపద్బాంధవా!! దీనపోషకా!!!’ యున్న గాగల నోరువట్టని నోరు తిరుగని పెద్దపెద్ద పదముల వందలకొలదిగను వేలకొలదిగను గల్పించి పిచ్చి నమ్మకములతో మనస్సునంతను ఆకారములేని, యెన్న డును చూచి యెరుగని—దివ్యతేజము కలదిగభావించి— భగవంతుడా యని నోరారిపోవులాగున మాయమ్మ పిలిచినను మా నాయనగారు మాకు దక్కరైరి.

౨

మా యమ్మకును నాకును యింక నిలువనీడయేది? పెదతండ్రి మావంక మోము చూపనైన చూపడాయెను. మాయమ్మకు తోడబు ట్టినవారెవ్వరును యీ ప్రపంచమున లేరు. ఉండినను సమయమునకు సహాయము చేతురను నమ్మకము కూడ నాకు లేదు. చెప్పుకొనుటకు చాల విచారమగుచున్నది! ఐనను నా విషాద చరిత్రను తెలుప ప్రారం భించితినిగాన మధ్యకొన్ని యంశములనేనేలదాచవలయును? అన్నింటిని సవిస్తరముగ చెప్పివైచెదను. ఇంటనున్న బిందెలు, చెంబులు మున్న గువాటి నన్నింటిని దయగల యిరుగుపొరుగువారల కమ్మివైచితిమి.

ఐనను దాన లభించినధన మెంత కాలమువరకు వచ్చును? తుదకు

నూతనముగ వట్టాబుచ్చుకొనిన యొక న్యాయవాదికి మాపై జాలి గలిగెను.

ఈయన యువకులు; పేరు మాధవరావు, మాధవరావు విద్యార్థిగ నున్నదినములో మా నాయనకడ విద్యనభ్యసించెను. అందువలన నీయన మా యెడల జాలివహించి తన గృహమునకు మమ్ముల దీసికొని వెళ్లెను.

3

నేను బాలుడనో బాలికనో యింతవరకును పాఠక మహాశయులకు తెలుప మరచితిని, ఏదియైననేమి, కడకదియే బయటబడును; కాన యిక్కడ మరల నేను బాలుడననియో బాలికననియో యేలజెప్పవలయును? అది యనవసరము.

నాయంత నేను పొగడుకొను చున్నానని మాత్రము మీరనుకొనవలదు. ఇదినిజము, ఇట్లంతయు వ్రాయుటకు నేను సిగ్గిలుచున్నాను. కాని చెప్పక తప్పదు. లేకున్న కలదాని నంతటిని మీ యెదుట బెట్టజాలను. న్యాయాన్యాయముల మీరెరుగుట కవకాశముండదు.

నాకు బదునొకొండేండ్లు దాటినవి. యీయమ్మయు మాధవరావు భార్యయగు శకుంతలయు యెంతగనో విచారించుచుండెడివారు. కాని, నాకుమాత్రము వారి విచారములకు కారణము తెలిసెడిది గాదు 'మా యమ్మాయికి—ఆ! —యింకను దాచనేల?— నేను స్త్రీ ప్రపంచమునకు జెందినదానను— త్వరగా పెండ్లి అయ్యేలాగున చెయ్యి దేవుడా!' అని యెన్నియో మారులు మాయమ్మ ప్రార్థించు చుండెడిది. శకుంతల కొకవత్సరము యీడుగల పుత్రిక గలదు. ఆచిన్నబిడ్డ నా బిడ్డయనియే తలంచుచుండెడిదానను. పాలుబట్టుట, స్నానము చేయించుట బొట్టు కాటుక లుంచుట, మంచముపై పరుండబెట్టి ప్రక్కనే శయనించుట, యివియవి యననేల— ఆబిడ్డయే నాస్వంతముగ భావించి అంత

యు నేను చేయుచుండెడిదానను, అందులకు శకుంతల నన్నెంతయో పొగడెడిది. తన 'యిరుగుపొరుగువారందరితోడను నాగుణముల బొగడి యెంతయో చెప్పుచుండెడిది.

౪

ఏదియేని సంబంధము స్థిరపరుపవలయునని నిత్యమును శకుంతల భర్తతో చెప్పుచుండెడిది. మాధవరావును—నే నాయన నన్నగా భావించియుండుటచే యింతచనవుగా బిలచుట యలవాటు గాన చదువరులు నేను మర్యాద నెరుగనిదాననని మాత్రమును కొనవలదు—యెంతయో ప్రయత్నించెను. కాని నాయమ్మ వంటపుట్టి యని తెలిసినవారు నన్ను పెండ్లియాడుట అవమర్యాదకు కారణమని తలచి వెళ్ళిపోయెడివారు. నాయందచందముల గాంచిన యువకులుమాత్రము— యిప్పుడు నాకు తెలియుచున్నది. నాతో రహస్యసంబంధములు గలిగించుకొనదలచి యెంతయో ప్రయత్నించుచుండెడివారు. అందువలన నేను గడపదాటి బయటకు పో మానితిని.

౫

ఆరునెలలవరకును తీవ్రప్రయత్నములు జరిగినవి. మాయమ్మ జెంగగొని స్వర్గస్థురాలాయెను.

ఇంక నేనీప్రపంచమున నొంటిదానను, మాధవరావును కమలయు నన్ను మరింత గారాబముగా జూడదొడగిరి.

గ్రామమందలి వారలలో గుసగుసలు దేరినవి. ఎంతయోమంది యెన్నియో విధముల చెప్పకొన నారంభించిరి. మాధవరావునకు యెట్టి యవమానముల పాలుగావలసి వచ్చునో, లేక యెట్టి సాంఘిక బహిష్కారములవలన నెంతటి కష్టమువచ్చునో యనుభయముగలిగెను. ఇంక యెట్లులైనను పెండ్లిచేయక తప్పదని మాధవరావు నిశ్చయించుకొని తన గృహమునకు వచ్చిన ప్రతివారితోడను యెక్కడనేన యెవ్వరేని పెండ్లి

యాడుటకు సిద్ధముగనున్న యొకఁడున్నాఁడని యడుగుచుండెడివాఁడు... తుదకు నాకొకవరుఁడు సంభవించెను. మీరు నన్నుమాత్రము తొందరపడి తూలనాడవలదు. నే నొక్క నిముసమేనియు నాకు గట్టిబెట్టఁబడిన యాతనిని నావరుఁడని తలంపలేదు; తలంపలేను. అతనిభార్యయని పిలువబడుటకు నేనెంతమాత్రమును సహింపజాలను.

నాభర్తగా నిర్ణయింపఁబడినయాతఁడు యేబది వత్సరముల వృద్ధుఁడు; శరీరమంతయు ముడుతలు బడియున్నది. ఈతనికిది యేడవ వివాహము. ఈయన రైల్వేకంపెనీయందు సామానుల గుమస్తాగా నున్నాఁడు. వేతనము యిరువది రూపాయలైనను నెల కధమము నూటయేబది రూపాయలాదాయముకలదు. చెప్పమరచితిని యీయన పేరు సుందరరావు.

౬

వివాహమైన యొక వత్సరమునకే నాపునస్సంధానమహోత్సవము గావింప స్థిరపరుపఁబడెను. ఈయుత్సవము నాభర్తయింటనే జరుగవలసినదిగ నిర్ణయింపఁబడుటచేత నన్నాతఁడు తనగృహమునకు గొనిపోయెను.

ఆయన గృహమం దడుగిడితిని, ముందువాయంపైదువురు—. ఒక వితంతుబాలికయు, నలువురు బాలురును—కానుపించిరి. వారిని జూడగనే నాకేలనో జాలిగలిగెను.

ఆయింట కాలిడిన బదవనాఁడే నాపునస్సంధానోత్సవము; దీనినుత్సవమేయందురు; కానినాకు మాత్రము కుత్తుకను గోయుకత్తియాయెను.

నిర్ణయదినము. రాత్రితొమ్మిది గంటలసమయము. గ్రామమందలి సువాసినులందరును చిత్రవిచిత్రవర్ణములు గలదుస్తులుధరించి కలకలలాడు నవ్వు మొగములతో ఆయింటికి విచ్చేసిరి. కొంతకాలము కాపురముజేసి మంచిచెడ్డల నెరిగిన ప్రౌఢకాంతలు నాకడకువచ్చి ననుసింగారించియు, నాపుట్టుపూర్వవృత్తాంతములగూర్చియు నడుగ నారంభించిరి. నాయీడు యువతులుమాత్ర మందరొకచోఁగూడి చిరునవ్వులు పెదవుల

పై తాండవింపనోకించుక దూరమునుండి చూచుచుండెడివారే కాని సహజమగు లజ్జ నాకడకువచ్చి మాటలాడుటకు మాత్రము వారిని సాహసింపనిచ్చెడిదిగాదు.

రాత్రి పదిగంటలగుసరికి నన్నొక మందిరములో నాస్త్రీలు విడచి తలుపుదగ్గరగవైచిరి. ఆగది యెంతయో చిత్రముగ నలంకరింపబడియున్నది. ఎత్తుచాందినీ మంచము, అందమగు చిన్నబల్ల, ప్రక్కనే రెండు ఆసనములు, గోడలకెన్నియో చిత్రపటములు, సుందరకాంతులీను రెండుదీపములు, ఇవి యవి యననేల యెన్నెన్నియో వస్తువులతో మందిర మత్యంతరామణీయముగ నందములాగున నలంకరింపబడియున్నది. ఆదీపపుకాంతులలో ఆగోడలకు వ్రేలాడుచున్న యద్దములలో నామేననున్న యాభరణములు తళతళ మని మెరయుచుండుటను గాంచితిని. నామెడలంతయు సువర్ణమయము గావింపబడియున్నది. ఇంతలో నాయెదుటనున్న నొక యద్దమందొక ఛాయాపటముయొక్క ప్రతిబింబము కానుపించినది. అందు రెండువ్యక్తుల ఆకారములున్నవి. అందలి వారెవ్వరో తెలిసికొనవలయునను కోరిక జనించినది. వెనుకకుతిరిగి గోడను వ్రేలాడుచున్న చిత్రపటమును జూచితిని. అది యేలనో గాని నాకు భయముకలిగెను. అందొక పురుషుడును స్త్రీయును గానుపించిరి. ఆపురుషుడు నన్ను ప్రస్తుతము గట్టుకొనిన వృద్ధుడు. రెండవది యొకస్త్రీ ఆమెయే యాతని తృతీయకళత్రమని నాకు బోధపడినది. ఆమెపై నేత్రములుంచి చూచితిని ప్రక్క యద్దములో నాయాకారము నొకమారు చూచుకొంటిని. నాశరీరముపైనున్న బంగరు ఆభరణ లన్నియు ఆమె శరీరముపై నుండెడివని గ్రహించితిని.

మరల నామె వదనమువైపు దృష్టి నిగిడ్చితిని. నాహృదయమున భయమెక్కుడయ్యెను. ఆమె నేత్రములగ్నికణములాయెను. నీవు నా సౌఖ్యములను నాతొడవులను, మీదు మిక్కిలి నాభర్తృమనమును

అపహరింప వచ్చితివా? అని యామె యనినట్లు నాచెవులకు కొన్నిమాటలు వినబడినవి. ఆ యాగ్రహావదనబింబమును గాంచజాలక పోయితిని. ఒక్కమారుగ వెనుకకు రెండడుగులు వైచి కనులు మూసికొంటిని.

ఇంతలో ద్వారము తెరచుకొనియెను. నాహృదయమదరెను. లోనికి నాభర్త ముసి ముసి నవ్వులతో బ్రవేశించెను.

ఆతనిపై నాదృష్టి యొకమారు బడెను. భయమున నొక పెద్దకేక వేయవలయునని యనుకొంటిని కాని మరల ఆగితిని. ఆయన హస్తముల జాచుచు నావైపున వచ్చిరి. నాగాత్రము గజగజ వడకెను. వెనుకకు రెండడుగులు వైచితినిగాని దానివలన నాకేమియు భయము తగ్గలేదు. నేను మంచము కడకేగితిని. నా "భర్త" హస్తములు నన్ను చుట్టుకొన్నవి. నాదృష్టి చిత్రమందలి యాస్త్రీముఖమువంకకు ద్రిప్పి యుంచితిని నేనాతని కఠినహస్తముల జిక్కి గిజ గిజ దన్నుకొనుటకు గాంచిన చిత్రపటమునందలి యాస్త్రీయొక్క మారుగ క్రూరదృక్కుల బరపుటమాని కిల కిలమని నవ్వుచున్నట్లు నాకు కానుపించెను.

3

ఆరు మాసములు యెట్టులో గడపితిని. నేను మాత్రము నిజమును జెప్పుచున్నాను. ఒక్క నిముసమేనియు నీవృద్ధుని నాభర్తయని తలచియుండలేదు. అతని యింట మాయమ్మకువలె నేను వంటపుట్టినై పొట్టపోసి కొనుచున్న యట్లే తలంచు చుండెడి దానను, ఆ "శుభకార్యము"న తప్ప మరియెన్నడును నేనాయన యొసగిన యాభరణముల ధరించియెరుగను.

నాజీవన మెంతమాత్రమును సౌఖ్యమైనదని తలంపకుడు. నా "భర్త" యొక్క వితంతు తనయ నన్ను "అమ్మా" యని పిలచి యెంతయో వేళాకోళము చేయుచుండెడిది. మిగిలిన బిడ్డల నేనెంతటిశ్రద్ధతో జూచినప్పటికిని యిరుగు పొరుగు అమ్మలక్క లందరును నన్నెన్నియోవిధముల తిట్టుచుండెడివారు. ఇంతయేల! యింటియందలి సేవకులే గడప

దాటినవెనుక నన్ను దూషించు చుండుటనే నెన్నియోమారులు వింటిని. ఇంతకును నేనేమి సేయుట! అది నాకర్మము! నా "భర్త" నన్ను పుస్తక ములగాని పత్రికలగాని చదువుకొననిచ్చెడివాడుగాడు. ఇంతియేగాక గడపదాటి బయట కొకయడుగేనియునే నిడనొల్లరాదను కఠిన శాసన మును గావించెను..............................................

కొన్నాళ్ళకుసరికి నా "భర్త" మేనయల్లుడగు కృష్ణారావునకు కూడ రైల్వేయందే యొక యుద్యోగమాయెను. అతడును నా "భర్త" యింటనే యుండెను. కృష్ణారావు యిరువదియైదు వత్సరముల ప్రాయము వాడు; బుద్ధిమంతుడు; సంస్కారి. ఈతడొక్కడే నాపై జాలివహించి యుండెడువాడు. నాకెన్నియో విధముల ధైర్యమును జెప్పుచుండెడివాడు. నాకీ ప్రపంచమున మంచి చెడ్డల చెప్పుచు నాకై చింతించునది యీతె డొక్కడేయని పూర్తిగ నమ్మితిని.

అని రాత్రిసమయము. కృష్ణరావునకు భోజనమిడి ప్రక్కతలుపు కడనిలచితిని. నాటిదినమున పత్రికలయందొక యువతి యొక్కయు యువ కునియొక్కయు ఘోరహత్యలగురించి ప్రకటింపబడియున్న విషాదాంశ మును నాతడు నాకు తెలుపుచుండెను. ఆచరిత్ర నేటికిని తలచుకొన్న నాగుండియ లదరుచున్నవి. ఆమెబాలవితంతువు; తెగువజేసి వివాహమాడ కులగౌరవమునకు లోపము గలిగినదని ఆమెబంధువులు బాలికను ఆమె నుపెండ్లియాడిన యువకునికూడను వధించిరి.

ఈ విషాదచరిత్ర నాలించిన నేనెంతయు విచారించితిని. మాయి రువురి సంభాషణను ఆలించిన నా "భర్త" బిరబిర లోనికివచ్చెను. నా శిరోజము లాతనిచేత జిక్కెను. నేనా వందుయింటినుండి బిరబిర ఆయన ప్రక్కగది కీడ్వబడితిని. నాదేహము కంచీ దెబ్బల కాహుతియైనది. ఒడలు తెలియకుండ నేలవ్రాలితిని.

ఐదునిముసములలో మరల నొకమారు కనుల దెరచితిని. నా "భర్త" నాయెదుటలేడు. గృహము వెనుక దొడ్డిలో నెందరో పరుగు లిడుచున్నయట్లు చప్పుడుమాత్రము వినబడెను. ఏదియో యుపద్రవ ముండునని తలచి చూడవలయునని యాతురపడితిని కాని కదలజాలక యుంటిని.

ఉన్నకొలదియు, ధ్వని యెక్కుడాయెను. "చూచెదవేమి" అని నా భర్త కేకవేయుట నేనువింటిని. శారదా! ఇంక బ్రతుకుటసున్న" యను నార్తధ్వని వింటిని, నాకనులొకక్షణము చీకటులుగ్రమ్మినవి. మ రల చూచునరికి ఒక మొండెమును, ఒక శిరమును నాపదములకడ బడి యుండుటను గాంచితిని, భయమున—ఆశ్చర్యమున- లేచిచూచితిని- దానిని—ఆపడియున్న శిరమునుగాంచితి! 'ఆకృష్ణారావే!' యని యొక్క కేక వేసి నేలనా వ్రాలితిని.

కాని పాపమునకు—అక్రమునకు ప్రతిఫలముగ నా "భర్తకు" ద్వీపాంతరవాస శిక్ష విధింపబడ ఆంధ్రదేశమును కాదుకాదు—హిం దూదేశమునే వీడి అండమాను దీవుల కేగెను......నావలన తప్పుకల దేని—నానడతయందు నీలికళయున్న దేని నన్ను శిక్షింపుడు!

ఈవృద్ధుడు నాభర్తయా?—యీవిషయము నేటికిని నేనంగీకరిం పజాలని నన్ను పాఠక మహాశయులు మన్నింతురుగాక! నాదిమాత్రము తప్పుకాదని నానమ్మిక.



ఆల్బర్టు పవరు ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె, కాకినాడ 1929